# నాగరాజామాత్యుని

# నాటికలు

[ఏకాంకికల సంపుటి]

6




వెల. రు. 2-8-0.

1954

ఆంధ్ర మహిళసభ ప్రచురణము

జ్‌చర్చి రోడ్డు :: మైలాపూరు :: మద్రాస్-4

ప్రథమ ముద్రణము: 1000 కాపీలు.

ప్రథమ ముద్రణ హక్కులు:
'ఆంధ్ర మహిళా ప్రెస్సు' వారివి.

గ్రంథము దొరకు చోటు:

ఆంధ్ర మహిళ కార్యాలయము
(ఫోన్ నెం: 86961)
లజ్‌చర్చి రోడ్డు :: మైలాపూరు :: మద్రాసు-4

# తొలిపలుకు

సుదీర్ఘమైన పీఠికను వ్రాసిగాని, ఇతరులను ప్రార్థించి వ్రాయించు కొని గాని పాఠకులను బాధపెట్టడం నాకెంతమాత్ర మిష్టంలేదు. అయితే, రెండు మాటలను చెప్పడం అవసరమనుకుంటాను. లోగడ "పిచ్చి వాండ్ల పంచాయతి" అనే పేరుతో ఒక ఏకాంక నాటికల సంపుటమును ప్రకటించాను.

ఇప్పుడు విషయవైవిధ్యంగల మరొక ఏడు ఏకాంకిలను చేర్చి యువనటమిత్రుల ప్రోత్సాహంపై సంపుటి రూపంలో దీనిని పాఠక లోకానికి అందజేస్తున్నాను. దీనిలో సాంఘిక జీవనంలో రెండు తరగతులకు చెందిన ఇతివృత్తాలతో కూడిన రెండు నాటికలు, కేవలహాస్యరస ప్రధానములైన మూడు ప్రహసనికలు, ఒక చరిత్రాత్మక నాటిక, ఒక ఐతిహాసిక నాటిక వున్నవి.

వీనిలో "నవకవి", "మీసాలపక్షులు", "పుష్పబాణవిలాసం" అనే నాటికలు పీఠికాపురంలోను, ఢిల్లీ, మద్రాసు, బొంబాయి నగరాలలోను అనేక పర్యాయములు జయప్రదంగా ప్రదర్శించబడి ప్రేక్షకలోకపు మన్ననలను చూరగొన్నవి. "పుష్పబాణవిలాసం" హిందీ భాషలోనికి అనువదించబడి బొంబాయిలో ప్రత్యేకంగా ప్రదర్శించబడింది.

ఈ నాటికలలో వచ్చే పాత్రలు, సంభాషణలు కేవలం కల్పితములు. వీనిని ప్రదర్శించ గోరేవారు ముందుగా ఆ సంగతి నాకు తెల్పితే చాలా సంతోషిస్తాను.

ఈ గ్రంథాన్ని ప్రచురించిన ఆంధ్ర మహిళా సభవారికి నేను కృతజ్ఞుడను. ఇది నాటకకళాభిమానులకు, సహృదయులకు ఆదరాభిమాన పాత్రం కాగలదని నమ్ముతున్నాను.

ఇట్లు,
బుధజన విధేయుడు
బుద్ధవరపు నాగరాజామాత్యుడు.

మద్రాసు,
15-5-1954.

---

# అంకితము

*

అఖిలామయనివార కాయురారోగ్య ప్ర
దాయకవైద్య విద్యాగురుండు,
సంతాప బాధోపశమ సమర్థామృత
పూరితభాషణ భూషణుండు,
సంగీత నాటక సరససాహిత్యాది
సత్కళారాధ నేచ్ఛాపరుండు,
నిత్యంబు సప్తాద్రి నిలయవేంకటనాథ
పాదారవింద సేవారతుండు,

వక్కలంకవంశ వార్ధిరాకాసుధా
కరుడు కామరాజవరుడు మెచ్చ
నతియు, నుతి యొనర్చి నాగరాజామాత్యు
డర్థి దీని నిచ్చె నంకితముగ!



# విషయసూచిక

—:o:—

పాత్రలు.

రామం.

పరశు.

మణి.

# నవకవి

సాయంకాలము: కచేరీ సావడిలో గడియారం ఆరు గంటలు కొడుతోంది. బయట ఆకాశానికి చిల్లిపడ్డట్టు భోరున వర్షం; కన్నులు మిరుమిట్లు కొలిపేలాగ తీవ్రమైన మెరపులు; అప్పుడప్పుడు భయంకరంగా పిడుగులు పడుతున్నాయి. బంగాళా ఆవరణ అంతా గాఢాంధకారమయం.

కచేరీ సావడికి ప్రక్కనున్న విశాలమైన గది: రెండు పెద్ద కిటికీలు. లోపలికి కొద్దిగా జల్లు కొడుతోంది. ఆవల తోట గేటూ, గుమ్మం వరకూ వున్న రోడ్డూ కొంచెం మసకగా కనబడుతూంటాయి. గదిలో మధ్య, మందంగా పరిమళం వెదజల్లుతూ కొత్తగా వికసించిన గులాబీపువ్వు లమర్చిన చిత్రమైన చైనా గాజుకూజా వొకటి బల్లమీద వుంది. ఒక కిటికీకి క్రింది భాగంలో వొక త్రొక్కుడు హార్మోనియమూ, కుర్చీని. దాని కావలిప్రక్క దిండ్లతో అమర్చిన వొక పెద్ద సోఫా; ఇంకొక వైపు మంచి పేము కుర్చీలు రెండు. హార్మోనియం కుడితట్టున వొక బట్టల శ్టాండు. గదిలో మధ్య లైటు అఖండంగా వెలుగుతోంది.

లోపల వొక సుందరాంగి ఏదో ఆవేదనగా ఆలోచిస్తూ గవాక్షం లోంచి తీక్షణంగా బయటికిచూస్తూ నుంచుంది. ఆమె చక్కదనానికి తోడు బాగా శృంగారించుకుంది. పొడవూ కాదు, పొట్టీ కాదు; సన్నగా నాజూకుగా వుంది. కుందనం వంటి శరీరకాంతి. రోజారంగు సిల్కు జాకెటు, కనకాంబరం పట్టుచీర ధరించింది. ఉంగరాలు తిరిగి, సుందరమైన మొగము మీద గాలికి మెల్లగా నాట్యంచేసే నిగ్గయిన ముంగురులు. తలలో అప్పుడప్పుడే కళ్లు విప్పుతోన్న గులాబీపూలు. తెలివైన పలుకులు నేర్చిన సోగకన్నులు. నగలాట్టే ఎక్కువగా లేవు. వయస్సు ఇరవై యేళ్ళయినా పదహారుకంటే

ఎక్కువ వుంటాయనుకోలేరు చూసినవాళ్లు.

ఆమె యేమాలోచిస్తోందో, ఇంతలో చటాలున వచ్చి హార్మోనియం దగ్గర కూర్చుని వాయిస్తూ, అవ్యక్త మధురంగా పాడడం మొదలు పెట్టింది-

పాట : కన్నెగులాబికి కన్నులు విడెనా:
కంటకవనిలోనే పడునా!
రాతిరి నిద్దురలోతు మునుగునా;
రక్తహృదయమే రాగిలి తెగునా! ....కన్నె....

వాసనలకు భృంగమ్మిటు రాదో;
ఆసవమునకై ఆసయె లేదో;
ఈ సుమజీవిత మిష్టము కాదో? ....కన్నె....

నిముసపు బ్రదుకునకే కలవరమా!
నీలిచావునీడల కనికరమా? ....కన్నె....

ఇంతలో వొక యువకుడు— బిళ్ళ పంచెకట్టు, బెంగాలీ సిల్కు లాల్చీ, ఎడమ భుజముమీద త్రాడువలె వ్రేలాడ వేసిన మంచి అంచు ఉత్తరీయమూ వేసుకొని లోపల ప్రవేశిస్తాడు. అతని వయస్సు ఇరవై అయిదు. ముఖంలో ప్రతిభా, తెలివితేటలూ స్ఫురిస్తాయి. నిరతభావావేశంలో మునిగి కలలు కనే భారమైన, విశాలమైన కన్నులు. ముందుకు తొంగిచూస్తోన్న గడ్డం అత్యంతమైన ఆత్మవిశ్వాసాన్ని తెలియచేస్తోంది. చాలా నీటుగా తయారయాడు. వచ్చి వొక నిమిష మాలోచించి ఆమెను పలుకరించకుండానే మీద నున్న 'రెయిన్' కోటు విప్పి నీళ్ళు పోవడానికి వొక సారి దులుపుతాడు. ఆమె ఆ చప్పుడు విని వెనక్కి తిరిగి చూసి, చకిత అయి కొంచెం పవిట సద్దుకుంటుంది, పాట ఆపేసి. ఆమె మొగముపైన దైన్యమూ, దాన్ని కప్పిపుచ్చే మందహాసమూ వొక్క మారుగా పొడచూపుతాయి.

అతని మొగం మాత్రం గంభీరముద్ర దాల్చి వుంటుంది.

మణి : [మందహాసంతో] Hullo! ఎక్కడనించో అనుకోకుండా యింత హఠాత్తుగా వచ్చావే, తోకచుక్కలాగ! ఈమధ్య నెక్కడా నీ కబురే లేదు– నే నింకా జ్ఞాపక మున్నానా? ఇంత ప్రళయంలో ఏమిటీ అనుగ్రహం?

అత డిదంతా వినిపించుకున్నట్లు తోచదు. మనిషి వొణుకుతున్నాడు: చలిచేతో, ఆవేశంచేతో; పెదవు లదరుతున్నాయి. అలాగే నుంచుండిపోయి తదేకధ్యానంతో ఆమెకేసి పిచ్చివాడిలాగ చూస్తున్నాడు.

మణి : [చప్పున లేచి లోపలికి వెళ్ళి బీరువా తెరచి, వొక పళ్లెంలో కొన్ని బిస్కట్లు, వొక సాసరులోవున్న కప్పులో 'ఫ్లాస్కు' లోంచి నిండా కాఫీ పోసి తెచ్చి బల్ల మీద పెట్టి] రామం, ముందా సోఫా మీద కూచో, చాలా చలిగా వున్నట్టుంది; తడిసి పోయావు కూడాను. ఇవిగో యీ బిస్కట్లు తిని కొంచెం కాఫీ తాగు.... బాగుంటుంది-[ఆ బల్లను సోఫాకు దగ్గరగా లాగుతుంది.]

రామం : [అలాగే వెఱ్ఱిగా చూస్తూ] మణీ, నేనంటే నీకు ప్రేమ వుందా?

అప్పుడొక పెద్ద మెరపు మెరసింది; ఆ కాంతిలో ఆమె గులాబీ చెక్కిళ్ళొక తృటికాలం వింతగా వెలిగిపోయాయి.

మణి : ముందివి పుచ్చుకోవూ?

రామం : అలాకాదు, ముందు చెప్పాలి.

మణి : ఈ ప్రశ్న నా పెళ్ళికి ముందు వెయ్యవలసింది.

రామం : అప్పుడు వొప్పుకున్నావు కూడాను. కాని నేను బీదవాడినని మీ నాన్న వీలు లేదన్నారు. అంతే, ఇంతలో నీ కీతనితో వివాహ మైపోయింది. కాని నువ్వంటే నాకు జీవిత సర్వస్వమని నీకు

తెలీదూ? నిజంగా నా మీద ప్రేమే వున్నదానవైతే, నా హృదయం ఎందుకిట్లా భగ్నం చేసావు క్రూరంగాను? [కప్పులో కాఫీ అంతా వొక్క గుక్కలో త్రాగేసి సోఫాలో కూలబడతాడు, నిట్టూరుస్తూ]

మణి : నా తప్పేమీలేదు, రామం. ఇం కిప్పు డేమనుకుంటే ఏం లాభం? అంతా అయిపోయింది. [పేము కుర్చీ సోఫాకి దగ్గరగా లాక్కొని కూర్చుంటుంది.]

రామం : నీ తప్పేమీ లేదూ? నేనంటే నీకు ప్రేమే వుంటే, నువ్వు దూరమైతే నాకింక జీవితమే లేదని నీకు తెలుసును కదా, ఎందుకు నాకింత ఆశాభంగం కలిగించావు? నే ననుక్షణమూ అనుభవించే నరకబాధ నీ కర్థమౌతుందా? అబ్బ! నీకోసం తపించిపోయి ఎన్ని మంచి మంచి పద్యాలు రాశానో నీకు తెలుసా?

మణి : ఓహో, ఇదో జబ్బు కాబోలు ఇప్పటి కవికుమారులకి ! ఇంకా పద్యాలు కడుతున్నావూ నువ్వు?

రామం : సరి, నా జీవితమంతా కవిత్వంకోసమే ధారపోద్దా మని సంకల్పించా ననుకో—

మణి : [నవ్వుతూ] మరి నాకోసం అన్నావు కదూ?

రామం : అదే, అంటే నీకోసం కూడాను.

మణి : అప్పుడే నీ ప్రేమని రెండు భాగాలుగా చీల్చి అర్ధ భాగం నానుండి వేరు చేశావు. ఎంత నిశ్చలమైన ప్రేమ ! ఇలాంటి సగం సగం ప్రేమా నా కిచ్చేది? ప్రేమ చంచలము సుమా!

రామం : అబ్బే, ఇంతట్లోకే నువ్వలా తప్పు పట్టుకుంటే ఎలాగ? కవిత్వం కోసం ధారపోస్తానంటే, అది వేరు.

మణి : అయితే మునుపటిలాగే వ్రాస్తున్నావా? ప్రబంధధోరణా, భావ కవిత్వమా?

రామం : ప్రబంధ ఫక్కీని కూడా వ్రాయగలను కాని, ఈమధ్య అంతా భావ కవిత్వమే. భావకవిత్వంలో వుండే నూతనత్వమూ, సులువూ కనిపెట్టేను.

మణి : నేనూ అలాగే అనుకున్నాను. [బల్ల మీద వున్న పుస్తకంలో పేజీలు తిరగవేస్తూ వుంటుంది.]

రామం : ఎలాగ?

మణి : సులువని.

రామం : సులువంటే.... [ఆమె చేతిలో పుస్తకం చూసి] నీ చేతిలో ఆ గ్రంథం ఏమిటి?

మణి : [గ్రంథం చూస్తూ] 'పాండురంగ మాహాత్మ్యము.'

రామం : మంచిదే. కాని, తెనాలి రామకృష్ణుడు....

మణి : కవిసార్వభౌముడు. కవిత్వం విషయంలో నాకు ప్రాచీనులంటేనే అభిమానం సుమా— ఏదీ, పూర్వపు కవులకుండే కల్పనాచమత్కృతీ, పాండిత్యప్రకర్ష, ఇప్పటి కవులనిపించుకొనే వాళ్ళల్లో వొకళ్ళ దగ్గరైనా చూపించు?

రామం : ఏం? నాదగ్గర లేవూ?

మణి : నీ వొక్కడి సంగతీ కాదు.

రామం : ఇతరుల విషయాలు మనకెందుకు, ఇప్పుడు?

మణి : నా సొంత విషయాలతోటి నా కిప్పటికే కావలసినంత విసుగెత్తి పోయి వుంది; ఇతరుల విషయాలైతేనే మాట్లాడుకోడానికి కొంచెం కులాసాగా వుంటుంది.

రామం : అయితే కవిత్వం పాత చింతకాయ పచ్చడా, ఎంత ప్రాచీనమైతే అంత పథ్యంగా వుండడానికి?

మణి : కాదు, రసస్వరూపమే! పూజ్యమైన కవిత్వం అంటే, లక్షణ యుక్తంగా నిర్దుష్టమైన కావ్యం వొక్కటీకూడా సొంతం చదువుకోకుండానే, ఏదో యూనివర్సిటీలో ఇంగ్లీషుతోపాటు అర్థం తెలీని వేవో రెండు తెలుగు సెలెక్షన్లుకూడా చదివినంతమాత్రాన అలవడుతుంది కాబోలు తేలికగా?

రామం : అలాగని ఎవ రన్నారు?

మణి : ఏదో—ప్రేయసీ, విరహమూ, తాపమూ, అశ్లీలమూ— ఇంతేగా యిప్పటి కవిత్వం? ఏదేనా పత్రిక చూద్దా మనుకోవడం భయం! ఎప్పుడూ వీళ్ళ దొకటే గోల. అదైనా, ఎవడో వొక మంచి కవి తను నిజంగా అనుభవించినది చక్కగా వ్రాస్తే తక్కిన వాళ్ళంతా గుడ్డిగా, అసహ్యంగా దానిని అనుకరించడమేగా?

రామం : ఆహా, కవిత్వం మీద ఏమి అద్భుతమైన అభిప్రాయము! నేను ప్రెస్ రిపోర్టర్ని కాను. అయినా, నీ సందేహం పోగొట్టి ఆధునిక కవిత్వానికి ప్రాప్తించిన కళంకం తీర్చడం కవినైన నాకు విధి.

మణి : నీ విధిని పద్యాల్లో నిర్వర్తించేవు గనక, పుణ్యముంటుంది!

రామం : ఈ దుఃఖపూరితమైన కవిత్వం వ్రాయడం ప్రతీ యువకవికీ నైజం; అందులోనూ ఆశాభంగం పొందినవాడికి మరీని. కవి యేమన్నాడు :

'వఱదవడి దట్టముగ గట్టు లొరయునపుడు
గండి తెఱచినచో తటాకంబు తెగదు ;

విపుల శోకంబుచేత క్షోభించునపుడు
బిట్టు విలపించుచో గుండె వ్రీలిపోదు !'

కాబట్టి, సామాన్య మానవుడు ప్రక్కవాళ్ళతో చెప్పుకొని దేవుల్లాడతాడు; అదే కవి అయితే చదివే వాళ్ళు తనతో 'ఫీలు' అయేటట్టు మంచి మంచి పద్యాలలో ఏడుస్తాడు.

మణి : ఆధునిక కవులంతా పోగై నీకు ధన్యవాదాలు అర్పించవలసి వుంటుం దనుకుంటాను!

రామం : ఇంక ప్రబంధాలల్లో అన్నావు— అందరు కవులదీ వొకటే ధోరణి అదో 'రూలు' కింద పెట్టి, అవసరమైనా కాకపోయినా అన్ని వర్ణనలూ గుచ్చెత్తడం. వాటిలోని వర్ణనలూ, వస్తువులూ అన్నీ పరకీయములు. తమ సొంత అనుభవాలని రసవంతంగా వ్యక్తీకరించడానికి అందులో తావులేదు: ప్రపంచాని కసలు మూలం అహం కదా....

మణి : కాదు, అహం! నా పేరు మనీ (Money)— 'ధన మూలమిదం జగత్' అన్నారుకదూ?

రామం : [నవ్వి] అచ్ఛా, నువ్వు సంభాషణని సజీవంగా చేస్తావు, మణీ. అందుకనే నువ్వంటే.... కాని నామాట కడ్డువచ్చావు; చిన్నప్పటినించీ ఇంతే నువ్వు— ఆఁ, పాత కవులలో మంచివారి దొక్క కావ్యం చదువుకుంటే చాలు; వారినుండి మనకు లభించే దొక్క భాషాజ్ఞానము మాత్రమే. తక్కినదంతా పొల్లు; వట్టి Arm-chair poetry.

మణి : చాల్లే; పురాణ కవులని నిరసించకు, కుకవినింద చేయించగలను! ప్రబంధాలు చదవకుండానే నువ్వీమాత్రం వరకూ వచ్చేవు కాబోలు.

ఇంగ్లీషులో ఆధునికులు మాత్రం 'క్లాసిక్స్' (Classics) చదువుకోకుండానే గొప్పకవులయారా?

రామం : నేను చదువుకోలేదన్నానా? ఎంతవరకూ అవసరమో అంతవరకూ చదివేను.

మణి : అన్నట్టు మీకు వ్యాకరణాదులతో నిమిత్తం లేదుగా; వాటిని బుద్ధిపూర్వకంగా విస్మరించగలరు! ఇంక ఎటొచ్చీ కొన్ని పద్ధతుల కోసం, పదముల కోసం పాత పుస్తకాలు విధిలేక చదువుతారు.—

రామం : కొందరు. అవన్నీ చదువుకోవడం పండితుడవడానికి గాని కవి అవడానికి కాదు. కవికి అటువంటి క్షుద్రవిషయాలతో కాలయాపన చెయ్యడానికి కుదరదు. కవిత్వం అనేది వాక వుప్పెన వంటిది. ఆ అనివార్యశక్తిని ఆపడానికెవడి వశమూ కాదు. ఆ ప్రళయజలధిలో, ఆ ఊహామహాతరంగాలలో ఊగులాడుతోన్నప్పుడు, ఏ క్షణంలో ఏ పద్యం వ్రాయవలసివస్తుందో మాకే తెలియదు—భావావేశమూ, సద్యోధార....

మణి : [అపహాస్యముగా] ఆగు మాగుము!

రామం : అదీకాక, అసలు చదువుకోనివాళ్లు పద్యాలు వ్రాస్తున్నారని నిందించావు— అది పొరబాటు: చదువుకోకుండా బాగా వ్రాయడం దుర్లభం; ఒకవేళ వ్రాసినా చదువుకోనివాళ్ళు వ్రాసినట్టే వుంటుంది.

మణి : చదువుకోనివాళ్ళు వ్రాసి, చదువుకొనే వాళ్ళని బాధ పెట్టడం ఎందుకని.

రామం : ఎవరో కొందరలా వ్రాశారని నేటి కవితా ప్రపంచాన్నంతను దూషించడం తప్పు. ఏమయినా, కవిత్వం అంటే వారికుండే ఉత్సాహమూ, అభిరుచీ మనం గుర్తించి వారి నభినందించాలి.

వారు కూడా ఏవో అపరూపానుభవాలు కలిగి హృదయంలో వాట్ల నిముడ్చుకోలేక పద్యాలు వ్రాసి ప్రకటిస్తారు— అసలు కవిత్వానికి ప్రాణమేమిటి? Sincerity and honesty, అనగా సత్యత, నిష్కాపట్యమూ—

మణి : సరేకాని, పూర్వపు పురాణకథలన్నీ ఇష్టం వచ్చినట్టు, అసహ్యంగా తారు మారు చేసి వ్రాస్తోన్నవాళ్ళ మాటో?

రామం : నీ కాట్టే విసుగు లేకపోతే దీన్ని గురించి విపులంగా చెబుతాను.

మణి : తీరా అడిగేనుగామరి ; విసుగెందుకు ?

రామం : అలా వ్రాయడంలో అభిప్రాయం లేకపోలేదు. నేనూ అలా వ్రాసే వాళ్ళల్లో వాణ్ణే అని నీకు తెలిసే యిలా అంటున్నావు; నా 'సావిత్రి' చూశావన్నమాట....

మణి : చూడవలసి వచ్చింది !

రామం : పురాణాల పరమోద్దేశ్యం, అప్పటి జనసామాన్యానికి ఆదర్శప్రాయమైన నీతినీ, శీలాన్నీ కరపడానికేనని నీకు తెలుసును. అవీ కవులు వ్రాసినవే; కల్పితములే. కాని సంఘనియమాలు కాలానుగుణ్యంగా మారిపోతోంటాయి. అందుచేత, ఏనాడో తాత్కాలికంగా సంఘోపయోగార్థం నిర్మించబడిన ఆదర్శాలు, బాగా విజ్ఞానం ప్రబలిపోయి, మూఢనమ్మకాలు చాలా వరకూ రూపు మాసిన నేటి జనానికి పనికిరావు— పూర్వం హరిశ్చంద్రుడు సత్యవ్రతం కోసం సకల యిడుమలూ పడి తన సర్వస్వమూ గోలుపోయి లోకంలో భేష్ అనిపించుకున్నాడు. కాని ఇప్పుడెవడైనా హరిశ్చంద్ర మహారాజు లాగ అర్థ నిజమే చెబుతానని బయలుదేరితే, ప్రజలకి హాస్యాస్పదుడై వెర్రివా డనిపించుకుంటాడు. ఇప్పుడు మనకి కావలసింది

సత్యవ్రతం కాదు; చక్కగా నమ్మించేటట్టు అబద్ధమాడడం! ఇదే ప్రపంచంలో పైకి రావడానికి ప్రస్తుతం గొప్ప సూత్రం; లేకపోతే అధఃపతనమే.

మణి : నువ్వు కొన్నాళ్ళు కాంగ్రెస్ వాళ్ళతో తిరిగేవేమిటి? లేక ఏదైనా కాలేజీలో ఉద్యోగమా?

రామం : లేదు. వెనక అబ్‌కారీ డిపార్టుమెంటులో కొన్నాళ్ళు పని చేశాను అంతే— ఏం?

మణి : ఉపన్యాస ధోరణి బాగా పట్టుపడిందిలే— 'బరన్స్' (Burns) మద్యం అమ్మినా మధువులాంటి కవిత్వం వ్రాసిపోయాడు—కాని కవిత్వానికీ ప్రపంచంలో పైకి రావడానికీ అసలెక్కడైనా సంబంధం వుందా?

రామం : నేను చెప్పబోయేదదే—అందుచేత,

మణి : ఎందుచేత?

రామం : పురాణాదర్శాలు ప్రస్తుతం పనికిరానందుచేత, తెలివైన కవికి— కవి సామాన్య మానవుడికంటె దూరదృష్టి వున్నవాడు గనక— కాలానుసారంగా ఆదర్శాల ననుకూలంగా మార్చి లోకాన్ని నడిపించడం బాధ్యత; సరిపడని పాతమార్గాల నవలంబించి జనులు మోసపోయి సర్వనాశనం చేసుకోకుండాను....

మణి : అలభ్యవస్తువులకొరకు ఆశపడడం ఆదర్శమని నిర్వచనం వుండిగా? ఇప్పుడు కొత్తగా పురాణఋషులకంటే ధీమంతులు బయలుదేరి ఆ పవిత్రాదర్శాలని మార్చి మరామత్తు చెయ్యక పోతేనేం?

రామం : కారణం చెప్పేను కాదూ? ఇంతకీ, ఇప్పుడు కొత్తగా ఎవడేనా కవి తన ఆశయాలను ప్రకటించడాని కొక కథను కల్పించి

ప్రబంధం వ్రాశాడంటే—'ఆఁ, చదివీదేమిటిలే; ఉత్కృష్టమైన పూర్వప్రబంధాలనే చదవడానికి తీరికలేదు'—అంటారు. అదే మరో పురాణ కథను తీసుకొని తన నూతన భావాలని అందులో చిత్రించాడంటే— 'వీడి సొంత మాటలలో ఎలా వ్రాశాడో చూద్దా' మనిపిస్తుంది; కవి ప్రతిభా బోధపడుతుంది. ఈ విషయాన్ని గురించి ఇంకా ఎంతో చెప్పొచ్చు....

మణి : చాలు. నువ్వు చెప్పిందంతా బాగానేవుంది కాని పూర్వపర సందర్భం మాత్రం కుదరటం లేదు. చక్కగా నమ్మించేటట్టు అబద్ధమాడాలని అంటున్నావు. సరే; మరి ఇప్పుడేకదూ కవిత్వానికి ప్రాణం సత్యమని చెప్పేవు? స్వవచన విఘాతం!

రామం : సత్యంకాదు, రామం అని చెప్పవలిసింది!—అబ్బ! పూర్వపర సందర్భాలని చూసుకుంటూ కూర్చోడాని కిప్పుడు వ్రాసే వాళ్ళల్లో ఓపికెవడికుంది, అది నీతిబోధకులకీ నిరుద్యోగులకే చెల్లింది కాని?— అయినా పూర్వం పరం నేను చూస్తున్నానని నీతో చెప్పినట్టు జ్ఞాపకం లేదే—

మణి . ఆహా, బాగావేశావు కప్పదాటు! అది ప్రతిభాశాలి లక్షణం కాబోలు—-అయినా నీమాటలు వింటోంటే నాకెంతో ఆనందంతో ఎందుకనో వొళ్ళు తెలీదు, రామం.

రామం : అలా తెలియనప్పుడైనా నన్ను కరుణిస్తే ఎంత బాగుండును? అసలు నే వొచ్చిన పనొకటీ, జరిగే దొకటీని.

మణి : పోనిద్దూ, ఈ గొడవే బాగుంది; మనలో ఎవరికీ నమ్మకం లేని ప్రేమ విషయం చర్చించి వృథాగా కాలయాపన చెయ్యడంకంటె! ప్రపంచంలో ఏవ్యక్తి అయినా సరే, తను ప్రేమేతరములైన

విషయాలకి వినియోగం చేసే కాలంలో కొన్నవంతు సేపయినా మరొకవ్యక్తిని ప్రేమిస్తూ వుండలేదు తెలుసా? ప్రేమ అనేది తాత్కాలికము — పశువులూ అంతే; పశుసంతతి యైన మానవులూ అంతే.

రామం : వట్టి వాస్తువాదము.

మణి : పరిణామసిద్ధాంతం కూడాను.

రామం : ఇక్కడ కొంచెం అభిప్రాయభేదం వుంది నాకు.

మణి : ఇప్పుడు కొంచెం గౌరవం కలుగుతోంది నీ మీద.

రామం : అదేమిటి?

మణి : అభిప్రాయభేదం లేకపోతే సంభాషణలో రుచే పోయింది. ఇప్పుడు నీకు పౌరుషం వుందని తెలుస్తోంది.

రామం : నేను అబలను కాదుగా.

మణి : అది, ఆడవాళ్ళు అమాయికంగా వుండే కాలంలో స్వార్థంతో మొగవాళ్ళు వుంచిన పేరే.

రామం : అంటే పురుషులు మొదటినించీ తెలివైన వాళ్ళన్నమాట.

మణి : కాదు; స్త్రీలు కోమలస్వభావం కలవాళ్ళన్నమాట.

రామం : ప్రేమలో ఈ విశ్వాసరాహిత్య తీర్మానం ఎప్పటినించి?

మణి : వివాహం అయినప్పటినించీని; 'ప్రేమకు తుదిచీటి పెండ్లి కాదె!' బొత్తిగా ప్రేమపూరితమైన హృదయాలుగల భార్యలూ భర్తలూ తమను కట్టుకున్నవారి జీవితాలకి గుదిగట్లు లౌతారు; వారి జీవితాలకి ఎదుగూ పొదుగూ వుండదు. ఉత్సాహమూ, కార్య

శూరత్వమూ నశించి అయిదేళ్ళల్లో అరవై ఏళ్ళ ముదిమి వచ్చి మూలపడతారు.

రామం : సామాన్య సూత్రాలకి ఆటవిడుపు లుంటాయి.

మణి : మా జీవితం అంతా ప్రేమకోసమే వెచ్చిస్తామనే వాళ్ళది వట్టి నాటకం! అది ఏమీ తోచనప్పుడు చదువుకోడానికి పుస్తకాల్లో వుండే విషయం; అనుదినాచరణీయం కాదు.

రామం : అమ్మయ్యో, నువ్వే అలా అంటే నేను భరించలేను. ఇలా చూడు, మణీ, నిన్నొకసారి చూస్తే చాలు—ఎంత ఆవేదనతో వచ్చాను— కాని నా హృదయంలో రగిలే ఈ చిచ్చు నార్పుకోలేనింక. పోనీ, నన్ను ప్రేమిస్తున్నానని అను: అంతే చాలు. నీ దివ్యసుందర మూర్తిని నా హృదయంలో చిత్రించుకొని ఆరాధిస్తూ ఇంక నిశ్చింతగా ఈ నా విషాదజీవితాన్ని గడుపుతాను.

మణి : నాకా ముఖస్తుతు లెందుకు? అంత దివ్యసుందరమూర్తిని కాక పోయినా చక్కగా వుంటాను; తయారవుతాను.

రామం : నాకు తయారవడంలోనే ఎక్కువ నమ్మకం. సహజ సౌందర్యం, సహజసౌందర్యం అంటారుకాని ప్రతీవ్యక్తి చక్కగా అలంకరించు కోవడం నేర్చుకొని ఆకర్షణీయంగా వుండాలని నా మతం.

మణి : హిందూమతమూ, క్రైస్తవమతమూ మొదలైనవుండగా మళ్ళీ నీదో మతమా!

రామం : కాదు, అదొక కళ—

మణి : ఏది?

రామం : అబ్బ, శృంగారించుకోవడం ఒక విశిష్టమైన కళ; లేకపోతే శరీరములన్నీ వొకటే మాదిరి.

మణి : [లేచి, రామం ప్రక్క సోఫాచేతిమీద కూర్చుని] అయ్యో, రామం, ఇంత తెలిసిన వాడివి యీ మాత్రం గ్రహించలేవూ? అంత నిన్ను నేను ప్రేమిస్తున్నాననే వొక్క మాటతో ఏ జీవితం అంతా గడుపుకో గలిగే వాడికి నా ప్రసక్తే అవసరం వుండదే. అసలు ప్రేమ రహస్యం అదికాదు: నీకు నేనే కావాలి; నామాట కాదు, అవునా?

రామం : నీ తర్కం చాలా చిత్రంగా వుంది.

మణి : ఉన్న సంగతి దాచకుండా చెబితే చిత్రంగానే వుంటుంది. మీ పెంకుటింటిమీద బ్రహ్మచెముడుచెట్లు మొలిచి పాడిల్లులాగ వుందనిగాని, మీ నాన్నగారికి స్నేహితుల్ని మర్యాద చెయ్యడం తెలీదనిగాని చెబితే. అది నిజమే అయినా కోపం కూడా వస్తుం దొక్కొక్కప్పుడు.

రామం : [నవ్వి] ఏదో నా సంగతే చెప్పబోతున్నావు?

మణి : కాదు. అశాశ్వతమైన భౌతికశారీరకాలతో మాకు నిమిత్తం లేదు, ప్రేయసిని హృదయంలో పెట్టుకుని పూజిస్తూ సంతోషిస్తామని కొందరు అతి తెలివైనవాళ్ళు, ప్రేమసంఘర్షణంలో అశాభంగం పొందినవాళ్ళు. విధిలేక సరిపెట్టుకుంటోంటారు; లేకపోతే వారి జీవితం మరీ దుఃఖభాజన మైపోతుంది గనక.

రామం : నాకు ఆశాభంగమే రూఢి చేశావా?

మణి : సంగతి చెప్పేను....

రామం : సరే, ఇంక చెప్పు.

మణి : సత్య మాలోచిస్తే ప్రేమకి ముఖ్యవస్తువు శరీరమే! ప్రకృతీ మర్మం చూడు— ఒక స్త్రీ వొక పురుషుడూ తారసిల్లారంటే,

లోహాయస్కాంతాలకివంటి వొక విధమైన అవ్యాజాకర్షణ ఏర్పడుతుంది వారి మధ్య; ఇది ప్రాణికోటికి సహజం. ఇందులో వారి వారి తరగతులకు తగ్గట్టు ఏరుకోవడం వుంటుంది. నేను బాగా చదువుకొని, ఇంత షోకుగా సినీమా నటిలాగ తయారయాను గనకే నన్ను నువ్వు ప్రేమించగలుగుతున్నావు!

రామం : అవును. అసలు నువ్వంటేనే నాకు ప్రేమ; ఇదంతా నా అదృష్టం....

మణి : అప్పుడే అదృష్టంమాట ఎత్తకు; అదృష్టం ఒక్కొక్కప్పుడు అదృష్ట మైపోతుంది!

రామం : అబ్బే, నేను నిన్నే ప్రేమిస్తున్నాను—

మణి : అదే, ఏదీ చూద్దాం, ఇంకొక సంస్కారము లేని యే పాచి పని చేసే వెంకినైనా ప్రేమించగలిగేవేమో చూడు!

రామం : అసంభవమూ, అసందర్భమూను.

మణి : అంత యెందుకు? నేనే రేపు ఇద్దరు పిల్లల్ని కని, ముసలి వాలకం వచ్చి, పళ్లూడిపోయి, వొళ్ళు సడలిపోతే నన్ను నువ్వింకా ప్రేమించగలవా? అసలు వస్తువే లోపిస్తే ఇంక ప్రేమ దేనిమీద? ఏమంటావు?

రామం : [ఒక దీర్ఘ నిశ్వాసం వదిలి] అయితే నాకింక నిష్కృతి లేదంటావా? నన్ను ప్రేమించవూ?.... మణీ, నీ వివాహాన్ని సమ....

మణి : సమర్థిస్తున్నాను. నువ్విందాకా చెప్పిన కవే అన్నాడు:

'వస్తువుల గూర్చు నంతరుపాధి యేదొ,
బహిరుపాధులచేత నేర్పడదు ప్రేమ;

ప్రొద్దువొడువంగనే తమ్మిమొగ్గ విచ్చు;
కలువచెలికాని గని చంద్రశిల కరంగు !'

అలాంటి చక్షూరాగమో, తారామైత్రమోవుంటే బాగుంటుందని కవి ఆశయము; అంతేకాని అది యిప్పటి మన క్షుద్రవాతావరణానికి పని చెయ్యదని నా నమ్మకం—Love at first sight ట ! అది ఆదర్శము; అంతే.

రామం : అయితే ఏమంటావు?

మణి : అదీకాక, వివాహాలు, ఎక్కడో లేని బ్రహ్మదేవుడిచేత ముందుగానే ఆకాక్షింపబడి, సూత్రీకరింపబడతాయన్న గ్రుడ్డి నమ్మకం నాకు లేదు. వివాహం, సృష్టిసంకల్పాభివృద్ధికోసం కేవలం మానవకల్పితమైన ఒక కట్టుబాటు. ఈ నిర్బంధమూ, యీ నిబంధనా లేకపోయినా బహుజన సంఖ్యాభివృద్ధికి లోటు రాదు కాని, ఇది లేకపోవడంవల్ల కొన్ని అనర్థా లున్నాయి: రోగాలూ, నీచసంతానమూ దీని ఫలితాలు. ఇంక నా....

రామం : అబ్బ, నీ సాంఘికశాస్త్ర (Socialogy) పరిజ్ఞానానికి నాకు చాలా సంతోషంగా వుంది—అయితే, మణీ, నా గతి యింతేనా? ఒక్క అభయ వచనం చెప్పి నన్ను బ్రతికించి పుణ్యం కట్టుకోవూ?

మణి : నీవంటి అల్పసంతోషిని నేనెక్కడా చూడలేదు, రామం.

రామం : అవునుగాని, నన్ను ప్రేమిస్తానని చెప్పవూ? ఒక్కసారి, ఆ వొక్క ముక్కతో నేను బ్రహ్మానందం పొందుతాను.

మణి : నిన్ను చూస్తే జాలివేస్తుంది, రామం. నీ మనస్సు నొప్పించలేను. అందుచేత నన్ను పూర్తిగా మర్చిపో. నీకు సరిపోయే లక్షణాలు

గల మంచి పిల్ల నెక్కడైనా వెతికి తీసుకొస్తాను: ఆమెను వివాహమాడి సుఖంగా వుండు.

రామం : అమ్మయ్యో, నిన్ను మరిచిపోవడమే! ఈ జన్మలో కాదు. ఎంత సులువుగా చెప్పేవు. నీకోసం నేనింక పెళ్ళిచేసుకోను, తెలిసిందా?

మణి : నన్ను బెదరించకూ మరి....

రామం : మరిచిపో, మరిచిపో అనడమేకాని నువ్వుమాత్రం నన్ను నిజంగా మరిచిపోగలవా?

మణి : అవునులేకాని, అంతా ముగిసినతరవాత ఇప్పుడొచ్చి నన్ను బాధించి ఏంలాభం చెప్పు? ఈ విషయ మింక నాతో ప్రసంగించినా, ఆ యిటుకగోడతో ప్రసంగించినా ప్రయోజనం వొకటే.

రామం : నాకు ఇటుకగోడతో ప్రసంగించడమే ఎక్కువ యిష్టం: నా మాటల కన్నింటికీ అవు నన్నట్టు మాటాడకూరుకుని ప్రతివచనం చెప్పదుకనక!

మణి : ఏం చమత్కారం! అయితే చెబుతాను విను— నేను బాగా చదువుకుని నవనాగరకపు టలవాట్లన్నీ నేర్చుకున్నాను: నాకు ఖర్చులకి బోలెడు కావలసివస్తుంది. అదే నిన్ను పెళ్ళి చేసుకుంటే నువ్వు తెచ్చేది మనిద్దరికీ కాదుకదా నాకే చాలదు.

రామం : నే నామాత్రం సంపాదించలే ననుకున్నావా? నీకు నా మీద నమ్మకం వుండాలిగాని నువ్వు కనుసన్న చేసినంత మాత్రాన నీ అభిప్రాయం గ్రహించి ఉత్సాహంతో ఎంత సాహస కృత్యమైనా ఆచరించి నీ కోరిక నెరవేర్చగలను; ఇంతెందుకు, నా హృదయమే నీ కర్పిస్తున్నానే—

మణి : నేను కనుసన్న చెయ్యనూవద్దు. నువ్వు అనవసరంగా సాహస కృత్యాలు చేసి కాళ్లూ చేతులూ విరుచుకోనూ వద్దు; వట్టి హృదయం ఎందుకు? సంగతి చెప్పేను. ఎంత చెడ్డా కవివి కదా నమ్మడానికి?—ఊఁ, ఈ పెద్ద అలవాట్లు వొకసారి చేసుకున్నాక మళ్ళీ పోగొట్టుకోలేము చూడు. అందుచేత, ఆయన్ని— బాగా డబ్బుంది, పెద్ద వుద్యోగం, బాగుంటారు కూడాను— పెళ్ళి చేసుకున్నాను; అంతేకాని నీ మీద ప్రేమలేక కాదు....

రామం : అమ్మయ్య! [ఆశతో చూస్తూ కొంచెం దగ్గరగా జరుగుతాడు.]

మణి : [అతని బుజంమీద చెయ్యివేసి నిట్టూర్చి] నా కిప్పు డెంతో హాయిగా జరుగుతోంది. ఆయనకీ నేనంటే అమితమైన ప్రేమ....

రామం : [ఆనందంతో] ప్రేమించక చస్తాడేమిటి? అదే నీలో వున్న గొప్ప విశేషం!— నీమీద నాకుండే ప్రేమకు హద్దు నీకెలా తెలియచెప్పగలను, మణీ?

మణి : చెప్పలేకపోతే పద్యం చివర చుక్కలు పెట్టడం మామూలేగా. ఆడదాని చెవిలో హమేషా ప్రేమ వచనాలు ఊదుతూ వుండాలనే పురుషసూక్తం నీకు గట్టిగా పట్టినట్టుంది: ఇలాంటి వెఱ్ఱి నమ్మకాలు చాలా ప్రమాదం. నువ్వు వేరే చెప్పాలా? నే నెరుగుదును. అయితే చిన్ననాటినించీ గాఢంగా ప్రేమించిన నిన్ను నా హృదయంలోంచి ఎన్నటికైనా వేరు చెయ్యగలనా, నా రామం? మన మెప్పుడూ స్నేహంగా వుందాం. అసలు నువ్వింక కనపడ వేమోనని ఎంతో బాధపడిపోతున్నాను, రోజూను; లోపల లోపల కుమిలిపోతున్నా ననుకో నిజంగాను....

రామం : నిజంగానే! నా చెవులు సరిగానే వింటున్నాయా? లేక యిది స్వప్నమా?

మణి : స్వప్నమూ కాదు, 'సోమునాంబులిజమూ' కాదు; నువ్వు సరిగానే వింటున్నావు— నన్ను చెప్పనివ్వవూ?

రామం : ఊఁ, చెప్పు. నేను నాలో లేను.

మణి : ఆయనతో ఇవాళ నీకు పరిచయం చేస్తాను.

రామం : ఎందుకూ ? వొద్దు.

మణి : [కొంచెం విసుగుతో] అయ్యో; నువ్వీవూళ్ళోనే స్థిరపడిపో: రోజూ వస్తూ వుండొచ్చు.

రామం : అంతకంటేనా, తప్పకుండాను.

మణి : [ఆలోచనగా] నా చర్యలలో చాలామందికి అర్థం కనపడదు. నన్ను పట్టి దుశ్చరిత్రగా చూస్తారు. ఈ పాడు సంఘాన్ని భర్త అనే బురఖా వేసుకొని మోసం చెయ్యకపోతే హృదయ వాంఛలకి ఫలప్రాప్తి లేదు. ఈ గ్రుడ్డిలోకానికి పవిత్ర ప్రేమయొక్క ఔన్నత్యం తెలీదు: అందుకనే యీ **Diplomacy!**

రామం : ఆహా, ప్రేమలో **Politics: Ingenious!** — మణీ, నాకు పట్టలేని ఆనందంతో మతి పోతోంది; నా కృతజ్ఞతా పూరిత హృదయకుసుమ....

మణి : ఉండు మరీ— నిన్నసలు విడిచి నేనుండగలనా, నా రామం? నీకు తెలీదూ నా హృదయం? [కొంచెం ఆగి] ఏం మాట్లాడవు?

రామం : హా, చచ్చితిని!

రామం వొక్క గంతువేసి లేచి ఆమెను చేయిపట్టుకుని దగ్గరకు లాక్కొని చెయ్యి ముద్దు పెట్టుకుంటాడు. ఇద్దరూ సోఫామీద కూర్చుంటారు, దగ్గరగా.

రామం: [కాలుమీద కాలు వేసుకుని వూపుతూ] ప్రేయసీ! [మణి నవ్వు కుంటుంది.] మన దరిద్ర దేశంలో కవులకి పరపతి లేదు! పత్రికలకి వ్యాసాలు వ్రాస్తే వొక కానీ అయినా రాదు. ఊరికే పద్యాలు ప్రకటించడానికే ఎన్నో సిఫార్సులు కావాలి. ఇదే పాశ్చాత్య దేశాలలో అయితే వ్యాసకర్తలకి ఎంతో గౌరవమూ, దానితోపాటు ధనలాభమూను. మనవాళ్ళు. పత్రికలూ పుస్తకాలూ వూరికే ఎవరేనా యిస్తే చదువుతారుకాని వొకళ్ళూ సొంతంగా కొనుక్కోరు; వీళ్ళకి ఆత్మగౌరవం లేదు—సరేకాని, మణీ, నేను నిజంగా కోకిలను: కోకిల ఎలాగ వసంతంలో లేమావి చిగుళ్ళు మేసి పైకి గొంతెత్తి పాడుకోకుండా వుండలేదో, అలాగే నేనూ నా విరహగీతాల్ని పాడుకోకుండా వుండలేను సుమా!

మణి: కాదు, కాదు; కానీ అయినా ప్రతిఫలం రాకపోయినా గొప్ప కోసం, పేరు కోసం పత్రికలలో ప్రచురించకుండా వుండలేవు! నీలాంటి వాళ్ళకి పత్రికలవాళ్ళు డబ్బివ్వ లేదంటే వాళ్ళదా మరి తప్పు? కాని నీ కవిత్వం చాలా బాగుంటుం దనుకో— అయినా ఈ దేశమంటే నాకూ అసహ్యమే: ఏ నవనాగరక పాశ్చాత్య దేశంలోనైనా ఎందుకు పుట్టేనుకాదా అని ఎన్నోసార్లను కుంటోంటాను.

రామం: అది వట్టి భ్రమ; తీరా అక్కడికి వెడితే వాళ్ళ పరిస్థితులూ ఇంత క్లిష్టంగానూ వుంటాయి: దూరపు కొండలు నునుపు.

మణి: నేను వొప్పుకోను; మన వివాహ శాసనం చూడు, ఎంత నిష్ఠుర మైనదో? స్వేచ్ఛాప్రతిబంధకం కాదూ?

రామం: సందేహ మేమిటి!

మణి : నా సంగతి ఆలోచించు: ఆయనంటే నాకు ఇష్టం, ఆయనకి నేనే కావాలంటున్నారు గనక; నువ్వన్నా నాకు ఇష్టమే, నాకు నువ్వు కావాలి గనక. ఇద్దరినీ నేను ప్రేమిస్తున్నాను. నాకు సాయంకాలం షికారు వెళ్ళడానికీ, కులాసాగా కబుర్లు చెప్పుకోడానికీ, మంచి మంచి పద్యాలు చదివించుకోడానికీ నువ్వు కావాలి; తదితర వేళలలో ఆయన కావాలి. ఈ సందిగ్ధావస్థలో పడి కొట్టుకుంటున్నాను; దీనికి తరణోపాయం కనబడటంలేదు.

రామం : ఉపాయం లేనివాళ్ళని యీ వూళ్ళో వుండకూడదన్నారు: నాతో వచ్చెయ్యకూడదూ?

మణి : నన్ను నేను విమర్శించుకుని చూసుకుంటే నాకు 'షా' 'Getting Married' లోని 'లియో' అవస్థ జ్ఞాపకం వస్తోంది. నేను ప్రేమిస్తోన్నవాళ్ళ నందర్నీ ఎందుకు పెళ్ళి చేసుకోకూడదో? 'ప్రేమించువారలకు పెండ్లి సేయదు సృష్టి!'

రామం : అదేమిటి? ఏ వొక పురుషుడైనా ఏకకాలమందు ప్రపంచంలో వున్న స్త్రీల నందర్నీ ప్రేమించలేడు; ఒకే స్త్రీ వున్న పురుషుల నందర్నీ ప్రేమించాలేదు. ఎవరో ఒకరే భర్తగా వుండాలి.

మణి : అందుకే విచారిస్తున్నాను; అది ఏక కాలములో. పురుషులకి బహు పత్నీత్వం కూడుతుందికాని స్త్రీలకి బహు పతీత్వం పనికిరాదు. ఎంత న్యాయదృష్టి మన సంఘానిది?

రామం : సంఘనియమాలు ఎంత నికృష్టమైనవి అయినా అవి స్వయం కృతాపరాధములే. పైగా, సృష్టి అంతా క్షేత్రప్రధానము కనక అలాంటి ఊహ నిషిద్ధము.

మణి : ఈ వూహలు ప్రతి స్త్రీకీ వుండేవే; వాళ్ళు ధైర్యం చేసి పైకి చెప్పరు. నేను చెబుతున్నాను, అంతే. ద్రౌపది అదృష్టవంతురాలు ; తన కోరికలకి ఆనాటి సంఘం అనుమతించింది.

రామం : ఇప్పు డది కుదరదుగా....అబ్బ, నీమీద బాధతో వ్రాసిన పద్యా లివిగో, ఒకసారి వినవూ ? వెనక నేను పద్యాలు చదువుతోంటే ఎంతో ఆవేదనతోటి నాదగ్గరగా కూర్చుని వినేదానివి, అవన్నీ అప్పుడే మరిచిపోయేవా ?

మణి : ఇప్పు డిప్పుడే మరిచిపోతున్నాను—మరపు అనేది సృష్టించి భగవంతుడు మానవజాతిని కరుణించాడు ; లేకపోతే మన జీవితం బొత్తిగా దుర్భరమైపోను. చచ్చిపోయిన వాళ్ళనందర్నీ జ్ఞాపకం పెట్టుకుని పేరుపేరు వరసా ఏడవడం మొదలుపెట్టే మంటే ఇంకేమైనా వుందా ?

రామం : ఏమిటో, నువ్వంతా మారిపోయావు, మణీ. అన్నట్టు నేను వ్రాసిన పద్యాలన్నీ ఈమధ్య పరిషత్తువాళ్ళు ఖర్చులు పెట్టుకుని సంపుటంగా ప్రకటిస్తామన్నారు : ఆ ఖండకావ్యం నీకే అంకితం చేస్తున్నాను— ఇవిగో ఈ అంకితం పద్యా లందులోవే, విను :- [జేబులోంచి కాగితం తీసి చదువుతాడు, సన్నని శ్రావ్యకంఠంతో]

"ప్రేమతో నా హృదయమణికి :

౧ సంతతాతపతప్త భీషణము, నాదు
బ్రదుకు కడలేని యొక సహారాయెడారి ;
ప్రేమదాహార్త మీ యధ్వగామిహృదికి
సేదదేరంగ నొక 'ఒయాసిస్సు' వీవు ;

౨ కరగు నీదు స్నేహాహ్వానకంఠము విను
వరకు, విరహానలోగ్రజిహ్వాగ్రములను
నార్ధదగ్ధమ్ము జీవిత నౌకపైన
నేను, కదలని 'కేసబియానకా' ను!

౩ బ్రతుకె చీకటి, మొయిలుజీవితమె విరియ
సుంత మెరపించి యాసల స్రుక్కజేయు
మించుతీవియ మించు లక్ష్మీకటాక్ష
మేల నా కింక నీవు నాప్రోల నిలువ?

౪ నీ తరళనయనాల జనించి విరిసి
మెరయు చూపులె తొలకరి మెరపులనుచు
నెండబారిన యీ పేదయెడద యందు
మొలచికొనినాడ నాశాలతలను గొన్ని:

౫ ఎన్నొ కల్పమ్ము లిటు ప్రయాణించి విసివి
చదల చుక్కలు నేలకు జారునపుడు,
ఏలొ, యీ లతానిలయమ్ము హృదయ మెడలి
జాలి లేకయె ఆశాసుమాలు రాలు!

౬ రమణి ప్రేమచుంబనములు నన్ విడినట్లు
విరిని పరిమళమ్ము వీడి చనియె;
చెలియమేనిచాయ దలపించు సొగసు రం
గును దదీయ పుష్పమును ద్యజించె!

౭ ముందువెనుక లరసి మోదమ్ము సెడ జనుం
డాసజేయు మిథ్య యైనదానికి;

అమలహాసములు వ్యథాఘాతములు, గీత
ములు విషాదభావపూరితములు!

౮ మునుగుటకుగాని సుడిగుండములను గాంచ
కేగి యీ వేదనార్ణవ మీగినాను:
ప్రాప్త హేమంతబాధాసమాప్తి జేయ
కాగునే రాక శుభవసంతాగమమ్ము?

౯ వెలుగు తావకప్రణయాక్షి వీక్షణమ్ము
లుదయ మొంద నాపై, నాడె యొదవగంటి,
భాగ్యదేవీ యపారకృపావిశేష
శీతలాపాంగనిర్మలాశేషవృష్టి!—"

ప్రేయసీ! ఎట్లా వున్నాయి?

మణి : అద్భుతంగా వున్నాయి.

రామం : ఏదీ, ఇలా గీతాల్ని కమ్మెచ్చుని లాగినట్టు గమకంగా లాగడానికి ఇప్పటివాళ్ళల్లో ఎవడికైనా చాతనవుతుందీ, నాకూ వొక్క-శాస్త్రికీ తప్ప?

మణి : కాని, అచ్చంగా షెల్లీనీ వాళ్ళనీ జ్ఞాపకం చేస్తున్నాయే! Great wits jump! ఏమి వున్నతభావాలు! రామం, నా మీద ఆ పద్యాలూ, ఆ పొగడ్తలూ ఎందుకు చెప్పు? దానిమీద నా పేరు కూడా వ్రాశావు: ఆయన చూస్తే ఏమనుకుంటారు? నేను నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పేనుగా?....

రామం : అంతే, చాలునాకు: ఆయన ఏమనుకుంటారు? మనమిద్దరం గాఢంగా ప్రేమించుకుంటున్నా మనుకుంటారు. అదీకాక, ఇప్ప

డాయన్ని అడిగేస్తాను, నిన్ను నాకిచ్చెయ్యమని. మనం అన్యోన్యం ప్రేమించుకుంటున్నప్పుడు ఆయ నెవడు ఇంకా నిన్ను తనదగ్గరే దాచుకోడానికి ? బుద్ధిమంతుడై, ప్రేమంటే అర్థం తెలిసినవాడై తే అడ్డు చెప్పడు....

మణి : అదెట్లా ? అందుచేతే వొప్పుకోరు. అదీకాక, ఆయన కూడా నన్ను గాఢంగా ప్రేమిస్తున్నారు. ఆయనకి నామీద ప్రేమ లేక పోతే నన్ను నీ కివ్వడంలో ఇంకా అర్థం వుంది.

రామం : ఆఁ; అత నిచ్చేవాడూ, నేను పుచ్చుకునేవాణ్ణీనా ? నా హక్కు-నేను భుక్తపరచుకోడానికి అతని ఆజ్ఞేమిటి మధ్య ?

మణి : ఈ కవిత్వం వ్రాసేవాళ్ళతో ఇదే పేచీ: ఎప్పుడూ ఊహా ప్రపంచంలో మునిగి కలలుకంటో వుంటారు; ప్రపంచ జ్ఞానం తక్కువ! నువ్వీ గొడవంతా మాని నే చెప్పినట్టు వొప్పుకో. నేను చేస్తానుగా అదంతాను; అసలు కార్యం చెడుతుంది. ఇంతకీ నన్నొక భోగ్యవస్తువుగా, మానవత్వమూ ఆత్మగౌరవమూ లేని బానిసగా గ్రహించి, మీ రిద్దరూ నాకోసం నీచంగా అల్లరి పడడం నేను సహించలేను—ఆయన వచ్చే వేళకూడా అయింది.

రామం : అవునుగానీ, ఇందాకా నే వచ్చేటప్పటికి పాట పాడుతున్నావు. ఎంత హాయిగా వినిపించిం దనుకున్నావు! హార్మోనియం వాయిస్తోంటే నీ లేత వేళ్ళు Key-board మీద తొలకరి మెరపుల్లా మెరిసిపోయాయి.

మణి : నిజమే ?

రామం : అన్నింటికంటే, నా పాట నీ కెలా దొరికిందా అని ఆశ్చర్యం వేస్తోంది.

మణి : ఏదో పత్రికలో చూశాను; ఆ పాట నువ్వు వ్రాసినదే నేమిటి ?

రామం : [సగర్వంగా] మరేమి టనుకున్నావు ?

మణి : అయ్యో, ఈ సంగతి తెలిస్తే పాడకపోదునే.

రామం : ఏం, నా పాటలంటే అంత అసహ్యమా ? ఇప్పుడే కాదూ నా కవిత్వం బాగుంటుం దన్నావు ?

మణి : అబ్బే, దానివరస నీచేతే చెప్పించుకుని పాడితే బాగుంటుందని.

రామం : ఎంతమాట. [కొంచెం వుద్రేకంలో తల వెనక్కి పెట్టి కాళ్ళు ఎదురుగా వున్న బల్లమీదికి జాపి ఊపుతూ, ఈలవెయ్యడం మొదలు పెడతాడు.]

మణి : రామూ, డియరెస్ట్, నువ్వా 'పోజ్'లో కూర్చోవడం ఏమీ అంత అందంగా లేదుసుమా !

రామం : [చప్పున కాళ్లు క్రింద పెట్టి] నేను అందంగా కూర్చోవాలని ప్రయత్నించడం లేదే.

మణి : పోనీలే. నిన్నూరికే మాట్లాడించాలని అలా అన్నాను.

రామం : అవును ; నేను బాగా మాట్లాడతాను కాదూ ?

మణి : అబ్బే, నువ్వు ఏకకాలమందే ఈల వెయ్యడం, మాట్లాడడం చెయ్యలేవు, చూడు.

రామం : [కొంచెం నవ్వి] నిజమే. ఇంక నువ్వు చెప్పినట్టే సంచరిస్తా. [ఆమెను ముద్దు పెట్టుకోబోతాడు.]

మణి : [అతన్ని వారించి, నవ్వుతూ] ఇది నేను చెప్పేనామరి ?

రామం : [కొంచెం ఆగి] ఏం, నాకేసి ఇంకా అలా బెదురుగా జేబుదొంగ కేసి చూసినట్టు చూస్తున్నావు ?

మణి : [చిరునవ్వుతో] ఏమీలేదు ; వాళ్ళ వేళ్ళల్లో వుండే చురుకుతనం నీ కళ్ళల్లో వుందని!

కచేరీ సావడిలో గడియారం అరగంట కొడుతుంది.

ఇంతలో వొక ముప్ఫై యేళ్ళ సుందరాంగుడొకడు లోపల ప్రవేశిస్తాడు. అతన్ని దింపిన కారు అప్పుడే కూస్తూ వెళ్ళిపోతుంది. అతడు తెల్లదొర వేషంలో వుంటాడు. మంచి బలిష్ఠమైన శరీరం. వచ్చి, వాళ్ళకేసి ఒకసారి చూసి, సిగరెట్టుపొగ వొదులుంతూ ఈల వేస్తోంటాడు, తనని కానట్టు. ఇతన్ని చూసి రామం అదోలాగయి కొంచెం జరిగి నుంచుంటాడు, దీపం క్రీనీడలో. మణి లేచి, తల వాల్చుకుంటుంది చిరునవ్వుతోటి. ఆ వచ్చినాయన మణి భర్త. మొగం చూస్తే మంచి చురుకైనవాడూ, ఉత్సాహమైనవాడూ అని తోస్తుంది. అతని 'ఓవర్ కోటు' కాలరుమీద రెండు కొత్త గులాబీపువ్వు లున్నాయి. అతను - పేరు పరశురాం - అలా ఈల వేస్తూ రెండు నిమిషాలు ఇటూ, అటూ పచారు చేసి, చటుక్కున ఆగుతాడు.

పరశురాం : మణీ, డియర్, ఇట్టా రా. [ఆమె దగ్గరకు రాగానే తన కోటు కాలరులోని పువ్వు లామె తల్లో పెట్టి, ఆమె చెక్కిలిమీద మృదువుగా ముద్దు పెట్టుకొని] ఏదీ, 'నేడుకదా, నేడుకదా' వోసారి పాడవూ ? [ఇందాకటి నించీ గమనించనట్టు రామం కేసి చూసి, కొంచెం కొంటెగా కలవరం అభినయించి, రామంతో] **Hullo !** మీరున్నారా, యిక్కడ ? మిమ్మల్ని చూడనే లేదు. **I am sorry !** మీకు నేనేమీ అడ్డు రాలేదుకద ? [ముఖం గంభీరంగా పెడతాడు.]

రామం : [కొంచెం జంకుతూ] అబ్బే, ఏమీలేదండి ; ఎంతమాట. నేనీమె నిదివర కెరుగుదును. అంచేత వోమారు, తీరావచ్చాను కదా, చూసిపోదామని వచ్చానండి.

పరళు : అట్టాగా. మీరు వచ్చారని ఇందాకానే విన్నాను. ఇంటి దగ్గ రెవరూ వుండరనుకుంటూ వచ్చాను: మీ రీమెను సినీమాకి తీసుకెళ్ళి వుంటారని. ఎంత ఆశాభంగం! వెనక మీ రీమెను తరచు సినీమాలకి తీసుకెళ్ళేవారటగా, వాళ్ళ నాన్నగారు వద్దనే దాకా? ఈమే చెప్పేది.

మణి : నే నలా చెప్పేనా మీతో?

రామం : ఏదో చిన్నప్పుడండి. అయినా ఇంత ప్రళయంలో సినీమా ఏమిటండి? అందులోనూ ఆమె వివాహిత....

పరళు : ఆఁ, వివాహిత ఐతేనేమండీ, ఆమె కిష్టమైనప్పుడు? ఆమె కామాత్రం స్వతంత్రం లేదూ? మీది సనాతనమతమా? నే నింకా ఊరుకుంటే ఆడవాళ్ళకి ఘోషా పద్ధతి అవసరం అని వాదించేటట్టు కనబడుతున్నారే!

రామం : అబ్బే, కాదండి. నేను చాలా నవీనాదర్శాలు కలవాణ్ణి; ఘోషా పద్ధతి ప్రపంచంలో ఆసలు రూపు మాసి పోవాలనే సిద్ధాంతంనాది.

పరళు : ఓహో; అలాగా? [పచారు చేస్తూ] ఈ విషయంలో నేను కొంచెం చాదస్తుడను. నన్నడిగితే ఘోషాపద్ధతి తప్పకుండా వుండాలంటాను; కాని ఇప్పుడున్నట్టుకాదు: నేనే ముస్తఫా కమల్‌పాషా నైతే ఇరవై నాలుగు గంటల్లో లోకంలో వుండే కోతుల్లాంటి వాళ్ళందరికీ ఫరదా విధిస్తాను. చూడండీ, మీ వూళ్లో మా మణి ఇంటి కెదురుగా కాపురం వున్న వారెవరండీ?

రామం : మేమేనండి.

మణి : ఇప్పుడా యింట్లో వుండటం లేదుటగా?

పరశు : ఇదివరకుమాటే నే నడుగుతూవుంట.

రామం : ఆ యిల్లంతా దుర్గంధంతో నిండి వుండీదండి.

మణి : [నవ్వుతూ] మీరు వదిలి వచ్చేశాకా కూడానా ?

పరశు : ఆc. ఆ యింట్లో వొకామె వుండేది : చిన్నకొప్పూ, మాసిపోయిన బట్టలూ, మొహంనిండా పసుపూ, పెద్ద కుంకుంబొట్టూ ఆవిడాను. రామ రామా, ఆవిడని చూస్తే అసలు స్త్రీ లంటేనే రోత పుడుతుంది. ఎవరండీ ఆమె ?

రామం : [అవమానంతో తల వంచుకుని నెమ్మదిగా] ఆమె మా అమ్మగా రండి.

పరశు : ఎవరయితేనేం, అలాంటివాళ్ళ నందర్నీ తెరచాటున వుంచి, ఇదిగో, మా మణిలాంటి అప్సరసల్ని వీధుల్లో వదిలెయ్యాలి : సౌందర్యం ఒకడి సొంత సొమ్ముటండీ, దాన్ని అందరూ కళ్లారా చూసి అభినందించి ఆనందించాలిగాని ?

మణి : ఇలా ఎప్పుడూ ఇంట్లో కూర్చుంటోంటేనే నన్ను వొకమారు చూసి తరిద్దామని పని కల్పించుకుని వచ్చిపోయే వాళ్ళతో ఊపిరి సలపడం లేదు ; ఇంక నేను వీధులవెంబడి తిరగడం మొదలు పెడితే అడిగేరూ ?

పరశు : తీర్థప్రజ ! నువ్వొకతెవే కాదు, నీలాంటి లావణ్యరాసులు అంతా కంకణం కట్టుకుని అలా ఆచరించి స్త్రీ సంఘాదర్శాలకి వన్నె తీసుకురావాలి : ఇంక మొగాళ్ళందరికీ సంఘమరణమే !

మణి : కాని, మీ ఏకపత్నీవ్రతాని కీమాటలు కొంచెం విఘాతం అపాదిస్తాయేమో ?

పరశు : ఎవ రన్నారు? ఏకపత్నీవ్రతం దేవతలకే లేదు. మన ఆదర్శ పురుషులు, శ్రీకృష్ణుడు, మహమ్మదూ మొదలు మా బంట్రోతు అచ్చన్నవరకూ అంతా బహుపత్నీవ్రతులే. ఈ బహుపత్నీ వ్రతుల దీక్షకి అందరూ కన్యలే దొరకడం దుర్లభం కనక ఆ పత్ను లందరూ బహు పతివ్రతలే. మొన్న మనదేశం జనాభా లెక్క వేసి సమంగా భాగించిచూస్తే ఒక్కొక్క మొగాడికి వొకటిన్నర ఆడది వచ్చిందిట. అందుచేత నూటికి ఏ వొకరిద్దరో తప్ప మిగిలినవా రందరూ బహు పత్నీవ్రతులే అని రూఢి అయింది!

రామం : నూటికి ఆ వొకరిద్దరూ అయినా వుండబట్టే భూమి ఇలా సమంగా తిరుగుతోందన్న మాట.

పరశు : కాదు ; ఆ మిగిలిన వొకరిద్దరూ అబద్ధమాడే వాళ్ళన్నమాట ; ఇదొక చిన్న చిదంబర రహస్యం. అయినా, ఇవాళ మనమంతా వొక్కసారిగా చచ్చిపోయినప్పటికీ, ఖగోళశాస్త్రం ప్రకారం, భూమి సమంగా తిరగడం మాత్రం మానదండీ.

మణి : చెప్పేరుకారు, అయితే మీ కీ వాదంలో విశ్వాసం వుందన్నమాటే?

పరశు : నేను విశ్వాసంలేని మాటలు మాట్లాడను. నాదాకా ఎందుకు, నీకు మాత్రంలేదూ? [రామాన్ని చూసి] వీరికి లేదూ? తుమ్మెద చూడు....

రామం : క్షుద్రకీటకానికీ మానవులకీ సంబంధం ఏమిటండీ? మనకి మెదడు వుంది....

పరశు : నా కావిషయం కొంచెం సందేహమే. సంబంధం లేకేమండీ? మన తలకట్లు తుమ్మెదలతోటేగా చేశారుట!

రామం : నా కర్థం కావడం లేదుకాని, మీ సంభాషణాక్రమం చాలా బాగుందండీ!

పరశు : నాతో సంబాషణ ఎప్పుడూ బాగానే వుంటుందండీ; నా కది సహజం. అర్థం కాకపోవడానికి నేను భావకవిత్వ మేమీ వుపయోగించలేదే.

మణి : [అపహాస్యంగా] మీతో సంభాషణ బాగుండదూ మరి: ఘోషా గుట్టులోంచి గోత్రాలు గొడవదాకా వెళ్ళేరు!

పరశు : [ఆగి, ఆశ్చర్యంతో] ఆఁ; కొంతమంది మొగవాళ్ళని కూడా మనం తెరమరుగున వుంచవలసివుంటుంది. అదేదోవూరు, దాని పేరు జ్ఞాపకం రావడంలేదు ; ఏదో, ఆ వూరు పెద్దకాపు మొదలు మెయిన్ రోడ్డులో 'లంచ్ హోమ్' ప్రొప్రయిటరువరకూ అందర్నీ హమేషా గదిలో వుంచి తాళం బిగించాలి, సంఘం బాగుపడా లంటే. [మణితో] అయితేను, ఈయనతో సినీమా కెందుకు వెళ్ళలేదు, డియర్ ?

మణి : ఏదో తెలుగు ఫిల్మట.

రామం : ఇంత ప్రళయంలో....

పరశు : ఇంత ప్రళయంలో మీరు మీ ప్రాతస్నేహితురాల్ని సందర్శించ డానికి రాగాలేనిది, ఆమెను సైకిలు ముందు కూర్చోపెట్టుకుని, మీ ఓవర్ కోటు ఆమెకు తడిసిపోకుండా కప్పి, సినీమాకి తీసు కెడితే మాత్రం ఏం ?

రామం : [కొంచెం బెదురుతో బెంగగా చూస్తూ] చిత్తం. మీ రలా అనడం భావ్యం కాదండి.

పరశు : అన్నట్టు, మీపేరెవరు? రామంగారు కాదూ?—మీకంటే నాకో అయుధం ఎక్కువ వుందండోయ్ : నాపేరు పరశురామం! ఇదివరలో తమ దర్శనభాగ్యం అబ్బింది కాదు; I am very glad to meet you! అట్లా ఆ కుర్చీలో దయచెయ్యండి. [రామం పేము కుర్చీలో బొట్టమోపుగా కూర్చుంటాడు.] డియర్, మా ఇద్దరికీ పరిచయం చెయ్యలేదేం? నీ చిన్ననాటి స్నేహితుడైతే అంత నువ్వే మాట్లాడాలా ఏమిటి? నేనుకూడా మీ సంభాషణలో పాల్గొన కూడదూ?.... [మళ్లీ పచారు చేస్తూం టాడు]

మణి : [సోఫాలో కూర్చుంటూ] నే నింకా ఏదో చెబుదా మనుకుం టోంటే నన్ను మాట్లాడనివ్వకుండా మీరే మొదలెట్టారు ధోరణి. క్రొత్తవాళ్ళతో ఇదే కాబోలు మాట్లాడే పద్ధతి : మీరు ఇంగ్లండులో వుండేప్పుడు కూడా ఇలాగే ప్రవర్తించేవారా? అతను చాలా మంచివాడు; మీ ప్రతాపం అంతా ప్రదర్శించ కండి.— [రామంతో] రామం, ఆయన స్వభావ మంతే;

రామం : [ఏమనాలో తెలియక] అబ్బే.

పరశు : [ఆగి] ఏం, వా స్వభావానికేమి లోటొచ్చింది? దేవిగారు పరిచయం చేసేదాకా ముక్కు మూసుకుని తపస్సు చెయ్యాలి కాబోలు. నా యింట్లో నాకు ఎరమరిక ఏమిటి? వారిని అతిథిలాగ గౌరవించి మాట్లాడుతున్నా నంతే. మనస్సులో వొకటి పెట్టుకుని పైకొకటి నటించడం చేతకాదునాకు, మీ ఇంగ్లీషు నేర్చుకున్న ఆడపిల్లల్లాగ! కులాసాగా కాలక్షేపం చెయ్యడమే నా ధర్మ సూత్రం — A true Gentleman! పోనీలే.... అయితే,

అన్నగారూ, మీరు భావకవులని విన్నాను — నాకు ఆధునిక కవిత్వం అంటే ఎంతో ప్రీతిలెండి— మీరీమధ్య ఏమన్నా విరహ గీతాలు వ్రాస్తున్నారా ?

రామం : ఏదో, రాస్తూంటానండి ; కాని యీమధ్య ప్రచురించడం లేదు. ఏమిటో అశ్రద్ధ అండి.

పరశు : అవునవును ; భావకవులకి బద్ధకం ఎక్కువని చాలామంది అంటూం టారు. అయినా మీ స్నేహితురాలికే గాని మాకుకూడా పద్యాలు వినిపించకూడదూ ? మీరు చక్కగా చదువుతారుటకూడాను భావ గీతాలు ?

మణి : భావగీతాలూ....

పరశు : అంటే ఎవడికి తోచిన వేదాంతం వాడు పద్యాల్లో ఎలాగో అలాగ వ్రాయడం— ఏమండీ....

రామం : అయ్యో, తప్పకుండా వినిపిస్తానండి.

ఇంతలో మణి లేచి కప్పులో కాఫీ పోసి తెచ్చియిచ్చి, భర్త పైకోటు తీసి స్టాండుకి తగిలిస్తుంది.

పరశు : [కాఫీ త్రాగుతూ] **Excuse me,** మీరుకూడా కొంచెం....

రామం : **No, thanks!** ఇప్పుడే పుచ్చుకున్నానండి.

పరశు : [కప్పు ఖాళీ చేసి బల్లమీద పెట్టి] ఊఁహూఁ, ఏమి అతిథి సత్కారం! నేస్తం అంటే అలా వుండాలి. అచ్ఛా, నాకు నచ్చావు సఖీమణీ !

మణి : మీ పద్ధతులు మాత్రం నాకు నచ్చలేదు. నాకూ కాస్త తెలుసును ; నన్నవమానించడానికిదే మార్గమా ? [కొంచెం అలుక నటిస్తుంది]

పరశు : ఓహో, ఇప్పుడు మరీ బాగున్నావు! 'అల్క మానవు కదా యిక నైన నరాళకుంతలా!' ఇంతట్లోకే? డైవోర్సు అన్నావు గనక కొంపతీసి, చస్తాను. అసలు నా వుద్దేశ్యం ఏమిటో చెప్పనా?

మణి : మీ మనస్సులో వున్న వుద్దేశ్యాలన్నీ నాతో చెప్పడం మొదలెట్టారంటే మన జీవయాత్ర ఎంత దుర్భరమైపోతుందో అడగక్కర లేదు ; నేను ఆలోచించేవన్నీ మీతోటి చెప్పడం ప్రారంభించినా అంతే.

రామం : మీ రిరువురూ నా నిమిత్తం అలా పోట్లాడు కోవడం....

పరశు : మీరు పొరపాటు పడుతున్నారు. ఇది పోట్లాట కాదు ; వట్టి తెలుగు సామాన్యగృహజీవనం— అయితే, మీరు మా ఆవిడకి వెంకటచలం పుస్తకాలు చదవడాని కిచ్చేవారుట ; ఆయన మీకు ఆదర్శప్రాయుడా ఏమిటి?

రామం : [కొంప మునిగేలాగుందని అనుమానం పడుతూ, కొంచెం నీళ్లు నములుతూ] ఏమీలేదండి ; ఆమె ఏవైనా చదువుకోడానికి నవల లిమ్మంటే నాదగ్గ రప్పుడున్నవి రెండు పుస్తకాలిచ్చాను.

పరశు : ఆత్మ, మీదగ్గర మరేకవి పుస్తకాలూ లేనట్టు.

మణి : అప్పుడు వెంకటచలంగారి 'స్త్రీ'ల నమ్మేవారులెండి.

పరశు : ఏమో, అటువంటి బుద్ధిమంతులూ, అనుభవం వున్న వాళ్ళూ నమ్ముతారని నే ననుకోను.

మణి : అదికాదు ; 'దైవ మిచ్చిన భార్యలూ'....

పరశు : భార్యల్ని దైవ మిస్తేమట్టుకు సరిపోతుందా : వాళ్ళు తిన్నగా వుంటున్నారా ; ఇతరులు వుండనిస్తున్నారా? [రామంతో]

చూడండీ, మీ రిచ్చిన ఆ పుస్తకాలమీద 'ప్రేమతో నా మణికి' అనికూడా వుదాహరించారే ? ఈమెమీద మీకు ఎంత ప్రేమండి !

మణి : నాకుమాత్రం రామం అంటే ఎంతో ఇష్టం సుమండీ; మా Old pal.

పరశు : ఆయన్ని, అమ్మాయీ, నే నడుగుత.

మణి : ఏమిటా ప్రశ్న మరి ? నిజం చెబితే నమ్మబుద్ధి వెయ్యదు ఎవరికీని. మీ ప్రవర్తన ఎవరైనా చూస్తే, మీదంతా బొత్తిగా కపటమైనా అయివుండాలి, లేకపోతే శుద్ధ అమాయికత్వమైనా అయి వుండాలి అనుకుంటారు.

పరశు : రెండూ కాదు; మ నందరికి మల్లేనే అది కాస్తా, ఇది కాస్తా వున్నాయి నాలో. [రామంతో] ఏమండీ, అయితే మీరు ఎవరి భార్య నైనా ప్రేమించి వూరుకోగలరా, లేకపోతే సదరు భార్యని లేవదీసుకుని పోయీదాకా మీకు తృప్తిగా వుండదా ?

మణి : ఏమిటి మీ మాటలు ? అత నేమనుకుంటాడు ? స్త్రీ అంటే ఎంత లోకువ ! అదొక గడుసుతనం అనుకుంటున్నారు కాబోలు, మీమట్టుకు. ఇష్టమైతే ఆడవాళ్ళే మగవాళ్ళని లేవదీసుకుని పోగలరు, తెలిసిందా ?

రామానికి ప్రాణాలు పోతున్నట్టుంటుంది ; కళ్ళు చీకట్లు క్రమ్ము తున్నాయి. మణికి రామం అవస్థ చూస్తే జాలీ, భర్త ప్రవర్తన చూస్తే నవ్వూ వస్తున్నాయి.

పరశు : గడుసుతనం ఏమిటి నా మొహం; నేను వట్టి అమాయికుణ్ణే ! అన్నట్టు, నా సర్వస్వం నీచేతిలో వుందిసుమా : నువ్వు కోప గించావంటే నా పని అయిందన్నమాటే—నువ్వు దేవ దూతవు,

నేను తపించిపోయే జీవాత్మని; నువ్వు దివ్యకన్యవు, నేను ఎందుకూ పనికిరాని వల్లకాటిలో బిచ్చగాణ్ణి....

మణి : [నవ్వుతూ] ఈ శివపురాణానికేం గాని, రామం కవిత్వం అచ్చంగా ఇలాగే వుంటుంది. [రామం తల వంచుకుంటాడు.]

పరశు : పోనీ. నీకు నేను బానిసగా వుంటాను; వేలెట్ గా వుంటాను; ప్రయివేటు సెక్రటరీ గా వుంటాను—'కార్యేషు మంత్రీ....' ఈ యుగమే మారిపోయినట్టుం దన్నాడు వెనకటి కో నాటకంలో అవధాన్లుగారు.

మణి : భర్తగా వుండి అధికారం చెలాయించడంకంటె అలా వుంటేనే బాగుండును.

పరశు : బాగుండదూ మరీ? ఏదీ అయితే కొంచెం నవ్వు. [మణి గడ్డం పట్టుకుని] There is a good girl! [మణి కొంచెం నవ్వేక సిగరెట్టు వెలిగిస్తూ సోఫా చేతిమీద కూర్చుని] రాజీ కుదిరిందన్న మాట. ఈసారి నువ్వు పుంతలో ముసలమ్మవు! [నవ్వుతాడు] ఇలా తెలివి మీరిపోతారనే ఆడపిల్లలకి వూహ రాకుండా పెళ్ళి చేసెయ్యా లన్నారు పెద్దలు. ఆడదానికి చిన్నతనంలో పెళ్ళి చేసేస్తే తరవాత అది విచారిస్తుంది; చెయ్యకపోతే తరవాత మనం విచారించవలసి వస్తుంది.

మణి : మీకు ఆడ పిల్లలు పుడితే అలా ఆచరిద్దురుగాని లెండి.

పరశు : నాకా? పిల్లలా, అప్పుడే? ఇలాంటి అబద్ధాలాడితే నీకే ఆడ పిల్లలు పుడతారు!— [రామంతో] ఇంతకీ, ఏమండీ, నా మాటలకి మీరేమన్నా అనుకున్నారా, ఆవి డన్నట్టు

రామం : అమ్మయ్యో, తమ రలా సెలవిచ్చి నన్నవమానించడం న్యాయం కాదు.

పరశు : ఓహో, అందులోనూ స్త్రీల యెదుట! నేను మిమ్మల్నేమీ అవమానించ లేదే. మీ స్వేచ్ఛాప్రేమజీవుల అభిప్రాయాలు తెలుసుకుని కొంచెం జాగ్రత్త పడదామని; నేను అనవసరం గానో, అవసరంగానో వివాహం చేసుకున్నవాణ్ణి చూడండీ మరి? మీరు చలనం లేని పురాణబ్రహ్మచారులు. ఈ సంగతి ముందే తెలిస్తే నే నీమెను కట్టుకోవడం మానేసి వుందునే?

మణి : కట్టుకోవడం?— మన సంఘంలో స్త్రీ జీవితం ఎంత పారతంత్ర్యపూరితం!

పరశు : కాదూమరీ: మగవాడికి పెళ్ళి చేసుకుంటే చిక్కు; ఆడదానికి చేసుకోకపోతే చిక్కు.

మణి : అయితే నన్ను కట్టుకున్నందు కిప్పుడు పశ్చాత్తాప పడుతున్నారా?

పరశు : కాదు; వివాహసంకల్పం, భార్యాభర్త లొకరి నొకరు తప్పుగా అర్థం చేసుకొనడంతో ప్రారంభిస్తుందని వొక ఆంగ్లకవి పుంగవు డన్నాడు: గతజలసేతుబంధనం చెయ్యను నేను; 'పశ్చాత్తాపం లేదు' అన్న వచనంలోనే ఎక్కువ నమ్మకం నాకు.

మణి : మీకు దేవుడూ లేడు, గురువూ లేడు; అన్నీ విపరీత వాదాలు.

పరశు : గురువులులేకేం నాకు? మా అమ్మగారి వూరు మొదలుకొని ఆక్సుఫోర్డు వరకూ లెక్కవేస్తే నాకు చదువు నేర్పిన గురువులు చాలా మంది అవుతారు—దేవుడేమిటి, అసంగతము?

రామం : హరి, హరీ....

పరశు : వా దేమిటండీ మీ భగవంతుడు? నల్లగా, నాలుగు చేతులూ,

రెండు కాళ్ళతో కులాసాగా స్త్రీలతో కాలక్షేపం చేస్తూ సముద్రంలో పాముమీద తేలుతూ వుంటాడు; బొడ్డుదగ్గర తామరకూడా వుంటుంది? ఎక్కడచూసినా అవే చిత్రాలు. లేక, అదేదో రుబ్బురోలులాగుండే శిలా విగ్రహమా? అసలు సంగతి అది కాదు; సహజంగా భయస్థుడైన మానవుడు మానసిక శాంతి కోసం దేవుణ్ణీ, గుళ్ళనూ, మతమునూ కల్పించాడు....

రామం: మత మంటే ఈశ్వరునియందు దృఢవిశ్వాసమండి—

పరశు: ఓవర్‌కోటండీ; ఈ కాలంలో విశ్వాసం ఎవరికండీ, కుక్కలకే లేదు? ఇన్ని మతాలు ఎప్పుడైతే వున్నాయో అప్పుడే అది వట్టి అర్థంలేని వ్యవహారమనీ, కాలక్షేపార్థమనీ మీకు తోచడంలేదూ— దానికేం, మా ఆవిడ అంటే మీకు అద్భుతమైన ప్రేమ అను కుంటాను, ఏం?

రామాని కేమీ తోచదు. మణి మొగం చాటు చేసుకుని నవ్వుకుంటోంది మందగా. రామం బిక్క మొహం పెట్టి నుదురుమీద ప్రవహించే స్వేద బిందువులని చేత్తో తుడుచుకుంటూంటాడు. ఆ చేతిలో అతను మణికి వ్రాసిన పద్యాల కాగితం వుండిపోయింది; అది యీ హడావడిలో జేబులో దాచెయ్యడం మరిచిపోయాడు: అది మణి భర్త కళ్ళ పడింది.

పరశు: మీ చేతిలో ఆ కాగిత మేమిటండీ, పద్యాలు కాబోలు? [రామానికి ఆ కాగితాన్ని దాచడానికి వైమివ్వకుండా లాక్కుని చదువు తాడు: రామం లేచి నుంచుంటాడు; నెత్తిమీద పిడుగుపడ్డ ట్టవుతుంది అతనికి; స్తంభించిపోతాడు నిలువునా.]

మణి: [కిటికీలోంచి బయటికి చూసి, చప్పున] అయ్యో, 'లిల్లీ' (కుక్క) వర్షంలో తడిసిపోతోంది; ఎవళ్ళూ చూశారేకారు. [లోపలికి వెడుతుంది].

పరశు : [పద్యాలు చదువుకుని లేచి] ఇంకేం, ఇప్పుడేకాదూ మీరు నా భార్యని ప్రేమించడం లేదని సెలవిచ్చారు ? మరి యీ **Nonsense** అంతా ఏమిటి ?

రామం : [ఇటూ, అటూ చూసి] ఎబ్బే, లేదండి, నాకామె అంటే ఎంతో గౌరవం అండి ; అంతే. కావలిస్తే మీ రామె దగ్గర విచారించ వచ్చు.

పరశు : ఇదొకటా ? ఇది విచారించవలసిన విషయమే మరి.

రామం : ఆమె వివాహిత, పతివ్రత కూడానండి....

పరశు : ఆ రెండో సంగతి మీ కెలా తెలుసును ? ఆమె పాతివ్రత్యం విషయం మీకెలా తెలిసిందంట ? పతివ్రత అని ఎవర్నంటారు ? ఒకామె, తన్ను గూర్చి ప్రజలు పతివ్రత అనుకోవాలని, చేసే చర్యలవల్ల ఆమె కాపేరు వస్తుంది ; అంటే నిజంగా పతివ్రత కాదన్నమాట. నిజంగా పతివ్రతే అయితే అట్లా అనిపించు కోవాలని చూడదు ; ఆమె నెవ ళ్ళెట్లా అనుకున్నా ఆమెకి లక్ష్యం వుండదు. ఇంతకీ మీరు నిరాకరించినా, మీ కసలు పతివ్రత మీదేకాని ప్రేమ కుదరదుగా ! భార్య అంటే అసహ్యం ; ఇంకొకళ్ళ భార్య అయితేనే ప్రేమా, నూతనత్వమూ, మోజూ వుంటాయి—— ఏమంటారు ?

రామం : ఆమెను నే నటువంటి భావంతో ప్రేమించడం లేదండి. నా ప్రేమ సామాన్యమయింది కాదు ; ఆధ్యాత్మికం. ఆమెను తల్చు కుంటే నాకు స్త్రీ లోకం అంటే వొక ఉత్కృష్టమైన పూజ్య భావం కలుగుతుందండి.

పరశు : అట్లాగా ; స్త్రీలోకం అంటే ఎందుకండీ. పాపం. మీ కంత గౌరవం ? స్త్రీల దగ్గరకి పోయేటప్పుడు ఒక 'కమ్చీ'ని కూడా తీసుకువెళ్ళాలని 'నీషీ' యోగి ఆదేశం. స్త్రీ అంటే ఏమిటి ? స్త్రీ అంటే వొక కుళ్ళు పదార్థం ; అంతేనా ?— మణి వింటే కోప్పడుతుంది అశ్లీలమని— అటువంటి స్త్రీని శక్తిస్వరూపం లాగ పూజిస్తారు కాబోలు మీ నవకవులు ! ఇంకా మా మణి మిమ్మల్ని ప్రేమిస్తోందా ?

రామం : చిత్తం, మీతో నేను మట్లాడలేనండి.

పరశు : మీ దెంత గంభీరమైన స్వభావమండి ! కొందరి మొహాలు 'బరామీటర్ల' లాగ వుంటాయి : చూడగానే సులువుగా కనిపెట్ట వచ్చు, లోపలినించి తుపాను పైకి ఎప్పుడు వచ్చేదీని ; వాళ్ళ వట్టి నిష్ప్రయోజనమైన అరసున్నలూ, బండీరా (ఱ)లూను. కాని మిమ్మల్ని చూసినకొద్దీ నాకు ఆశ్చర్యం ఎక్కువైపోతోంది : ఎంతకీ తేలరు.

రామం : నేనామెను అందరి ప్రేమికులలాగా ప్రేమించడంలేదండి. నా భావ మంత తుచ్ఛమైనది కాదు. అందులోనూ మీవంటివారి పట్ల నే నలాంటి అభిప్రాయంతో సంచరించడం....

పరశు : [మండిపడుతూ] ఏమిటీ, నా భార్యను నువ్వు ప్రేమించవూ ? ప్రేమించలేవూ ? ఓరి స్కౌండ్రల్ ! ఇటువంటి లావణ్యరాసిని, ఇంతటి కుసుమసుకుమారగాత్రిని, నీ జన్మెత్తి ఎన్నడైనా చూసి ఎరుగుదువా ? నా భార్యని ప్రేమించనని నా యెదుట ధైర్యంగా, గర్వంగాచెప్పి న న్నవమానించడానికి సాహసిస్తావుగా? [కోపంతో గుటక వేసి] నా భార్యవంటి స్వర్గసౌందర్యాన్ని ప్రేమించలేవూ ?

పోనీ, ప్రేమిస్తున్నానని నిజం చెబుతావేమోనని ఇందాకటినుంచీ ఓపికపట్టుకుని వూరుకున్నకొద్దీ, ఏమిటి నీ ఆగడం ? కవిత్వం కూడా వెలిగిస్తున్నావుగా : దేశమంతా తిండిలేక మల మల మాడి చస్తోంటే నీకు కవిత్వంతో కాలక్షేపమా ? అయినా, నిజాయితీ లేకపోయాక కవిత్వమేమిటి? ఓరి నీ కవిత్వం మండ ! [రామం వెనక్కి వెనక్కి తగ్గుతూ వుంటాడు, భయంతో.] నీవంటివాళ్ళ మూలాన్ని కవితాలోకానికంతా అప్రతిష్ఠే ! నీ దేబిరిగొట్టు మొహా నికి స్వచ్ఛమైన ప్రేమౌన్నత్యం ఏం తెలుస్తుంది ? నువ్వు ప్రేమిం చకపోతే మాకు లోటొస్తుందనుకున్నావు కాబోలు : నువ్వు కాదు, చూడూ, [ఒక అడుగు ముందుకు వేసి, జేబులోని రివాల్వర్ తీసి, విలాసంగా కొంచెం పైకెగరవేసి పట్టుకుంటూ] నీ తాత ల్లాంటివాళ్ళు, నీ తల తన్నినవాళ్ళు, గొప్ప గొప్ప కవులూ, చిత్ర కారులూ, నా భార్యని ప్రేమించి, వారి జీవితాలు ధన్యాలయేటట్టు ఆమె సోయగాన్ని వేనోళ్ళ పొగిడి, వారి హృదయకుసుమాలు ఇక్కడ పారితోషికాలుగా దిగవిడిచి వెడుతూంటారు. [ఇంకొక అడుగు ముందుకువేసి] ఇంకా అట్లా దెయ్యంలాగ, You devilish...

రామం పారిపోతాడు. ఈ హడావడి విని మణి చటాలున ప్రవేసించి, సంగతి గ్రహించి, భర్త రెండుచేతులూ పట్టుకుని ఆపుకోలేకుండా నవ్వుతుంది. ఆమె భర్త రివాల్వరు జేబులో పెట్టుకుని, చిరునవ్వుతో మణిని ముద్దు పెట్టుకుంటాడు. కచేరీసావడిలో గడియారం ఏడుగంటలు కొడుతుంది; వర్షం వెలిసిపోతుంది.

మణి : [నవ్వాపుకొని] ఆఖరికి నే ననుకున్నంత పనీ అయింది— ఉగ్ర నరసింహమూర్తీ, ఈ ప్రహ్లాదుని మొరాలకింపరూ ?

పరశు : అచ్చన్నా [బంట్రోతు వచ్చి సలాంచేసి నుంచుంటాడు.] నువ్వు పడుగెత్తుకెళ్ళి, ఇప్పుడే మనింట్లోనించి వెళ్ళిపోతున్నాయన్ని ఆపి, ఇక్కడికో మారు తొందరగా తీసుకురా. ['చిత్తం' మని బంట్రోతు వెళ్ళిపోతాడు.] డియర్, మీ రామానికి పాఠం చెబుతా ! అనవసరంగా మనస్సంతా చికాకు చేసుకున్నందుకు విచారంగా వుంది.

మణి నెమ్మదిగా హార్మోనియందగ్గర కెళ్ళి వాయిస్తూ, అతి మధురంగా పాడుతుంది—

పాట : నేడుకదా, నేడుకదా, సఖా !
నేలకు నింగికి పెండ్లికదా !
ప్రణయనిలయజీవనమోహనసుమ
వల్లీతోరణ పంక్తి అదే! ....నేడు....

వీడనితావుల వాడనిపూవులు
వేలువేలు సరముల రచియింతము :
ఆమనికోరికలను ముదమున మన
కామదేవు కొలువున నర్పింతము ....నేడు....

ఆమె భర్త, మణి భుజాల మీద చేతులు వేసి హాయిగా, నాగస్వరానికి నాగుపాములాగ, తల వూపుతూ వింటూ ఆనందిస్తూ వుంటాడు.

* * * * *

మిగిలిన కథ రంగంమీద ప్రదర్శింపబడనక్కరలేదు. దీని పర్యవసానం ఎలా పరిణమించిందో ఊహించుకోవడం సులువే అయినా అది అందరూ తలోకలాగా ఊహించడం కంటె నా అభిప్రాయం చెప్పడం కూడా మంచిదే. ఇటువంటి విచిత్ర సంఘటన పైకి అసంభవంగానే కనపడుతుంది కాని రామం, పరశూ వంటి ప్రకృతులు లోకంలో ఎంతవరకూ అరుదో అంతవరకు మట్టుకే అది అసంభవం. మన మామూలు కథల ధోరణి ప్రకారం రామాన్ని తరిమేసి పరశూ, మణీ హాయిగా చిలకా గోరింకలలాగ కాపురం

సాగించారని సంతోషించడం సహజమే. అయితే యీ విషయంలో మాత్రం అలా జరగడమే అసహజం: దీనికి ఆయా పాత్రల మనః ప్రవృత్తులే జవాబుదారీ.

రామం ప్రతి విషయంలోనూ భ్రాంతియుతములైన వికృతాభిప్రాయాలు కలవాడు. ఇతను భావకవులతో తిరిగి చెడిపోయిన జాతి యువకుడు; ఇతనికి వారి అలవాట్లూ, హావభావాలూ మాత్రమే పట్టుబడివా రలవరచుకొన్న అసమాన కవిత్వం లోపించింది. కవితావనంలో కొన్ని ఉగ్రవ్యాఘ్రా లుంటాయి; కొన్ని క్షుద్రజంబుకాలుకూడా వుంటోంటాయి, వాత పెట్టుకోడానికి: ఒక దానిది గంభీరారావము; ఒక దానిది వెఱ్ఱికూత.

కవిత్వానికి కథ పట్టు విప్రలంభము. ఆధునిక కవిత్వం చాలా వరకూ ఆత్మపరము; కవే అందులో నాయకుడు. రామం తనుకూడా ఆధునిక కవితాకుటుంబంలోవాణ్ణే అనుకుని బయలుదేరాడు కనక తన విరహ గీతాలకి ప్రాతిపదిక, వొక ఆదర్శప్రాయమైన ప్రేయసి, వుండితీరాలనుకున్నాడు. ఇంటి కెదురుగా తనతో కాలేజీలో చదువుకుంటోన్న చక్కని చుక్క మణి అతని దృష్టి పథంలో పడింది. ప్రథమంలో ఆమె కేసి రోజూ వో సారైనా చూస్తేనే గాని వుండలేకపోయేవాడు; కొంచెం పరిచయం చేస్తే తన ఇహ జీవనం కృతార్థమౌతుందనుకున్నాడు; పరిచయంకూడా చేసుకున్నాడు. తనకి అందుబాటులో వున్న, అందమైన మొట్ట మొదటి బాలిక ఆమె అవడంవల్ల ఆమెనే తన ఆత్మ అంతటితోటీ ప్రేమిస్తున్నా ననుకున్నాడు. అసందర్భ మేమిటంటే, ఆమెకూడా తనని ప్రేమిస్తోందా లేదా అన్న విచక్షణని అతను అనుకూలంగా విస్మరించాడు. మొదటే పొరపాటుతో బయలుదేరాడు; ఇంక చివరి వరకూ పొరపాటే. మణి సామాన్య కన్యలాగే అనుకూల వరుణ్ణి చూసి పెళ్ళి చేసుకుంది: రామం తన ఆశయాల్లో ఆశాభంగం పొందినట్టు ఫీలయి, ఆత్మవంచన చేసుకొని అసభ్యమైన పద్యాలు అల్లడం మొదలు పెట్టేడు. క్రమంగా మనస్సు అనారోగ్యం చేసుకొన్నాడు:

చదువు సాగలేదు; కవిత్వం సరిపడలేదు; ఇంకే పని చెయ్యడానికీ పనికీ రాలేదు. అందుచేత స్తబ్ధుగా, వెకిలిగా తయారయాడు. ఇప్పుడామె ప్రేమవచనం మీద తన జీవితం ఆధారం చేసుకున్నానన్నాడు— Platonic love. అందుచేతే మణికి పెండ్లయి, నాలుగేళ్ళనించి ఎక్కడో దూరంగా భర్తతో కాపురం చేసుకుంటున్నా, ఎలాగోలాగ వెతుక్కుంటూ తరుముకొని వచ్చాడు, ఆమె వున్నచోటికి తోకచుక్కలాగ: తన సంగతి ఏం చెబుతుందో కనుక్కుందామని. పెళ్ళి అయితే ఆడదానికి వొక భర్త అంటూ వుంటాడనీ, ఆమె అతని ఆధీనంలో వుంటుందనీ, తను వాళ్ళ ఇంట్లో చొరవగా ప్రవేశించడం అసందర్భమనీ అతను జ్ఞాపకముంచుకో దలచుకోలేదు: ఇచ్ఛాప్రేమికుడు. తను ప్రేమించిన స్త్రీ రాసుకునే Fountain pen వంటిదని అతని గట్టి నమ్మకం; అది ఎవరి జేబులోదైనా సరే! మణి అన్నట్టు ప్రపంచజ్ఞానం తక్కువ.

ఇంక మణి: రాముం అభిప్రాయాలు వికృతములైతే ఈమె అభిప్రాయాలు విపరీతములు. స్త్రీ సహజమైన అహంభావం (vanity) చెప్పడానికి వీలు లేనంత వుంది. హఠాత్తుగా కారుమబ్బులు క్రమ్ముకోవడం, ఇంతలోనే తెరపి యివ్వడంవంటి తెరలు తెరలుగా ఊపిరి సలపని చంచలమైన మానసిక తత్వం. అందుచేత నిశ్చలమైన ప్రేమలో నమ్మకం వుంచుకుని కూర్చోడానికెంతమాత్రమూ వీలులేదీమెకు. ఒక్కొక్కప్పుడీమె శూన్యమైన భావాకాశంలో తట్టుకోలేని తీవ్రమైన మెరపులు మెరుస్తోంటాయి. అటువంటప్పుడు పొరపాటు పడడానికి అవకాశం లేకపోలేదుకాని తన భర్తధీబలం వల్ల అలా జరగడం దుర్లభం. తన విధి నిర్వాహణంలో ఈమెకి పట్టుదల బాగానే వుంది. మొత్తం మీద ఏదో అశాంతీ, తీరనిలోటూ ఈమెలో కనబడతాయి.

మణి ఇంటర్‌తో చదువు పూర్తి చేసింది. అయితేనేం, చాలా చురుకైనది. ఆంధ్రాంగ్లాలు బాగా చదువుకొని గొప్ప గొప్ప కవుల సందర్శి మెచ్చుకోగలిగే నేర్పు సంపాదించుకుంది. స్వేచ్ఛాప్రియత్వం ఎక్కువీమెకు;

భర్త కూడా తన ఆటలు సాగనిచ్చేవాడే దొరికాడు : అని చెప్పి అతని కెంత మాత్రమూ అపచారం చెయ్యలేదు. మొగవాళ్ళని ఊరించి తమాషా చెయ్యడం ఈమె కిష్టం. అందుచేతే, రామం రాగానే వెరగుపడేటట్టు తిరుగు జవాబులు చెప్పడం మొదలు పెట్టింది. కాని రామం అంటే లోపల ఇష్టం లేకపోనూలేదు. అయితే అతన్ని స్వీకరించనూ లేదు ; వదలి పెట్టు కోడానికీ వొప్పుకోదు. ఒక బుద్ధిమంతుడు ఎప్పుడూ తన ప్రేమ కోసం తపిస్తూ తనకి పాదాక్రాంతుడై పడి వుండడం ఈమెకి సరదా. అందుకోసమే రామం అసహ్యించుకుని వెళ్ళిపోకుండా చివర కతనికి ఓదార్పు మాటలు చెప్పి, మానం వహించింది. తనని మెచ్చుకుని స్తోత్రం చేసేవాణ్ణి నిలబెట్టుకోడానికి మధురవచనాలనే ఎరని వుపయోగిస్తుంది ; అతని బుజంమీద చెయ్యివేసి అతి ఆప్యాయంగా కబుర్లు చెప్పడానికి వెనుతియ్యదు ; మనస్సులో మరో దురుద్దేశం లేకపోవడంచేత తనకి రామం అంటే ఇష్టమని భర్తతో చెప్ప డానికి సాహసించనూ గలదు— అతనీమె నిష్కపటస్వభావాన్ని అభినం దించే సహృదయుడు కూడాను.

పరశు మంచి చిద్విలాస పురుషుడు ; మేధావంతుడు. ఒడుదుడుకులు లేకుండా కులాసాగా కాలక్షేపం చెయ్యడమే అతని ధర్మ సూత్రం— **a true gentleman.** స్త్రీలకి పురుషులతో సమాన హక్కులు వుండా లంటాడు, దాని పరిణామం ఏమైనాసరే ; తన భార్యని తన స్నేహితుణ్ణి ఆదరించినట్టు ప్రేమతో, గౌరవంతో చూస్తాడు.

పరశు ఆస్తికుడూ కాడు ; నాస్తికుడూ కాడు : ఏకేశ్వరుడైతే ఇన్ని **allotropic modifications** ఏమి టతని కంటాడు. ముఖ్యంగా మతం, దేవుడూ మొదలైన అప్రస్తుత విషయాలనిగురించి ఆలోచించి, ఈ హ్రస్వమైన జీవితంలో కాలాన్ని వృథాగా వెచ్చించడు. వీటికంటె ముఖ్యావసరములైనవీ, రుచికరములైనవీ అనేక విషయాలున్నాయి ఆలోచించడానికీ, ఆచరించ డానికీ అంటాడు. ఇతను స్వచ్ఛమైన సౌందర్యోపాసకుడు : అందం ఎక్కడ

వున్నా అందరూ వొక మారాగి ఆనందించి, అభినందించకపోతే డొక్క బ్రద్దలుచేస్తానంటాడు. అలాగని, ఆ సౌందర్యం తనకే చెందివుండాలనే స్వార్థం మాత్రం ఒప్పుకోడు. జీవితరహస్యాలని చక్కగా విమర్శించి చెప్ప గలడు; తనతో వాదించే వాళ్ళని దబాయించి ఇంక మాట్లాడలే ననిపించ గలడు కూడాను. కవిత్వం అంటే ప్రీతేకాని దేశ సౌభాగ్య సంపాదనం ముందు కావాలంటాడు. లోపల వొకటి పెట్టుకుని పైకొకటి నటించడమంటే ఇతనికి పట్టలేని అసహ్యమూ, కోపమూను. మనస్సులో వున్నది పైకి చెప్పె య్యాలి, ఆ వుద్దేశ్యం ఎటువంటిదైనా సరే: 'సత్యం వద ధర్మం చర'. అన్నింటికంటె, ఇతనికి భార్య నైతికప్రవర్తనంలో పట్టలేని విశ్వాసం.

ఇటువంటి ముగ్గురినీ ఒకనాడొక్కచోటే కూర్చాడు ముసలి దేవుడు.

రామానికి మణిమీద నిజంగా నిశ్చలమైన ప్రేమలేదు; అదొక వ్యామోహమూ, ఆత్మవంచనమూను. ఆమె ఎంత కసిరినా పరాక్రమం విడిచి పెట్టకుండా తన్నే ప్రేమిస్తున్నానని నచ్చచెప్పడం మొదలు పెట్టేడు. చివరకి ఇతను వదలిపెట్టేటట్టు లేడని, బాధపడలేక 'నీమీద నాకూ ప్రేమ వుంది' అంది మణి; ఆమెచేతిని ముద్దు పెట్టుకోనిచ్చింది ఏమరుపాటున. అంతే. ఇంకీమె తన సొంతవస్తువుగదా అని ధైర్యం చిక్కిందతనికి: ప్రేమ సెలవు పుచ్చుకుంది; మొదలుపెట్టేడు పట్టె గడ్డివంటి అసందర్భపు ధోరణి: 'ప్రేయసీ! మన దరిద్రదేశంలో కవులకి పరపతి లేదని. ఆ తరవాత అన్నింటి కంటే మించి, అతను స్త్రీ సమ్మోహనాస్త్రము లనుకున్న అవకతవక పద్యాలు. ఇదికాక డాబుచెయ్యడం మొదలుపెట్టేడు, ఆమె భర్తని ఆమెను తన కిచ్చెయ్యమని అడిగేస్తానని.

ఇంతలో పరశు ప్రవేశించాడు; రామం తన ఉధృతం పూర్తిగా తగ్గించి తాజు పడ్డాడు, హృదయంలో నిర్దుష్టమైన ఆత్మవిశ్వాసం లేదుగనక. పరశు, రామం సంగతి గ్రహించాడు. అతన్ని పల్టీ కొట్టించాలనుకున్నాడు; సఫలీకృతుడయాడు. అతని ఉద్దేశం రామాన్ని తరిమేద్దామని ఎంతమాత్రమూ

కాదు. రామంచేత మణిని ప్రేమిస్తున్నానని నిజం చెప్పించాలని. కాని రామానికి ఇదివరదాకా వున్న కృత్రిమధైర్యం కాస్తా ఆవిరైపోయింది; మనిషి పిట్టయిపోయాడు. అందుకనే రామం పారిపోయాక పరశు మళ్ళీ రామాన్ని పిలుచుకొని రమ్మని మనిషిని పంపేడు, రామానికి పాఠం చెబుదామని. కవిత్వానికి ప్రాణం సత్యమూ, నిష్కాపట్యమూ అని రామం మొదట్లో నిర్వచించాడు. కాని అవే అతనిలో లేనివి; పద్యాలలోనూ లేవు; ప్రవర్తనలోనూ లేవు. పరశు ఈ పాఠమే యీ కవిశాబకానికి బోధిద్దామని పిలువనంపేడు. రామం వచ్చిన తరువాత అతనితో తప్పుడు అభిప్రాయాలు మనస్సులో కుళ్ళబెట్టుకొని పాడైపోవద్దనీ, ఋజువర్తనం కలిగి మణికే కాకుండా తనకికూడా స్నేహితుడుగా వుండి తరచు వచ్చి తమతో కులాసాగా కాలక్షేపం చెయ్యాలనీ రామాన్ని కోరేడు. రామంకూడా పరశుని అర్థం చేసుకుని, పిచ్చిపిచ్చి వూహలన్నీ విడిచిపెట్టి అప్పుడప్పుడు పరశు గృహం పావనం చెయ్యడాని కంగీకరించాడని దరిమలాను తెలిసింది.

నేటి మన నాటకరంగమీద, సాంఘికజీవనంలోని క్లిష్ట సమస్యలను తీసుకొని విమర్శించడం, జీవితఘట్టాలను ఉన్నదున్నట్టు రసవంతగా చిత్రించడం, మొదలైనవి వస్తువుగాగల నాటకాలకి పురాణగాథలకి వున్న పరపతి లేదు. ఏకాంకనాటికలూ అరుదే. నాటకానికి విమర్శను వస్తువుగా తీసుకున్నట్టయితే వొక ప్రమాదం వుంది: దాన్ని జాగ్రత్తగా వుపయోగించకపోతే వట్టి వక్తృత్వపుపోటీగా తయారవుతుంది. అందుచేత రసవంతమైన, వుద్రేకం కలిగించే సంఘటన వొకటి దానికి మూలసూత్రంగా ఏరుకోవలసి వుంటుంది: చెప్పదలచుకున్న విషయం సరిగా తల కెక్కించాలంటే సత్య మనే చేదు మాత్రకి చక్కెర కోటా వేసి యిస్తేనేకాని గొంతుక దిగదు.

ఈ కథలో ఒక నీతి చెప్పాలని నా అభిప్రాయం కాదు. ఇప్పుడు అమలులో వున్న ప్రేమ వ్యవహారాలను విమర్శించడానికి పూనుకొన్నాను: వాటి ఫలితాలను సరిచేద్దామని కాదు; ఒకవిధమైన యువకజీవితంలో వొక

నైపు చూపిద్దామని. విసుగు కలిగించకుండా దానికి అనుగుణమైన విచిత్ర సంఘటన వొకటి జతపరిచాను—ఒక తరహా ప్రకృతులను చిత్రించి వారి ఆశయసంఘర్షణంలో పైకి తేలిన వొక అపూర్వసన్నివేశాన్ని నిరూపించాను. ఇందులోని పాత్రల స్వభావభావములను వారి వారి సంభాషణలలో సరిగా వ్యక్తీకరింపగలిగి వున్నట్టయితే నేను కృతార్థుడనే.



## పాత్రలు:

| | | |
|---|---|---|
| నారాయణ | : | విద్యార్థి. |
| సీతయ్య | : | నారాయణ సహాధ్యాయి. |
| రామభద్రయ్య | : | సీతయ్యకి వేలువిడిచిన మేనమామ. |
| వెంకటకృష్ణయ్య | : | రామభద్రయ్య బావమరిది. |
| కమల | : | రామభద్రయ్య తమ్ముని కుమార్తె. |

---

# మిాసాల పక్షులు

——:o:——

## ఒకటవ రంగం

నారాయణ బసచేస్తున్న గది - ఉదయం పదిగంటలవేళ. నారాయణ వయస్సు 19 ఏళ్ళు. బి.ఏ. పరీక్షకి వెళ్ళాడు. బక్కపలచగా పొడవుగా వుంటాడు. చాలా చురుకైనవాడు. చిలిపి కన్నులు. ఉద్రేక స్వభావుడు. నిత్యోల్లాసి. ఎవరైనా చక్కని పిల్లని చూస్తే చాలు, ఆమెని అమాంతంగా ప్రేమించేస్తాడు. ఈ కారణంగా ఉన్నట్టుండి అనాలోచితంగా చిక్కులలో తగుల్కొవడం అతనికి పరిపాటి. మాట్లాడడంలో అతనికి విశిష్టమైన ఒక వింత ధోరణివుంది. తను చెప్పేది ఎదుటివారికి సరిగా బోధపడలేదేమో ననే బ్రహ్మాండమైన సందేహం వున్నట్టు, చెప్పిన మాటే అనేక రకాలుగా చకచక చెప్పడానికి ప్రయత్నిస్తాడు. కొన్ని మాటలకి అర్థమే స్ఫురించదు. అతను తెల్లని పైజామా, సిల్కు లాల్చీ వేసుకున్నాడు. తన గదిలో సామానులని చూడడానికి ఇంపుగా వుండేటట్టు ఇక్కడివి అక్కడా, అక్కడివి యిక్కడా సద్దుతూ వుంటాడు. గదిలో ఒక మంచం, దానిమిాద పరుపు, మంచం క్రింద ఒక ట్రంకు పెట్టె వున్నాయి. మరొక ప్రక్క ఒక టేబులు, దానిమిాద ఒక అద్దం, ఒక ఖాళీ ఫోటో ఫ్రేమ్, కొన్ని పుస్తకాలు వున్నాయి. ప్రస్తుతం ఒక కాలు విరిగిపోయిన కుర్చీని గోడకు ఆనించి నిలబెట్టి కొంచెం దూరంగా వెళ్ళి చూసి మంచి పని చేసినట్టు మురుస్తాడు.

నారాయణకి సీతయ్య బాల్య మిత్రుడు. సహాధ్యాయి. కొంచెం నిదానం గలవాడు. బుద్ధిమంతుడు. ప్రతి విషయమూ సావధానంగా ఆలోచించి నారాయణను చిక్కులలోనించి తప్పించడానికి ఉపాయాలు

చెబుతో వుండడం ఇతని పని. నారాయణని కొంచెం జాగ్రత్తగా చూస్తూ వుండమని అతని తండ్రి సీతయ్యకి అప్పగించాడు. సీతయ్య కూడా బి.ఏ. పరీక్షకి వెళ్ళాడు. వయస్సు 21 ఏళ్ళు. పంచె కట్టుకుని, షర్టు వేసుకుంటాడు. క్రాపింగు వున్నా వెనుక భాగంలో చిన్న పిలక కూడా వుంటుంది. సీతయ్య నారాయణ బసకి వస్తాడు.

సీతయ్య : [వీధి తలుపు కొట్టి] నారాయణా!.... నారాయణా! [పిలుస్తాడు]

నారాయణ : [లోపలనుంచి] 'ఎవరో హో, ఎవరో హో, ఇపుడా నను పలుకరింతురు ?' [కిటికీ తలుపు తెరచి బయటికి తొంగిచూసి] ఎవరా పాంథుడు ?

సీతయ్య : [వీధి గుమ్మంలోనుంచి] కీటికీ తలుపుతీస్తే యీ ఇనప వూసలలోనించి లోపలికెలా వస్తా ననుకున్నావురా ? వీధి తలుపు తియ్యి ; త్వరగా—

నారా : ఎవరది? ఎవరు కావాలండీ మీకు?

సీతయ్య : ఏడిశావ్, తలుపు తీద్దూ, వేగిరం—

నారా : [ఆశ్చర్యంతో] ఏమిటి. సీతయ్యా! నువ్వే !?

సీతయ్య : అవును. నేనే—

నారా : అంటే, సాక్షాత్తూ, రక్తమాంసాలలో! లాలా మూత్రపురీష—

సీతయ్య : అబ్బ. తలుపుతియ్యరా. నారాయణా: నీ బసకోసం వెతుక్కుంటూ తిరిగి తిరిగి వచ్చాను.

నారా : [తలుపు తెరచి] ఒట్టురా. సీతయ్యా ; నిన్ను ఆనవాలు పట్టలేక పోయానంటే నమ్ము— కంఠస్వరం చూస్తే విన్నట్టు సుపరిచితంగా వుంది : నిన్ను చూస్తే—

సీతయ్య : ఏం నన్ను చూస్తే ? నాలో మార్పేముంది ? నేను మామూలుగానే వున్నానే—

నార : [సీతయ్యకేసి, ఎగాదిగా చూస్తూ] అదే చూస్తున్నాను-అయితేనూ, ఎన్నాళ్ళకెన్నాళ్ళకి ! బహు-కాలదర్శనం ; ఏమిటి ? చిలుక్ ములుక్ ! సుప్రభాతమూ, సుస్వాగతమూ, ఇదమిదమాసనం, అవీని ! అలా పేదదేరుముందు [సీతయ్య గోడవార వున్న కుర్చీలో కూర్చుండబోతూవుంటే కంగారుగా] ఆఁ ఆఁ, ఆ కుర్చీలో కూర్చోకు—

సీతయ్య : [ఆశ్చర్యంతో] ఏం ?

నార : అబ్బే, దాని కొక కాలు జారిపోయింది కాదూ మరి ? ఊరికే అలా బొట్టమోపుగా గోడకుర్చీ వేసిపెట్టాను, అతిథిశాలకి అలంకారప్రాయంగాను ; తెలియలేదూ ! ఈ మంచంమీద కూర్చో.... [సీతయ్యని గట్టిగా కౌగలించుకుంటూ] ఇలారా, ఏదీ—

సీతయ్య : [నారాయణ కౌగిలినుంచి విడిపించుకుంటూ] ఉండు, అలా కుదిపెయ్యకు మరి. ఏమిట్రా, ఈ కౌగలింతలూ, ఈ ఆప్యాయమూను, అసహ్యంగాను ?

నార : అదేమిట్రా, కలుసుకోక కలుసుకోక ఇన్నాళ్ళకి మళ్ళీ కలుసుకుంటే అలా విసుక్కుంటావు. సీతయ్యా ? తిన్నగామాట్లాడవు ?

సీతయ్య : ఉస్స్ ! [నిట్టూర్చి] అమ్మయ్య ! [మంచంమీద కూర్చుంటాడు]

నార : [నిరుత్సాహంతో] నువ్వెప్పుడూ ఇంతేరా. మట్టి తిన్న పాములాగ, ఏమిటి ?—ఊఁ, అంతా బాగున్నారా ?

సీతయ్య : పాములు మట్టి తినవురా, నారాయణ; తినకపోయినా మాట్లాడవు.

నారా : నే నూరికే వాపోవడమేగాని, నీకు కవితాత్మ అనేది లేదురా, సీతయ్యా. వట్టి ముక్కస్య ముక్కర్థంగాడివి. [ఏదో చటుక్కున గుర్తుపట్టినట్టు] ఆఁ ! ఇప్పుడు తెలిసింది—

సీతయ్య : ఏమిటి ?

నారా : [ఆశ్చర్యంతో] హారినీ, మీసం పెంచుతున్నా వేమిట్రా యీ మధ్యని ?

సీతయ్య : [నవ్వి] హుఁ. ఇదా, "మీసము పస మగమూతికి" అన్నారు కాదుట్రా మరి ? అందుకు.

నారా : ఈ మధ్య మళ్ళీ ఎవరన్నా అన్నా రేమిటి? వీరక్షాత్రతేజం విందులు చేస్తోందిరా, యీ సారి నీ మీసాలమొహం ! రెండు భాషలలో కవిత్వం చెప్పగలిగిన వాళ్ళకి రెండు మీసాలు పెట్టు కోడాని కధికారం వుందని వాదించా డొక మహాకవి వెనకటికి : మరి నువ్వు మూడో భాషలోకూడా వ్రాస్తావేమో ? ఇంకో మీసం—

సీతయ్య : ఛ ! వూరుకో. [జేబులోనుంచి చుట్ట తీసి నోట్లో పెట్టుకుంటూ] ఏదీ అగ్గిపెట్టె ?

నారా : నువ్వెన్ని చెప్పు, మీసాలకీ చుట్టలకీ పొత్తు కుదరదురా, సీతయ్యా—అగ్గి పెట్టెలు దొరకడంలేదు. [జేబులోనుంచి సిగార్ లైటర్ తీసి అందిస్తూ] ఇదిగో పెట్రోల్ సిగార్ లైటర్ !— నిజంగా నీ ముఖారవిందాన్ని గురించి నా అభిప్రాయం చెప్ప మన్నావా ?

సీతయ్య : ఒద్దులే.

నారా : అయితే, ఇన్నాళ్ళనించీ ఏయే దేశములం జరించావు? ఏయే తోయధుల్ దాశావు? మరి ఏయే తీర్థములందు గ్రుంకిడితివి?— అంటే—

సీతయ్య : [చుట్ట అంటించి పొగ వదలుతూ] ఒరేయ్, నువ్వు మామూలుగా మాట్లాడడానికి వీలవుతుందా?

నారా : నా ఉత్సాహం యావత్తూ ఖూనీ చేసేశావురా. నిన్ను చూడగానే మొగ్గలు వేస్తుంది, అసలు—

సీతయ్య : అదేమిటి? ఎవరు?

నారా : నా ఉత్సాహలతికరా, సీతయ్యా!

సీతయ్య : ఊఁ. ఏమిటి కథ? మహ ఉత్సాహంగా వున్నట్టున్నావు? మరి నీ వుత్తరం చూస్తే నీ కిక్కడేదో ప్రాణంమీదికి వచ్చిందనుకుని పనులన్నీ మానుకుని పరుగెత్తుకొచ్చాను.

నారా : [ఆశ్చర్యంగా] నా ఉత్తరమా?

సీతయ్య : నన్ను ఉన్నవాణ్ణి ఉన్న పళంగా రమ్మనీ, ఇప్పుడు రాకపోతే మళ్ళీ మన కింక చూపులు వుండవనీ వ్రాశావు కాదూ?

నారా : అవును సుమా—అలాంటి విషయమేదో ఆ మధ్య నీకు వ్రాద్దామని అనుకున్నట్టు జ్ఞాపకం-అయితే నీకు వ్రాశానన్న మాటా?

సీతయ్య : [జేబులోనుంచి ఉత్తరం తీసి] మరి యీ వుత్తరం ఎవరు వ్రాశారు? దీని అర్థం ఏమిటి?

నారా : అదీ. నిన్ను అర్జంటుగా రమ్మని వ్రాశాను. అవును, ఇప్పుడు గుర్తుకి వస్తోంది.— ఎందుకు రాశాను చెప్మా?

సీతయ్య : అదే నేను అడిగేదీని.

నారా : అసలు సంగ తేమిటంటే, నా గుండె చితికి పోయిందిరా, సీతయ్యా !

సీతయ్య : ఏమిటి ?

నారా : నా హృదయకోశం వుంది చూశావా ? అది శిథిలమై పోయింది : నూనె-గానుగలో తెలకపిండిలాగ పిప్పయి పోయిందంటే నమ్మ-

సీతయ్య : మళ్ళీనా?

నారా : కథంతా పూర్తిగా వినాలిరా ముందు నువ్వు—

సీతయ్య : ఒద్దురోయ్, బాబు !

నారా : "వినదగు నెవ్వరు చెప్పిన"—మొన్న శుక్రవారంనాడు నేనూ స్టేషనులో రైలు దిగాను. జనంతో కిటకిటలాడి పోతోందిలే ; ఇసుక వేశాను ; రాలలేదు. సామాను కూలివాడి నెత్తినపెట్టి బయలుదేరాను ఆ జనసందోహంమధ్య పడి—

సీతయ్య : ఒరే. ఈ రోజుల్లో రైలు ఆగగానే స్టేషన్ ఎలా వుంటుందో అంత శ్రమపడి నువ్వు నాకు వర్ణించి బోధపరచడం అవసరమే అంటావా ?

నారా : నీ భావనాబలం గొప్పదే అనుకో. ఐనా ఇదే మరి రంగస్థలం.

సీతయ్య : ఏది ?

నారా : ఆ రైలు స్టేషను—అంటే నేనా తొడ తొక్కిడిలో ఊరికే అలాగ, అంటే యాదాలాబంగా, తలవని తలంపుగా, తెలిసింది కాదూ ? వెనక్కి తిరిగి చూశాను. సరీగ్గా నా వెనకాలే—

సీతయ్య : ఒక సుందరాంగి !

నారా : చాలుదు, ఒరే, ఆమెను నేను సరిగ్గా వర్ణించలేక పోతున్నానురా !

సీతయ్య : ఫరవాలేదులే, నాకు అర్థం అవుతోంది. తరవాత చెప్పు—

నారా : ఆమె భర్త ఎవరైనప్పటికీ ఆమెను చూసుకుని గర్వపడొచ్చు.

సీతయ్య : ఎవరి భార్య ఏమిటి ఆవిడ అయితే ?

నారా : ఇంకా ఎవరి భార్యా అయినట్టులేదు. వివాహదూషితంకాని కన్యకామణీ, వాసనచూడనట్టి ప్రసవంబూ వగైరా అదీని. తెలిసింది కాదూ ? "కమల" ఆవిడ పేరు! ఎంత ముద్దయిన పేరురా!

సీతయ్య : ఏమిటి, ఆ గేటులోనుంచి ఇవతలకి వచ్చేలోపల ఆవిడ పేరూ అవీ కూడా కనుక్కున్నా వేమిటి ?

నారా : నేను కనుక్కో లేదు. వాళ్ళ నాన్నో మామయ్యో, ఎవరో— ఆయన మొహానికి ఒక బుల్లి గడ్డిమోపు చాటు చేసుకున్నాడు, మీసా లనుకుంటా నవి— ఆయన "కమలా జాగర్త!" అని మా వెనకనించి కేకవేస్తున్నాడు. మరి నాలు గడుగులు ముందుకు వేశానో లేదో నా ఎడమ జబ్బలపూరులో ఏదో చెప్పలేనంత విపరీతమైన పోటు పెట్టింది, తేలు కుట్టినట్టు : ఏది, మండ్రగబ్బో ఏదో అంటారు చూడు ; మన కండరాన్ని ఒక పట్టకారుతో నొక్కి మెలి పెడితే వుంటుందీ, అలాగ.

సీతయ్య : చోటులేక రైల్లో రాత్రి తెల్లవార్లూ మేకులాగ కదలకుండా కూర్చుంటేను—

నారా : ఒరేయ్, వొస్తోంది ; నా ధోరణిలో చెప్పనీ, నువ్వలా మాటకి అడ్డం వచ్చి చొప్పదంటు ప్రశ్నలు వేస్తోంటే, నేను కంగారు పడి అంతా మరిచిపోయి మళ్ళీ మొదటినించీ మొదలెట్టవలసి వస్తుంది.

సీతయ్య : అయితే నేనింక మాట్లాడను, నీ ధోరణిలోనే చెప్పు.

నారా : ఎందాకా వచ్చాను ?

సీతయ్య : మన కండరాన్ని పట్టకారుతో పట్టి మెలిపెట్టడమో ఏదో అన్నావు.

నారా : ఊఁ, ఆ జబ్బలో చెప్పలేనంత బాధతో నేను మళ్ళీ వెనక్కి తిరిగి చూశాను. ఆవిడ పువ్వులు విసిరినట్టు నా బాధ అంతా వూరికే అలా మటుమాయమైపోయేట్టు ఒక చిన్న మందహాసం చేసి, తన సహజకోకిలకంఠం తెరిచి మృదువుగా "పాపం, నొప్పెట్టిందా ? క్షమించాలి" అంది.

సీతయ్య : ఏమిటి ? అయితే ఆ అమ్మాయే కరిచిందంటా వేమిటి, ఆ జనసమర్దంలో నిన్ను జబ్బ పట్టుకుని ?

నారా : నేనూ అదే అడిగాను; వెనక్కి తిరగడంలో ముందున్న ఆసామీ మడమ మీద మట్టి-కాలు పచ్చడయినందు కనుకుంటాను, వాడు కెవ్వుమని అరిచి, నాకు కళ్ళు లేవనీ, వున్నా కనపడవనీ తీర్మానించా డనుకో; అది వేరే వీషయం- ఆఁ. "ఎందుకండీ నన్నలా జబ్బలో కరిచారు ?" అని ఆ అమ్మాయి నడిగాను. ఆవిడ ఏమందో తెలుసా ?

సీతయ్య : క్షమించమందీ ; పశ్చాత్తాపపడిందికద తన దురుసుతనానికి ?

నారా : "ఈ గోలా. ఇంతమంది జనాన్ని చూసి బెదిరి—" అంది.

సీతయ్య : ఎంత బెదిరితేమాత్రం అంతమందిలో అమాంతంగా నిన్ను పట్టుకుని కరుస్తుందిట్రా ? మళ్ళీ చదువుకున్న అమ్మాయి—

నారా : "ఇది మూడోసారి ఇలా ముందున్నవాళ్ళని ఇవాళ ఇది కరవడం" అంది ఆ అమ్మాయి; మళ్ళీ క్షమించమని ప్రార్థించింది. అదేమో గుర్రుమంది.

సీతయ్య : అదేమిటి ?

నారా : మొదట నాకూ అర్థం అవలేదు. తీరా పరిశీలనగా చూస్తునుగదా, ఆ అమ్మాయి చంకలో ఏముందో తెలుసా ?

సీతయ్య : ఏమో ? ఏముం దేమిటి ?

నారా : ఆమె బాహువల్లరులలోని రంగురంగుల దుప్పటీని ఛేదించుకుని ఒక చక్కని సీమ కుక్కపిల్ల నావైపు కొరకొర చూస్తూ గుర్రుమంటూ ముందుకి ఉరకబోతోంది : ఆమె దాన్ని సముదాయించి ముద్దుపెట్టుకుంది.

సీతయ్య : [నవ్వి] అయితే నిన్ను కుక్క ముట్టుకుందన్నమాట ! ఏంరా, నారాయణ ?

నారా : అంతే. వెంటనే నా హృదయం ఎత్తున వున్న నీరము పల్లానికి లాగ ఆమెవైపు జలజలా ప్రవహించింది. నే నొక చక్కని సీమ కుక్కపిల్ల నెందుకయాను కాదా అని నా మనస్సు ఏడ్చింది. అంటే నేను ఆమెను ప్రేమించా ననుట—

సీతయ్య : ఈ ప్రేమ తొలి చూపులోదే కాదు, తొలి కాటులోది కూడానురా, నారాయణ !

నారా : కాని, నా దురదృష్టం, నే నామెను పారేసుకున్నానురా, సీతయ్యా ; పోగొట్టుకున్నాను.

సీతయ్య : అంటే ?

నారా : ఇంతలోకీ ఒక రాక్షసుడు-జనులు టిక్కెట్టు కలెక్టరో ఏదో అని పిలుస్తారనుకుంటాను- వచ్చి నా టిక్కెట్టంటూ, సామానుకి పాస్ అంటూ ఒక పావుగంటసేపు నన్ను పట్టుకుని హింసించేశాడు. ఆమె అదృశ్యమైపోయింది. ఇప్పుడు నాకేం గతి చెప్పరా, సీతయ్యా ?

సీతయ్య : పోనీ బయటికి వొచ్చాక వెతకలేక పోయావా ?

నారా : వచ్చిన చిక్కేమి టంటే, ఒరే సీతయ్యా, నే నామె పేరు మరిచిపోయానురా.

సీతయ్య : విమలో, ఏదో అని చెప్పినట్టున్నా విప్పుడు ?

నారా : కమల—అయితే యీ మహాపట్టణంలో 'కమలా, కమలా !' అంటూ అరుస్తూ ఎక్కడకని వెళ్ళను ? ఆమె చిరునామా. తండ్రీ లేక భర్త పేరూ అవీనో, వెర్రాడా ?

సీతయ్య : ఆమాటా నిజమే మరి—

నారా : ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు ? నాకు మతి పోవడం నీ కిష్టమా, చెప్పు ?

సీతయ్య : నే నివేళ వీరభద్రపురం వెడుతున్నాను. నాతోకూడా రా పోనీ.

నారా : ఏమిటి, కమల నిక్కడ విడిచిపెట్టా ? అసంభవంరా, సీతయ్యా !

సీతయ్య : ఇంకా ఆ కమల యీ వూళ్ళోనే వుందని నీకెలా తెలుసు ?

నారా : ఆ మాట నిజమే మరి—

సీతయ్య : మొన్న శుక్రవారంనాడు కాదూ కమల రైలు దిగింది అన్నావు ?

నారా : సరీగ్గాను—

సీతయ్య : కమల చంకలో వున్న కుక్కపిల్ల నల్లగా వుంటుంది కాదూ ?

నారా : చీకటిలాగ—ఎక్కడా ఒక్క తెల్ల వెంట్రుకైనా కనపడలేదు జబ్బలదాకాను ; యజ్ఞానికి పనికొస్తుంది !

సీతయ్య : కమల ఎలా వుంటుందీ అన్నావు ?

నారా : మణి దీపంరా, సీతయ్యా ! అప్సరస, రంభా, ఊర్వశీ, మేనకా, తిలోత్తమా, అదీని—

సీతయ్య : అది సరేలే—చామనచాయగా, బొద్దుగా వుంటుంది, అవునా ? విశాలంగా అమాయికమైన కళ్ళూ— ?

నారా : అక్షరాలా ! నువ్వెప్పుడైనా చూశావేమిట్రా కమలని ?

సీతయ్య : నువ్విందాకటినించీ వర్ణిస్తున్న కమల మా వేలువిడిచిన మేన మామ కూతురని నాకు తోస్తోంది. వాళ్ళది వీరభద్రపురమేలే ; మొన్న శుక్రవారంనాడే యీ వూరు మీదుగా వెళ్ళారు—

నారా : [కొంచెం నొచ్చుకుంటూ] ఏమిటి ! క్షమించరా, సీతయ్యా ! ఆవిడని గురించి ఏవో చాలా వాగేను నీ దగ్గర—

సీతయ్య : ఫరవాలేదులే—కమల బాగా చదువుకుంది— చిన్నప్పుడే తల్లి దండ్రులు పోతేను వాళ్ళ పెద్దతండ్రి రామభద్రయ్యగారు పెంచుతున్నాడు ఆమెను.

నారా : పాపం !

సీతయ్య : ఇంకా పెళ్ళి కాలేదు—ఇస్తానని రామభద్రయ్యగారు వొప్పు కుంటే నువ్వు కమలని పెళ్ళి చేసుకుంటావు కాదూ ? లేకపోతే బాగుండదు—

నారా : విధిగా—కమలని చేసుకోడానికి వీలు లేకపోతే నేనింక ఆ జన్మాంతం బ్రహ్మచారిగావుండి పోవడానికినిశ్చయించుకుంటేనే?

సీతయ్య : రేపు మా కమల పుట్టినరోజులే! అందుకే నేను వీరభద్రపురం వెడుతూవుంట—

నారా : మన కమల కేమైనా మంచి పుట్టినరోజు బహూమతులూ, అవీ కొని పట్టుకు వెళ్ళొద్దుట్రా మరి, సీతయ్యా ?

సీతయ్య : కొందాంలే—అన్నట్టు, వాళ్ళ పెద్ద తండ్రి రామభద్రయ్యగారు వున్నాడే. ఆయన అసాధ్యుడు. ఆయనతో నువ్వు జాగ్రత్తగా మాట్లాడవలసి వుంటుంది.

నారా : ఓ. దానికేం ? సరస సంభాషణ విషయంలో చావగొట్టేస్తాను ! నీకు ఆ భయం వొద్దు-

సీతయ్య : ఆయన తన బావమరిదిమీద పోటీకి పెద్ద పెద్ద మీసాలు పెంచుతున్నాడు— నువ్వింక ఏమి మాట్లాడినా సరేగాని, రామభద్రయ్యగారి మీసాలు అందంగా లేవని మాత్రం ఆయన దగ్గర అనకూడదు సుమా ! కొంపలు అంటుకుపోతాయి—

నారా : రామభద్రయ్యగారి మీసాలను స్తోత్రం చేస్తూ 'మీస పంచకం' అని ఆసువుగా పద్యాలు చెప్పనుట్రా !

సీతయ్య : వీరభద్రపురంలో వాళ్ళకొక మంచి బంగళా, తోటా, అవీ వున్నాయిలే—మనకి సౌఖ్యంగానే వుంటుం దక్కడ—

నారా : ఇంకేం మరి ?

సీతయ్య : అక్కడికి వెళ్ళాక కమలని నీ కిచ్చి పెళ్ళిచేస్తే బాగుంటుందని రామభద్రయ్యగారితో చెపుతాను ; ఆయనకి నామాట అంటే కొంచెం గురి వుందిలే— ఆ పైని నీ అదృష్టం !

నారా : నీమాట ఆయన తప్పకుండా వింటాడులే; నువ్వుకూడా మీసాలు పెంచుతున్నావుగా?

సీతయ్య : సరే చూద్దాం—ఇవాళ సాయంత్రమే మరి మన వీరభద్రపురం ప్రయాణం—

(తెరపడుతుంది)

## రెండవ రంగం

వీరభద్రపురంలో రామభద్రయ్యగారి బంగాళా: మరునాడు ఉదయం పదిగంటలవేళ. బంగాళా చుట్టూ రకరకాల చెట్లు, పువ్వుల మొక్కల గల చిన్న తోట వుంది. తోట మధ్య రెండు అంతస్తుల మేడ. క్రొత్తగా వెల్ల వేయబడి నీటుగావుంది. గేటు దగ్గర ఒక జట్కాబండి వచ్చి ఆగుతుంది. నారాయణ, సీతయ్య బండి దిగి కచేరిసావడిలో ప్రవేశిస్తారు. అక్కడ ఒక గోడకు చేరి ఒక సోఫా, దానికి ఎదురుగా రెండు పేము కుర్చీలు, మధ్య భాగంలో ఒక టేబులు, దానిమీద ఒక పువ్వుల కూజా, పత్రికలు వుంటాయి.

సీతయ్య : సామాను లోపల పెట్టవోయ్, బండి అబ్బీ!

నారా : ఒరే, సీతయ్యా, మన రామభద్రయ్య మామగారి లోగిలి చాలా బాగుందిరా!

సీతయ్య : నేను చెప్పలేదూ?— నువ్వు కొంచెం సేపు యీ సోఫామీద కూర్చోరా, నారాయణా; నే నొక్కసారి లోపలికివెళ్ళి అంతా ఏం చేస్తున్నారో చూసివస్తాను. [లోపలికి వెడతాడు]

నారా : మంచిది, పోయిరమ్మ.

ఇంతలో మరొక గుమ్మంలోనుంచి రామభద్రయ్యగారి బావమరిది వెంకటకృష్ణయ్యగారు మీసాలు దువ్వుకుంటూ ప్రవేశిసాడు. ఆయనకు

బొద్దుగా వుండే పెద్ద బుగ్గమీసాలు వున్నాయి. పొడవుగా వుంటాడు. పంచె, లాల్చీ, బుజంమీద కండువా వేసుకుని వుంటాడు.

నారా : [ఆయనను చూసి లేచి గొంతుక సవరించుకుని, నమస్కరిస్తూ] నమస్కారమండీ, రామభద్రయ్యగారూ! నా పేరేనండి నారాయణ అంటేను.

వెంకటకృష్ణయ్య : [కొంచెం కోపంగా] ఆఁ. ఏమన్నావు? నీ వుద్దేశం ఏమిటి? నన్ను రామభద్రయ్యగారని ఎందుకనుకున్నావు?

నారా : [వెకిలిగా] అబ్బే, ఊరికే అలా అనుకున్నానండి; అంతే—

వెం-కృ : [గంభీరంగా] నేను రామభద్రయ్యగారిని కాను!

నారా : ఓ, మీరుకాదూ? అలాగా అండి? అవును, అవును,-కాదు; కాదు—

వెం-కృ : నన్నుచూసి రామభద్రయ్యగారని పిలవాలని నీ కెందుకు బుద్ధి పుట్టిందో నాకు బోధపడటంలేదు.

నారా : మీ మీసాలు చూసి అలా అనుమానించాను; రామభద్రయ్య గారికి ఒక మంచి అందమైన మీసాలజత వుందని చెప్పారు లెండి—

వెం-కృ : ఎవరు చెప్పారు నీకు?

నారా : ఆయన వేలువిడిచిన చెల్లెలి కొడుకు, మా సీతయ్య.

వెం-కృ : ఇదుగో, చూడు అబ్బాయీ, ఎవరి మంచి చెడ్డలను గురించి అయినా నీకు సరియయిన భోగట్టా కావాలంటే, సదరు ఆసామీ వేలు విడిచిన చెల్లెలి కొడుకూ, వాళ్ళ నాయనమ్మా చెప్పే

మాటలు నువ్వెప్పుడూ నమ్మకూడదు. వాళ్ళ అభిప్రాయాలు బంధుప్రేమతో పక్షపాతదూషితములై వుంటాయి. ఒక వ్యక్తి తాలూకు మీసాల చక్కదనం విషయమై నిజానిజాలు తెలుసుకోవాలనే కుతూహలం నాకు వుంటే నేను, అతని వేలువిడిచిన చెల్లెలి కొడుకు నెప్పుడూ అడగకూడదు. మీసకట్టు అందచందాలని గురించీ, నాణ్యాన్ని గురించీ చక్కగా తెలిసిన పెద్దమనిషిని అడిగి తెలుసుకుంటాను; తెలిసిందా? [వెటకారంగా] హుం. రామభద్రయ్యగారి మీసాలు అందంగా వుండవలసిందే! భేష్! రామభద్రయ్యగారికి కూడా ఒక మోస్తరు మీసాలు వున్నమాట వాస్తవమే. ఆయన గారిది పేడి మూతి మట్టుకు కాదు. అంతవరకు అంగీకరిస్తాను- అంతే కాని, ఆయనగారి మీసాలు చూడసుందరమైన వంటే! అసందర్భం! హాస్యాస్పదం! ఘోరం! ఛీ, ఛీ, రామభద్రయ్యవీ వొక మీసాలే? ఈ సంగతి నా దగ్గర అంటే అన్నావుగాని ఇంకెక్కడా అనబోకు, నవ్విపోతారు! [వికటంగా నవ్వుతూ] ఆహాహా, ఇలాంటి విడ్డూరం నా జీవితకాలంలో ఎన్నడూ వినలేదు. రామభద్రయ్యగారి మీసాలూ- ఊహ్!--కూర్చో; ఆయన వస్తాడు. నీకళ్ళతో నువ్వే చూద్దువుగాని— [నిష్క్రమిసాడు]

నారా : ఇదుగో, చూడండీ మీ పే రెవరోను.... హారి, వెళ్ళిపోయాడు! మీసాలమీద ఎంత దీర్ఘమైన ఉపన్యాసం ఇచ్చాడు, కుర్రాడు!

సీతయ్య : [ప్రవేశించి] ఏమిరా నారాయణ, అలా దిగాలుపడి కూర్చున్నావు? కొత్తగా వుంది కాబోలు నీ కిక్కడ.

నారా : అంతా ఇప్పుడే వొక మీసాలపక్షి పరిచయభాగ్యం కలిగిందిరా నాకు, సీతయ్యా!

సీతయ్య : ఏమిటి! ఏడి?

నారా : శ్మశ్రుసౌందర్యంమీద నా కొక బుల్లి ఉపన్యాసం దంచి, అంతా ఇప్పుడే ఇలా జారిపోయాడు-

సీతయ్య : ఏమంటాడు?

నారా : ఆయనలో స్నేహభావం, కలిసికట్టుతనం అలాంటివి కొంచెం రద్దుగా వున్నట్టు తోచింది నాకు—

సీతయ్య : ఏం?

నారా : ఆయన మీససంచయం చూసి మీ మామయ్య అనుకుని, "నమస్కారమండీ, రామభద్రయ్యగారూ!" అన్నాను, సగౌరవంగాను. రామభద్రయ్యగారి మీసాలు చాలా అందంగా వుంటాయని నా కెవరో చెప్పడం ఆ అబ్బికి నచ్చినట్టులేదు. నే నలా అన్నందుకు ఆయన చిత్తం సంక్షుభించింది. ఈర్ష్యా, అసూయా అవీ గట్లు తెంపుకుని పారాయి-

సీతయ్య : [నవ్వి] నే ననుకుంటూనే వున్నాను- అదీ మచ్చు. నువ్విప్పుడు చూసిన ఆయన మా రామభద్రయ్య మామయ్యగారి భావమరిది వెంకటకృష్ణయ్యగారు. మా మామయ్య మీసాలని చూస్తే యీ వెంకట కృష్ణయ్యగారికి ఎక్కడలేని ఓర్వలేనితనమూను; రామభద్రయ్యగారి మీసాలు బాగా వుంటాయని ఎవరైనా అంటే ఈయన భరించలేడు. ఈ వెంకటకృష్ణయ్యగారు చుట్టంచూపుగా వచ్చి ప్రస్తుతం ఇక్కడ వుంటున్నాడులే— [రామభద్రయ్య గారి తమ్ముడు కూతురు కమల ప్రవేశిస్తుంది. కమల వయస్సు 16

ఏళ్ళు. వయస్సుకి తగినదానికంటె కొంచెం ఎక్కువ పొడవుగా వుంటుంది. చక్కదనానికి తగిన చురుకుతనం ఆమెలో కనిపిస్తుంది]
ఇదిగో, కమల!- కమలా, ఇతనే నా స్నేహితుడు నారాయణ అంటేను—ఇది మా మామయ్యగారి అమ్మాయి కమలరా, నారాయణా!

కమల : [నారాయణని పరకాయించి చూస్తూ] వీరి నెక్కడో చూసి నట్టు జ్ఞాపకం?

నారా : బౌవౌ! బౌవౌ! మీ సీమకుక్క పిల్ల బాగా వుందాండి, కమల గారూ?

కమల : మా "లిల్లీ" యేనా? బాగుందండి- మీ కెలా తెలుసు దాని సంగతి? మా సీతయ్య బావ చెప్పాడనుకుంటాను?

నారా : లేదు; మొన్న రైలు స్టేషన్‌లో చూశాను- మీరు—

కమల : మొన్న, అయితే మీరా—?

నారా : [సగర్వంగా] మరే నండి—

సీతయ్య : వీణ్ణే నమ్మా, మొన్న శుక్రవారంనాడు నీ కుక్క ముట్టుకుంట!

కమల : [నొచ్చుకుంటూ] క్షమించాలండీ, నారాయణగారు!

నారా : ఫరవాలేదండి— ఇవాళ నాకు చాలా సుదినమండీ, కమలగారు!

కమల : నాకూ చాలా ఆనందంగా వుందండీ మీపరిచయం కలిగినందుకు!

సీతయ్య : ఇవాళ మా కమల పుట్టిన రోజు!

కమల : నా కేం తెచ్చి పెట్టావు, సీతయ్య బావా?

నారా : పెట్టి తియ్యరా, సీతయ్య!

సీతయ్య : ఇప్పుడు కాదు, భోజనా లయాక.

కమల : అరుగో పెద్ద నాన్నగారు వస్తున్నారు- నేను వెళ్ళి భోజనాల ఏర్పాట్లు చేయిస్తాను [నిష్క్రమిస్తుంది.]

రామభద్రయ్య : [మీసాలు వడి త్రిప్పుకుంటూ ప్రవేశిస్తాడు. వయస్సు 42 ఏళ్ళు. పుష్టిగా పొడవుగా వుంటాడు. బిళ్ళగోచీ పోసి పంచ కట్టుకుని, లాల్చీ వేసుకున్నాడు. అహంభావం వున్నా నెమ్మదైనవాడు. తన చేతిలోని అద్దంలో తాను ప్రాణప్రదంగా పోషించుకుంటున్న మీసాల చక్కదనాన్ని చూసి మురిసి పోతూ] ఇదుగో, ఎప్పు డొచ్చావురా, సీతయ్యా ?

సీతయ్య : ఇప్పుడే, మామయ్యా— ఇతను మా స్నేహితుడు నారాయణ : చాలా తెలివైనవాడూ, మంచివాడూను—

నారా : [నెమ్మదిగా] కవిత్వం కూడా వ్రాస్తానని చెప్పరా, సీతయ్యా.

సీతయ్య : అన్నట్టు, కవిత్వం కూడా వ్రాస్తాడు.

రామ : అలాగా ? బాగుంది, బాబూ, సంతోషం ! [కుర్చీలో కూర్చుం టాడు.]

నారా : [ఆనందం పట్టలేకుండా వున్నట్టు] ఆహా !- ఆహా !

రామ : ఏమిటి ?

నారా : మీ మీసాలు చూస్తోన్న కొద్దీ నా వొళ్ళు నేను మరిచిపోతున్నా నండీ- అచ్చంగా వాటమైన "కెయిజరు" మీసాలు లాగ బహు అందంగా, ఆకర్షణీయంగా వున్నాయండి !

రామ : ఇవా ? [నవ్వుకుని] అవును, ఈ మీసాలని చాలా జాగ్రత్తగా పోషించుకుంటూ వొస్తున్నానులే. ఇదొక కళ.

సీతయ్య : మా మామయ్య కున్నంత అందమైన మీసాలు ఈ చుట్టుపట్ల జిల్లాలలో ఎవరికీ లేవురా, నారాయణా !

నారా : సందేహ మేమిటి ? "ఆంధ్రుల మీసాలు : అంతర్జాతీయ మోసాలు" అనే విషయాన్ని గురించి ప్రత్యేక పరిశోధన చేస్తూ ఆసేతుహిమాచలపర్యంతం పర్యటనం చేసివచ్చిన నాకే ఇలాంటి మీసకోశం ఎక్కడా తారసిల్ల లేదంటే—

రామ : నిజమే ? ఈ కాలంలో మీసాల ఔన్నత్యం, వాటి పోషణ సంగతీ ఎవరికి తెలుసునోయ్ ? ఈ కాలపువా ళ్ళంతా మీసాలు సగం సగం కత్తిరించుకునీ, అసలు తీసేసి నున్నగానూ అఘో రిస్తున్నారు. ఆ శ్రద్ధా, ఆ వోపికా, ఆ పట్టుదలా, అన్నీ పోయాయి ! నా మీసా లున్నాయి చూశావూ—

నారా : చూస్తున్నానండి, తనివి తీరటంలేదు !

రామ : వాసన నూనె రాసి, వీట్లని వడుపుగా మెలివేసి, లేడి కొమ్ముల లాగ తిరిగిన వీటి మొనలమీద గజనిమ్మపండ్లు నిలబెట్టగలను పడిపోకుండాను, తెలిసిందా ?

నాతా : మీ మీసాలమీద గజనిమ్మ పండ్లేమండీ, చిన్న చెన్నంగి కొబ్బరి బొండాలనుకూడా నిలబెట్టి భరతనాట్యం చెయ్యవొచ్చునండి !

రామ : చెప్పలేం, ఎప్పుడూ ప్రయత్నించలేదు.

నారా : మీరు తల్చుకుంటే అదెంత పనండి !

సీతయ్య : [నారాయణ సమయ స్ఫూర్తిని మెచ్చుకుంటూ] భేష్, సెహబాస్ !

రామ : ఇదుగో, వెంకటకృష్ణయ్యబావగారు వొస్తున్నారు, స్నానం అయినట్టుంది.

వెం-కృ : [ప్రవేశించి] ఏమిటి, రామభద్రయ్య బావగారు, మీ మీసం ఇవాళ కొంచెం కత్తిరించి నట్టున్నారే ?

రామ : ఛ, ఛ! నేను మీసం కత్తిరించుకోవలసినంత ఖర్మం ఏ మొచ్చింది ? నా మీసాలు నిండుగా పుష్కలంగా యథాప్రకారంగా చెక్కుచెదరకుండా వున్నాయి. అవి కత్తిరించానని మీ కెందుకు తోచిం దసలు ?

వెం-కృ : అబ్బే, ఆ చిగురినీ యీ చిగురనీ కొంచెం ఏదో బొర్రి బొర్రిగా వున్నట్టు కనపడితేనూ- ఎందుకో కొంచెం పొట్టిగాను బొద్దు తక్కువైనట్టూ అనింది. బహుశా పేను కొరికి వుండొచ్చు!

రామ : ఛీ, అసహ్యంగా అలా అవాచ్యం మాట లనకండి! ఇంకా రెండు నిమిషాలైనా కాలేదు నేను అద్దంలో చూసుకుని- [మళ్ళీ ఒకసారి అద్దంలో చూసుకుని] నా మీసాలు నిక్షేపంలా వున్నాయి. మీ మీసాలే ఇంకా ఏదో కొంచెం—

వెం-కృ : అఁ అఁ, ఏమంటున్నారు ? సరిగ్గా ఆలోచించుకుని మరీ—

సీతయ్య : ఒరే నారాయణా, ముందు నువ్వు స్నానానికిలే, మళ్ళీ ఆలస్య మైపోతుంది భోజనాలకి.

రామ : అవును, వెళ్ళిరా, బాబూ.

వెం-కృ : [సీతయ్యను చూసి] ఇదుగో సీతయ్య! నువ్వెప్పుడు వొచ్చావయ్యా ?

సీతయ్య : ఇప్పుడే వచ్చానండి, బాబుగారు.

వెం-కృ : ఈ కొత్త అబ్బాయి ఎవరు ?

సీతయ్య : నా స్నేహితుడు లెండి; నారాయణ. మీ రెప్పుడు వచ్చారు అయితేను ?

వెం-కృ : నిన్ననే వచ్చానయ్యా; మా అబ్బాయికి కమల నిచ్చి వివాహం చెయ్యడానికి నిశ్చయించుకున్నాం బావగారూ నేనూను. ఆ విషయాలు ముఖాముఖీ మాట్లాడుకుని తాంబూలాలు పుచ్చుకు వెడదామని వచ్చాను.

నారా : [ఆశాభంగంతో] హో, సీతయ్యా ! పులుసులో—

సీతయ్య : నువ్వు పదరా, నారాయణ- [వెంకటకృష్ణయ్యతో] ఏమిటి, బాబుగారూ, కమలను మీ ప్రకాశిగాడి కిచ్చి వివాహం చేస్తున్నారా ?

వెం-కృ : మా చిరంజీవి ప్రకాశరావు కిచ్చి—

సీతయ్య : ఏం, మామయ్యా ?

రామ : అవునురా. దాని చదువుకూడా పూర్తి అయిందా ? ఇంక మూడు ముళ్ళుకూడా వేయించేస్తే మన బాధ్యత తీరిపోతుంది.

వెం-కృ : నీ ఉద్దేశం ఏమిటోయ్, సీతయ్యా ?

సీతయ్య : బాగానే వుందండి. కాని వరహీనం అవుతుందేమో అని నాకు కొంచెం—

వెం-కృ : అబ్బే. ఆడపిల్లలు అలా వుంటారుగాని, మావాడు మంచి పొడుగైనవాడూ, దారుఢ్యమైనవాడూ అదీని. నువ్వు వాణ్ణి యీమధ్య ఎప్పుడూ చూడలేదనుకుంటాను.

రామ : మనం లోపలికి వెడదామా ఇంక ? వడ్డన అయివుంటుంది యీపాటికి.

(తెర పడుతుంది)

## మూడవ రంగం

ఆనాటి సాయంకాలం, 5 గంటలకి _ బంగాళాకు వెనకవైపున వున్న తోటలో ఒక పెద్ద వేపచెట్టు కొమ్మకి తూగుటుయ్యాల వేసి వుంటుంది. దానికి ఒక ప్రక్కన ఒక సిమెంటు బెంచి వుంటుంది. చుట్టూ పువ్వుల లతలతో కూడిన పొదలు వుంటాయి. కమల ఉయ్యాల మీద పుస్తకం చదువు కుంటూ కూర్చుని వుంటుంది. అంతవరకు కమల పాదాల దగ్గర కూర్చున్న కుక్క పిల్ల మొరుగుతూ ఒక పొదవైపు పరుగెడుతుంది.

నారాయణ : [ఆ పొదమాటునుంచి] బౌవా! బౌవా! హేయ్! హోయ్! ....ప్చ్ చ్చు చ్చు చ్చు! [కుక్కని పిలుస్తాడు_ ఈల వేస్తాడు. అది వచ్చి నారాయణ మీద పడి అతని కాళ్ళు నాకుతుంది. నారాయణ కంగారుపడి అక్కడనించి మరొక పొదవెనకాలకి పరుగెడతాడు; కుక్క కూడా వెనకాలే వెడుతుంది.]

కమల : [పుస్తకం మూసేసి] లిల్లీ, లిల్లీ! దా! దా! అఁయ్ఁ, తప్పు!- ఎవరు ?

నారా : నేనండీ, కమలగారూ, నారాయణని!

కమల : ఎక్కడున్నారు ?

నారా : [పొద వెనుకనుంచి, కొంచెం భయంతో] ఇక్కడ ఈ మాలతీనికుంజం మాటున! మీ రా 'లిల్లీయో' ఏదో దాన్ని కాస్త సముదాయించి పట్టుకుంటే బయటికి వస్తాను.

కమల : లిల్లీ! దా! [కుక్క పిల్ల కమల దగ్గరకి పరుగెత్తుకుని వస్తుంది_ నారాయణతో] ఫరవాలేదు. రండి, ఇది కరవదు. ఊరికే ఆప్యాయంగా నాకుతుంది అంతే— మొరిగే కుక్క కరవదని సామెత వుంది, మీకు తెలియదూ ?

నారా : నాకు తెలుసులెండి ఆ సామెత వున్నట్టు; మీ కుక్కకు కూడా తెలుసునో లేదో మరి అని? అయితే, రమ్మంటారా ధైర్యం చేసి? [కుక్క మొరుగుతుంది]

కమల : దా, దా!— రండి భయంలేదు. కంగారుపడి దాన్ని ఏమీ అనకండి, నాకనివ్వండి,

నారా : [కుక్క అతని కాళ్ళు నాకుతుంది; తప్పించుకుని వస్తూ] ఆఁయ్ఁ, ఆఁయ్ఁ! ప్చ్ చ్చు చ్చు చ్చు!- ఏమీ లేదు; దీన్నిచూడగానే నాకు జబ్బలో పోటు మొదలెట్టింది.

కమల : పాపం! మొన్న స్టేషన్‌లో ఇది నిష్కారణంగా మిమ్మల్ని కరిచింది. క్షమించాలండీ, నారాయణగారూ!

నారా : ఫరవాలేదండి; మళ్ళీ కరవకపోతే సరి! [కుక్క తోక ఆడిస్తూ దూరంగా పోతుంది]

కమల : చూశారా, ఏమీ చెయ్యదు—అదుగో దూరంగా పోయి హాయిగా ఎలా ఆడుకుంటోందో! పిచ్చిలిల్లీ!

నారా : ఇది పిచ్చిదికూడా నేమిటండి?

కమల : [నవ్వి] అబ్బే, ముద్దుకి అలా అన్నాను—

నారా : అంతే కద—కమలగారూ!

కమల : చెప్పండి—

నారా : ఈ సుందరసంధ్యారాగాలలో, ఈ మందమారుత పరిమళ నిశ్వాసాలలో, పక్షికులకలకలా రావాలతో కూడిన యీ ఉద్యాన వనంలో—

కమల : ఏమిటది?

నారా : ఈ జంబూనింబ వృక్షంబులమధ్య అమర్చిన యీ తూగుటు య్యేలమీద బాగుగా వూగుతూ మీ రలా నోగకనురెప్పల నప్ప ళించి పుస్తకం చదువుకుంటూ కూర్చోవడం చూస్తూ వుంటే—

కమల : [నవ్వుతూ] నందనవనంలో అప్సరస్సుందరిలాగ వున్నానా ?

నారా : సరిగ్గాను !

కమల : మీరు కవిత్వంకూడా చెపుతారేమిటి ?,

నారా : చెపుతానండి— నిరుపహతిస్థలంబూ అలాంటివి దొరికి నప్పుడూ, ఊయెలమంచం వగైరా కనపడినప్పుడూను.

కమల : నాకు కవులంటే చాలా అభిమానమండీ, నారాయణగారూ !

నారా : చంపేశారు ! చెప్పేరుకాదు—

కమల : అయితే మాత్రం, ఏం లాభం ?

నారా : లాభం లేకేమండీ ?

కమల : స్కూలు ఫైనలు మూడు సార్లు తప్పాడు—

నారా : లేకపోతే, ఆ త్వాష్ట్రిం, ఉష్ట్రిపక్షిలాగ మొహం వాడూను, వాడు ప్యాసవుతాడని ఎందు కనుకున్నారు ?

కమల : మీ రెరుగుదు రేమిటి అతన్ని ?

నారా : ఎవర్ని ?

కమల : మా పెద్దనాన్నగారి బావమరిది వెంకటకృష్ణయ్యగారి కొడుకు —ప్రకాశరావుని ?

నారా : ఎరుగుండే దేమి టండి ?

కమల : సరిగ్గా చూసినట్టు వర్ణించా రతన్ని మరి ? అతను అచ్చంగా ఉష్ట్రపక్షి ఆకారంగానే వుంటాడు—

నారా : అదేనండి మరి, కవీశ్వరుడి భావనాబలం అంటేను—

కమల : త్వాష్ట్రమందన్న కాదూ అన్నారు ? ఆ ప్రకాశరావు కిచ్చి పెళ్ళి చేస్తారుట నన్ను—

నారా : అసంభవం !

కమల : తప్పదని గట్టిగా చెప్పారు పెద్దనాన్నగారు ; వాళ్ళకి బోలెడు ఆస్థి వుందిట—ఆస్థి ఎవరికి కావాలండీ ?

నారా : అవసరం లేదండి— పెళ్ళికి ప్రేమ ప్రధానం.

కమల : ప్రేమ అంటే మా పెద్దనాన్నగారి కెలా తెలుస్తుంది ?

నారా : చెప్పినా తెలియదండి— వాళ్ళ కాలంలో ప్రేమకి బదులుగా ఆస్థి చూసుకునేవారు.

కమల : ఇవాళ నా పుట్టినరోజు. ప్రొద్దున్నే లేచే సరికి యీ ఘోర వార్త నా చెవిని వేశారు పెద్ద నాన్నగారు.

నారా : నాకు నడి నెత్తిమీద పిడుగు పడ్డట్టయింది !

కమల : మీకు కూడానా ?

నారా : మీరు చెపితే నమ్మరుగాని—

కమల : నమ్ముతాను చెప్పండి. నా కీ పెళ్ళి అన్యాయమని ఎవరు చెప్పినా నమ్ముతాను.

నారా : ఆర్త మించిపోయినట్టు మిమ్మ ల్నిప్పుడు అర్జంటుగా ఆ దద్దమ్మకి—

కమల : త్వాష్ట్రినికి—

నారా : త్వాష్ట్రి మందన్న కిచ్చి పెళ్ళి చెయ్యబోతున్నారని వినేటప్పటికి నిజంగా, కోపదారి అయిన గాడిద వొకటి వెనుక కాళ్ళతో నా పొత్తికడుపుమీద తన్నిన ట్టయింది!

కమల : కోపదారి అయిన గాడిదా?

నారా అవును; గాడిద సాధుజంతువు; కోపం వస్తేనేగాని తన్నదు.

కమల : ఏ గాడిద అండీ?

నారా : ఏ గాడిద ఏమిటండీ? ఏదైనాసరే- చాకలి రజకుడి గాడిద; జిరాఫీ; జీబ్రా!

కమల : మా పెద్ద నాన్నగారిని వర్ణిస్తున్నారేమో అనుకున్నాను; అందుకు.

నారా : ఓ, అదా? ఆయన్నికూడా ఒక గాడిదతో పోల్చవచ్చు, ఒక విధంగా.

కమల : ఏ విధంగా?

నారా : మొక్కజొొన్న పీచులాగ, బుల్లి గడ్డి మేటిలాగ ఆ మొహం నిండా మీసాలు పెంచడంలో చూపే ఆయన ఓపిక, శ్రద్ధా చూస్తే— ఆఁ, వొస్తోంది—

కమల : రానివ్వండి; సంశయించకండి.

నారా : చింపాంజీ, ఒరాంగొటాంగ్, గెరిల్లా!

కమల : అదేమిటి?

నారా : కోతులు, కొండముచ్చులలో రకాలు.

కమల : మీ ఉపమానాలు మా పెద్దనాన్నగారికి సరిగ్గా సరిపోతాయి !

నారా : "ఉపమా కాళిదాసస్య" అన్నారు- ఎంత చక్కగా ఆలోచించా నంటారు మరి ?— అసలు యీ ఘోషా కావాలని గోలపెట్టే స్త్రీలంతా—

కమల : స్త్రీ లెవరూ ఘోషా కావాలని కోరుకోరండీ, నారాయణగారూ— వాళ్ళకి ప్రదర్శనేచ్ఛ ఎక్కువ : వాళ్ళ అలంకారాలూ, అతిశయాలూ, వొయ్యారాలూ, తిప్పుకోడాలూ-మీకు నేను చెప్పాలా ? స్త్రీలకి ఘోషా మొగవాళ్ళు విధిస్తారు.

నారా : పోనీ, అలాగే—పురుషులచేత ఘోషా విధించబడ్డ స్త్రీలందరూ మీ పెద్దనాన్నగారిలాగ మీసాలూ, గడ్డాలూ పెంచేసుకుంటే, వాళ్ళింక ఈ గుడ్డకరువు రోజుల్లో ముసుగులతోటీ, తెరలతోటీ బాధపడక్కర్లేదు ; మొహం తాలూకు రూపురేఖావిలాసాలేమైనా వుంటే కంచుకాగడా వేసి వెతికినా మచ్చుకైనా కనపడవు—

కమల : [నవ్వి] ఆడవాళ్ళకి మీసాలూ, గడ్డాలూ రావండీ !

నారా : అదేలెండి వాళ్ళ అదృష్టమూ, గర్వకారణమూను—

కమల : ఏమయితేనేం, నా పరిస్థితి యిప్పుడు పెనంమీద వేడి తప్పించుకోవాలని పొయ్యిలో పడినట్టుంది !

నారా : ఈ విషయం వినడానికి నాకు చాలా విచారంగా వుందండీ, కమలగారూ ; నా హృదయం తరుక్కు పోతోంది.

కమల : ఏడాది అయింది, నేను హాస్టలులో వుంటున్నాను చదువుకోడానికి వెళ్ళి. ఏడాదిక్రితం వరకూ మా పెద్దనాన్నగారు నిక్షేపంలాగ

వుండేవారు——అంతే. మొన్న నేను పరీక్షలై సెలవల కింటికి వచ్చాను; మా పెద్దనాన్నగారిలో విపరీతమైన మార్పు ఏర్పడింది——

నారా : మిమ్మల్ని ఇదివరకులాగ సరిగ్గా చూడటం మానేశారులాగుంది; తెలుస్తోనే వుంది.

కమల : నేనంటే ఆయనకెప్పుడూ అమితమైన ప్రేమే; దేనికదే చెప్పుకోవాలి-అదికాదు, మొహంనిండా అలా అసహ్యంగా మీసాలు పెంచుకున్నవాళ్ళని చూస్తే నాకు కంపరం పుట్టుకొస్తుంది; ఆ ఘోరదృశ్యంచూసి నేను భరించలేను——మీసాలు పెంచటం అనాగరిక లక్షణం అని నా దృఢనమ్మకం——

నారా : [నున్నగావున్న తనపై పెదవి తడుముకుంటూ] ఇంకా సందేహం ఏమిటండి?

కమల : పోనీ, పెళ్ళి చేస్తున్నారుకదా, ఇంక మా పెద్దనాన్నగారి ముఖం అట్టే చూడనక్కర్లేదని ఆశపడ్డాను——

నారా : అమ్మా, మీమీద అంతప్రేమ వున్నవాడు మీ అత్తవారి యింటికి వచ్చి అక్కడే తిష్ఠ వేస్తాడుగాని మానాడంటారా?

కమల : ఎప్పుడైనా వొకసారి వచ్చినా ఏదో భరించవచ్చు ననుకోండి. కాని, ఇప్పుడు నాకు కాబోయే మామగారుకూడా ఈయనమీద పోటీగా మీసాలు పెంచుతున్నాడు. 'స్వర్గానికి వెళ్ళినా' అన్నట్టు, అత్తవారింటికి వెళ్ళినా యీ దౌర్భాగ్యం నాకు తప్పేటట్టు లేదు——ఇంక నాకేం గతి?

నారా : మీ రంత అలా ఇదవుతోవుంటే నేను చూడలేను మరి; దీని కేదైనా ఉపాయాంతరం లేకుండా వుండదు.

కమల : ఏ వుపాయం కనబడదు——పోనీ, మా సీతయ్యబావ ఆ దిక్కు-మాలిన చుట్టలు కాల్చకుండా వుంటే అతన్నయినా పెళ్ళి చేసుకొనేదాన్ని !

నారా : అబ్బే, లాభం లేదండి, వాడుకూడా యీ మధ్య మీసాలు పెంచుతున్నాడు !

కమల : లోకాని కంతకీ యీ మీసాల పిచ్చి ఏమిటో ! నామీద ఎవరికీ జాలిలేదు ; ఇప్పుడు నేనేం చెయ్యను ? నారాయణా ! [కంట నీరు పెట్టుకుంటుంది]

నారా : [ఆమెకు దగ్గరగా వచ్చి, ప్రేమగా] కమలా !

కమల : [కొంచెం జరిగి కూర్చుని] ఠత్ ! అదేమిటి ? 'కమలగారూ' అనండి——

నారా : కమలగారూ !

[కుక్క మొరుగుతుంది]

కమల : దా, దా, ప్చ్ చ్చు చ్చు చ్చు !- కొంచెం దూరంగావుండి మాట్లాడండి. నాకు దగ్గరగా ఎవరైనా వస్తే "లిల్లీ" సహించలేదు.

నారా : ఓహో అదా ? చూడండి కమలగారూ ! [ఒక అడుగు వెనకకి వేసి నిలబడి] నేను మీకు ఇంత దూరంవరకూ రావచ్చనుకుంటాను ?

కమల : ఆఁ, యీసారి చెప్పండి,

నారా : కమలగారూ మీరు——

కమల : మీ భాగ్యదేవతని !—— అవునా ?

నారా : నా నోట్లో వున్నది సరీగ్గా చెప్పావు !

కమల : లాభం లేదు, అనకండి.

నారా : ఏం, అలా అంటున్నారు? నాకు మీసాలు లేవు. ఇంక ముందెప్పుడూ పెంచనని ప్రతిజ్ఞ చేస్తున్నాను!

కమల : చాలదు. మీ నాన్నగారికో?

నారా : మా నాయనమ్మ పోయినప్పటినించీ ఇంతవరకూ లేవు. ఇంక ముందు విషయం తగు జాగ్రత్త తీసుకుంటాను!

కమల : మిమ్మల్ని గురించి మా సీతయ్య బావ అన్నీ చెప్పాడు.

నారా : [ఆశ్చర్యంతో] ఏమిటి!

కమల : మీ కేమాత్రం ఆస్థి వుంది?

నారా : ఏదో సంసారపక్షంగా వుంటుంది. అది కూడా చెప్పలేదూ, వాడు?

కమల : మెద్రాసులో ఒక మేడా, ఒక కారూ కొనుక్కుని మనం దర్జాగా జీవించడానికి సరిపోతుందా?

నారా : ఏదైనా సినీమా కంపెనీలో ప్రవేశిస్తాను: ఏమంటారు, నా కమలగారూ? [మళ్ళీ కుక్క అతని దగ్గరకి వస్తుంది] అబ్బ. ఈ లిల్లీని కొంచెం దూరంగా వెళ్ళమంటారా? నేను చెప్పదల్చుకున్న మంచి విషయాలన్నీ—

కమల : క్షమించండి. ప్రయోజనం లేదు, నా కర్మం నేను అనుభవించవలసిందే. నా పెళ్ళి నిశ్చయం చేశారు పెద్దనాన్నగారు. దానికింక తిరుగు లేదు. [ఇంతలో అక్కడను నారాయణ వెనుకవైపునుంచి వస్తున్న సీతయ్యని చూసి] సీతయ్య బావా?

నారా : ఎందుకు ? నే నున్నాను కాదండీ ? లిల్లీ వుంది [వెనుకకు తిరిగి సీతయ్యను చూసి] ఓ, వొస్తున్నాడా ?

సీతయ్య : [ప్రవేశించి] కుక్క మొరుగుతూ వుంటే మళ్ళీ మన నారాయణ జబ్బో, పిక్కో పట్టుకుందనుకుని పరిగెత్తుకొచ్చాను. ఏమిటి కమలా ఏమంటున్నాడు మా నారాయణ ?

నారా : ఒరేయ్ సీతయ్యా, సమయానికి వచ్చావురా. పరిస్థితి అంతా కుండలో పులుసులాగ కుతకుత ఉడుకుతోంది, తెలిసింది కాదూ ? మన కమలగారిని ఆ ప్రకాశరావనే త్వాష్ట్రినికి—

కమల : త్వాష్ట్రిమందన్న—

నారా : అదీ, త్వాష్ట్రిమందన్న కిచ్చి కట్టబెడతానని పెద్దనాన్న బలవంతం పెడుతున్నాడు. పోనీ నిన్ను చేసుకుందామంటే—

కమల : నారాయణగారూ ! [వారిస్తుంది.]

నారా : నేతి నేతి అనుకుంటూ వెడితే ఇంక నేను మిగిలాను. అంటే మెడ్రాసులో ఒక బుల్లి మేడా, కారూ కొని మామూలుగా దర్జాగా సుఖ జీవనం చేయించే పూచీ యిప్పుడు నేను వహిస్తానన్నాను.

కమల : [నారాయణతో] అసలు సంగతి చెప్పరేం ?

నారా : అసలు సంగ తేమిటంటే, సీతయ్యా- మీ మామయ్య రామ భద్రయ్యగా రున్నారు చూడు, ఆయన తాలూకు మీసగొండి తనాన్ని—

సీతయ్య : మీసగొండితన మేమిట్రోయ్ ?

నారా : [వెక్కిరింపుగా] లంచగొండితన మేమిట్రోయ్ ?

సీతయ్య : అలాంటిదా ?

నారా : అవును,- ఆయన మీసాల బూచి వేషం చూసి మన కమలగారు భరించలేకుండా వున్నారు. పోనీ, ఆ ప్రకాశిగాడో ఎవడో వాణ్ణి పెళ్ళి చేసుకుని మామగారి యింటికి వెడితే ఈ చర తప్పుతుందేమో అనుకుంటే, వాడి బాబు వెంకటకృష్ణయ్యకీ అదే జబ్బు ! పెనం మీదనించి పొయ్యిలోకీ, పొయ్యికి వెళ్ళినా స్వర్గమూ, అవీని ; తెలిసిందికాదూ ?

కమల : [జాలిగా] సీతయ్యబావా, దీనికేదైనా తరణోపాయం చెప్పి తప్పిస్తేనే గాని నా జీవితం దుర్భరమైపోతుంది.

నారా : నాకు మాత్రం ?

కమల : నాకీ పెళ్ళి గనక తప్పక పోయినట్టయితే నే నింక యావజ్జీవమూ కుళ్ళవలసిందే.

నారా : నేను ఆత్మహత్య చేసుకోడానికి సంసిద్ధుడనై వున్నాను గదా !

సీతయ్య : అలా బెదిరించకురా, నాన్నా ; అవసరం లేదు. నేను మధ్యాహ్నం నించీ ఈ విషయమే తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

కమల ; ఏమిటి ?

నారా : నిజమేట్రా ? నాకు తెలుసు. ఎలాగైనా చుట్ట చుట్టే, సిగరెట్టు సిగరెట్టే—

కమల : ఛీ, అదేమిటండీ ?

నారా : ఏం, తల్లక్రిందులుగా అన్నా నేమిటి ? అలాగై తే సిగరెట్టు సిగరెట్టే, చుట్ట చుట్టే !

సీతయ్య : ఉండండి- అలా పోట్లాడుకోకండి ; ఆc. నేను ఆలోచించగా, ఆలోచించగా ఒక ఉపాయం తట్టింది.

కమల : ఏమిటి ?

నారా : తట్టిందీ ?

సీతయ్య : అది ఆచరణలో పెడితే ఫలించవచ్చు.

నారా : ఆచరణలో పెట్టి తీరుతున్నాం.

కమల : అంతకంటె ఏం కావాలి ?

సీతయ్య : కమలా, రామభద్రయ్య మామయ్య రాత్రిళ్ళ ఏ గదిలో పడుకుంటూ వుంటాడు ?

కమల : ఎండలు ఎక్కువగా వుంటున్నాయి కాదూ ? అందుచేత పెద్ద నాన్నగారు రాత్రిళ్ళ రోజూ ఈ వుయ్యాల మీదే పక్క వేయించుకుని ఆరబయట నిద్రపోతున్నారు.

సీతయ్య : బాగుంది. ఇవాళ రాత్రి సరిగ్గా ఒంటి గంటకి మన నారాయణ ఇక్కడికి వచ్చి ఒక కత్తెరతో చప్పుడు చెయ్యకుండా రామ భద్రయ్య మామయ్య మీసాలు కత్తిరించేస్తాడు !

నారా : [విస్మయంతో] నేనా ?

సీతయ్య : అవును, నువ్వే.

నారా : ఆయన మెలుకువ వచ్చి లేచి తంతాడేమో, ఆలోచించావురా, అబ్బీ ?

కమల : [దీనంగా] నారాయణగారూ ! నా కోసం—

నారా : సరే మరి, ఇంక తప్పదు-ఆజ్ఞ శిరసా వహించాం. కమలగారి కోసం ఉరి స్తంభం ఎక్కమన్నా సిద్ధం !— అసలు నాకు

కూడా ఆ రామభద్రయ్య మామగారి మీసపుంజం వెనుక ఏయే వింతజంతువులు దాక్కుని వున్నాయో పరిశోధన చెయ్యాలనే కుతూహలం కొరుక్కు తింటోంది.

సీతయ్య : పూర్తిగా కత్తిరించనక్కర్లేదులే ; తిరపతి పని చేస్తే చాలు.

నారా : ఇంక మొదలెట్టాక నన్నాపడానికి బ్రహ్మతరంకాదు ; చూస్తావుగా ?

కమల : ఇలా చెయ్యడం వల్ల వచ్చే ఫలితం ?

సీతయ్య : మామయ్య రేపు పొద్దున్నే లేచి తనకి అతిప్రీతికరమైన, గర్వకారణమైన మీసాల జత అంతర్థానమైపోయిందని తెలుసుకుంటాడు—

నారా : నిప్పులు తొక్కిన కోతి అయిపోతాడు !

సీతయ్య : తనతో పోటీకి మీసాలు పెంచుతూ వున్న వెంకటకృష్ణయ్యగారు ఓర్చలేక తన మీసాలను రాత్రి నిద్రపోతూ వుంటే దొంగతనంగా కత్తిరించేశాడని తప్పకుండా ఊహించి, సదరు వెంకటకృష్ణయ్యగారి మీద మామయ్య ఉగ్రుడై పోయిన వాడై బావమరిదికి బుద్ధిచెప్పి, కమలని ఆయన కొడుక్కి యివ్వనని ఖండితంగా చెప్పి ఇంటిలో నించి గెంటించివేస్తాడు !

కమల : [చప్పట్లు కొడుతూ] భేష్ ! భేష్ ! బాగుంది ; బాగుంది, సీతయ్య బావా !

సీతయ్య : దీనివల్ల రెండు ప్రయోజనాలు : కమలకు ఇష్టంలేని యీ పెళ్ళి తప్పి పోతుంది. రామభద్రయ్య మామయ్య భయంకరమైన మీసాలకి స్వస్తి అయి మనకి కన్నుల పండుగ చేకూరుతుంది.

నారా : ఒక్క దెబ్బతో రెండు పక్షులు, ఏమిటి ?

సీతయ్య : ఒక కత్తెరతో రెండు మీసాల పక్షులు! ఎలా వుంది, కమలా ?

కమల : [కృతజ్ఞతతో] అమోఘంగా వుంది, సీతయ్య బావా. నీకు నేను ఆజన్మాంతం కృతజ్ఞురాలిని— ఇంక మన నారాయణగారి చాకచక్యం మీద ఆధారపడివుంది కార్య మంతాను.

నారా : [ప్రతిజ్ఞాస్వరంతో] స్త్రీల మానరక్షణ విషయంలో నారాయణ ఇంతవర కెన్నడూ వెనుకంజ వెయ్యలేదు. ఇప్పుడు అసలే వెయ్యడు- మన ఆయుధ మంజూష సిద్ధంగా వుంది కాదురా, సీతయ్య ? ఏదీ— [కమలకేసి చూసి] క్షమించాలండి — పౌడీ, కత్తెరా. తంటసం ఇత్యాదులు, పనిముట్లు ?

సీతయ్య : ఇవాళ రాత్రి గడియారం సరీగ్గా ఒంటి గంట కొడుతూ వుంటే —ఈ తూగుటుయ్యాలే రంగస్థలం; తెలిసిందికాదూ ?

నారా : ఓ కే !— బౌవౌ ! బౌవౌ ! చిలుక్, ములుక్ !!

(తెర పడుతుంది.)

## నాలుగవ రంగం

ఆనాటిరాత్రి : గడియారం ఒంటి గంట కొడుతుంది. తోటలో వెన్నెల చెట్ల ఆకుల సందులలో నుంచి పుచ్చ పువ్వులా కాస్తోంది. తూగుటుయ్యాల మీద ఒక వ్యక్తి హాయిగా నిద్రపోతూ వుంటాడు. కీచురాళ్ళ ధ్వని, దానినిమించి గుర్రుపడుతున్న సవ్వడి—

నారా : [ప్రవేశించి] ఆహా ! ఈ వెన్నెల తోటలో ఆరు బయట తూగుటుయ్యాల మీద ఎంత సుఖంగా గుర్రుపట్టి నిద్ర

పోతున్నాడు, కుర్రాడు! ఈయన మీసకోళం ఎక్కడ వుందా అని ఇప్పుడు నా మీమాంస!— [చప్పుడు చేయకుండా ఉయ్యాలను సమీపించి, నిద్రిస్తున్న వ్యక్తి ముఖాన్ని పరిశీలించి] ఓహో, ఈ మీసాల గుబురులో మిణుగురు పురుగులు యథేచ్ఛగా తరుములాడు కుంటూ దాగుడుమూతలో, "కొక్కో", ఏదో ఎలా ఆడుకుంటున్నాయో !- నారాయణా, శస్త్రం ధరించు; ఆలసించకు! [జేబులోనించి కత్తెర తీసి పట్టుకుని] హృదయమా. ఒక్క క్షణందడదడ లాడకు; మంచిదానవు! [ఆ వ్యక్తి మీసాలను రెండు సార్లు కత్తిరిస్తాడు. గుడ్లగూబ కూస్తుంది. ఉలికిపడి] హరి, దీన్ని తగలెయ్య! వెధవ గుడ్లగూబ ఇప్పుడే కుయ్యాలీ? [మళ్లీ వొకసారి కత్తిరించి] ఇంక చాలు! [నిద్రపోతున్న వ్యక్తి ఒకసారి గొంతుక సవరించుకుని మళ్లీ గుర్రు పడతాడు. నారాయణ ఎండు టాకుల మీద చప్పుడు చేయకుండా నడవడానికి ప్రయత్నిస్తూ నిష్క్రమిస్తాడు]

(తెర పడుతుంది.)

## ఐదవ రంగం

మర్నాడు ఉదయం, ఏడు గంటలకి: మేడమీద వరండాలో_ ఎదురుగా వున్న పిట్టగోడ పైనించి తోటలోని చెట్ల పైభాగాలు కనపడుతూ వుంటాయి. వరండాలో మధ్య ఒక బల్ల, దాని చుట్టూ నాలుగు కుర్చీలు వుంటాయి. ఒక వైపున క్రిందనించి పైకి రావడానికి మెట్లు; మరొకవైపున మేడ గదులలోకి వెళ్ళడానికి గుమ్మం. సీతయ్య ఒక కుర్చీ మీద కూర్చుని వుంటాడు. నారాయణ ప్రవేశిస్తాడు.

సీతయ్య : ఏంరా, నారాయణా, రాత్రి పని సక్రమంగా చేసినట్టేనా?

నారా : ఓ. నిర్ణీత కార్యక్రమం ప్రకారం, నిరంతరాయంగా, తు. చ. తప్పకుండా నెరవేర్చాననుకో- చూస్తావుగా, రామభద్రయ్య మామగారి ముఖార వింద‌ం, ఆ తరువాత జరుగబోయే ఫార్సూను ? తినబోతూ రుచెందుకు ?

సీతయ్య : అయితే, అక్కడికి మనం చెయ్యవలసింది తృప్తికరంగా కొనసాగించా మన్నమాట. బాగుంది—ఇలా కూర్చో. కమల లోపల కాఫీ తయారు చేయిస్తోంది, తెస్తుంది.

నారా : [కుర్చీలో కూర్చుంటూ] వెంకట కృష్ణయ్య బాబుగా రేరీ ?

సీతయ్య : అన్నట్టు, వచ్చేటప్పుడు కాఫీకి పిల్చుకొద్దామని ఆయన గది లోకి చూశాను, లోపల లేడు. అలా తోటలోకిగాని వెళ్ళలేదు కద. కొంపతీసి ? [క్రిందనించి మెట్లెక్కి వస్తున్న రామ భద్రయ్యను చూసి విస్మయంతో] అదేమిటి ! ?

నారా : ఏది, ఏమిటి ?

సీతయ్య : అడుగో, రామభద్రయ్యమామయ్య, కేవలం నిండు మీసాల బూచిలాగ ఇలాగే వొస్తున్నాడు. అదేమిట్రా ఆయన మీసా లలో ఒక వెంట్రుకైనా చెక్కు చెదరలేదు !

నారా : నిజమే ! కొంప మునిగిందిరా, సీతయ్యా, ఎలా గిప్పుడు ?

సీతయ్య : నువ్వు చేసిన ఘోరపొరపాటు గుర్తించావా ?

నారా : నే నేమీ పొరపాటు చెయ్యలేదురా, నీ తోడు ! పోనీ కలగన్నా నేమో అనుకుంటే, రాత్రి అంత సేపు పట్టుదలతో ఆ మీసాలు కత్తిరించినందుకు నా చేతి వేళ్ళు ఎలా బొబ్బలెక్కి మండు తున్నాయో ఇంకా చూడు : ఒక పెద్ద పండిన వరిచేను కోసి నంత పని జరిగింది !

సీతయ్య : నువ్వు మీసాలు చాకచక్యంతో కత్తిరించిన మాట వాస్తవమే. అయితే అవి రామభద్రయ్యగారివి కావు. వెంకటకృష్ణయ్య గారివి! అర్థమౌతోందా?

నారా : ఏమిటి, వియ్యంకుళ్ళిద్దరూ కలిసి ఆ ఉయ్యాలమీద నిద్ర చేశారంటా వేమిటి?

సీతయ్య : అదే నాకూ బోధపడటంలేదు. ఐనా నువ్వేమీ మాట్లాడకు. ధైర్యంగా అంతా చూస్తూ వుండు. భయం లేదు. [ఇంతలో రామభద్రయ్య పైకి వస్తాడు. ఆయనని చూసి] ఇదుగో మామయ్య!

రామ : [ప్రవేశించి] ఏరా, సీతయ్యా కమల ఇంకా కాఫీ తయారు చేయించలేదూ?

సీతయ్య : చేయిస్తోంది. ఏమిటి, మామయ్యా ఇవాళ ఇంత పొద్దున్నే లేచావు? నీకు మామూలుగా కొంచెం ఆలస్యంగా లేవడం అలవాటు కాదూ?

రామ : ఏమిటోరా, రాత్రి, వెధవది అలవాటు లేనిది ఆ గదిలో పడుకుంటే ఉక్కచేత సరిగ్గా నిద్ర పట్టింది కాదు.

సీతయ్య : గదిలో ఎందుకు పడుకున్నావు మరి? తోటలో ఉయ్యాల మీద పడుకుంటావని చెప్పింది కమల?

రామ : రోజూ ఆ ఉయ్యాల మీద పడుకోవటమే అసలు అలవాటు. కాని, నిన్న వెంకటకృష్ణయ్యబావగారు వచ్చాడు కాదూ? అందుకు గౌరవంగా వుంటుందనీ, హాయిగా నిద్రపోతాడనీ నిన్న రాత్రికి ఆయన్ని ఆ వుయ్యాల మీద పడుకోమన్నాను—

నారా : అదీ!—

రామ : "అదీ" ఏమిటి ?

సీతయ్య : అబ్బే, నీ బంధు మర్యాదకి మెచ్చుకుంటున్నాడు మన నారాయణ.

రామ : అదా ? గృహస్థు కంతకంటె కావలసిందే ముంది చెప్పు ? ఆయనకి మాత్రం నా మీసాలని చూస్తే ఎందుకో అకారణ ద్వేషమూ, అసూయాను. ఏడీ బావగారు ? రాత్రి ఆ ఉయ్యాల మీద చల్లగాలికి హాయిగా నిద్రపట్టిపోయి ఇంకా మెలుకువ రాలే దనుకుంటాను. నాకు తెలుసు ఆ సుఖం—

సీతయ్య : [మెట్లమీద నించి పైకి వస్తున్న వెంకటకృష్ణయ్యని చూసి ఆశ్చర్యంగా] అదెవరు ?

రామ : [అటువైపు పరకాయించి చూసి] ఎవరు చెప్మా నా కోసం ఇంత పొద్దున్నే మించిపోయినట్టు వస్తున్నాడు ? నన్ను కాఫీ అయినా సరిగ్గా త్రాగనివ్వరు; వెధవసంత ! [వెంకటకృష్ణయ్యని చూసి విస్మయంతో] ఆఁ, ఆఁ !

సీతయ్య : అదేమిటి వెంకటకృష్ణయ్యబాబుగారే !

రామ : అరే, ఏమిటి, నా కళ్ళని నేనే నమ్మలేకుండా వున్నాను !

వెం-కృ : [కోపంతో విసురుగా ప్రవేశించి] అయితే ఇదన్నమాట మీ కుతంత్రం ?

రామ : ఏమిటి ! బావగారూ, మీరేనా ? చూసి ఆనవాలుపట్టలేక పోయాను. మీసం తీసేశారే ! ఇప్పుడు బాగుంది; మంచి పని చేశారు ! అబ్బే నే చెప్పలేదూ ? అదీ వొక మీసమే ? మీసం తీసేస్తేనే చాలా బాగుంది మీ మొహం !

వెం-కృ : [మండిపడుతూ] చూడు రామభద్రయ్యా- నీతో అయిదు విష యాలు చెప్పదల్చుకున్నాను—మొదటిది : నీ యింటికి వచ్చిన అమాయికుడైన అతిథిని అవమానించడానికి వెనుదియ్యని నీచుడవు నువ్వు! రెండోది : నా మీసాల ముందు నీ మీసాలు ఎందుకూ పనికిరావనే ఏడుపుతో వోర్చలేని దరిద్రుడవు నువ్వు! మూడోది : అందుకని నా మీసాలు దొంగతనంగా కత్తిరిం చెయ్యడానికి వీలుగా వుండేటట్టు మర్యాద అని వంక పెట్టి నన్ను రాత్రి తోటలో ఉయ్యాలమీద పడుకోమని బలవంతం చేసి మొహమాట పెట్టిన కుత్సితుడవు నువ్వు! నాలుగోది—

రామ : ఉండండి, కొంచెం కాఫీ పుచ్చుకుందురు గాని—

వెం-కృ : నాకు నీ కాఫీ అక్కర్లేదు. ఈ కాఫీలతో అంత సులువుగా తేలిపోయే విషయం కా దిది— నాలుగోది : నే నిప్పుడు తిన్నగా ఒక పెద్ద లాయరు దగ్గరకు వెళ్ళి నీ మీద "డామేజీ" దావా వేయిస్తున్నాను! అయిదోది—

రామ : కాని, బావగారూ, ఇదంతా నే నేదో చేయించినట్టు అపోహ పడుతున్నట్టున్నారు. జరిగిన దానికి నేను విచారించటం లేదను కోండి. అంతవరకు అద్భుతంగా వుంది. మీ దిక్కుమాలిన మీసాలు పోయినందుకు సధ్యా దేశంలో కరవు కాటకాలు తగ్గి పోవచ్చునని నా విశ్వాసం—

వెం-కృ : నీ బొల్లి మీసాలూ నువ్వూ సాక్షాత్తు ఎలుగుబంటి అన్నగారి లాగ వున్నా వన్న సంగతి జగద్విదితమే!

రామ : ఇప్పుడు మీ ఉక్రోషంలో, ఉద్రేకంలో ఏమైనా అంటారు, క్షమిస్తాను. ఎంత అసహ్య మైనవైనా ప్రాణప్రదంగా పెంచు

కునే మీసాలు పోతే ఎంత బాధగా వుంటుందో నేను ఊహించు కోగలను. అయినా మీ మీసాలు పోవడానికి కారణం నే నెంత మాత్రం కాదు. రాత్రంతా ఆ తూగుటుయ్యాల మీ కిచ్చి, నేను నా గదిలో నిద్రలేక ఇదయాను—

వెం-కృ : ఇంక నే చెప్పదల్చుకున్న అయిదో విషయం—

రామ : కావలిస్తే వీళ్ళిద్దర్నీ అడగండి—

వెం-కృ : నీ పాపిష్టి యింట్లో యింకొక్క క్షణమైనా వుండటంలేదు నేను. మీ పిల్లని మా అబ్బాయికి ముమ్మాటికీ చేసుకోనని ఇందు మూలంగా స్పష్టంగా చాటుతున్నాను. అంతకంటే వేరే అప్రతిష్ఠ ఇంకొకటి లేదు. ఇంక నా కంఠంలో ప్రాణం వుండగా మీ గడప ఎన్నడూ తొక్కను. దీనితో మీకూ మాకూ తెగ తెంపులు—

రామ : నీకూ నీ మీసాలకీలాగ!

వెం-కృ : థాల్! రామభద్రయ్య. నేను చెప్పిన అయిదు విషయాలూ జ్ఞాపకం వుంటాయి కాదూ?

రామ : ఉంటాయిలే, వెంకటకృష్ణయ్య—ఓపిక పట్టి ఊరుకొంటున్న కొద్దీ ఏమిటి నీ ఆగడం? ముందు నువ్వు తక్షణం నా యిల్లు వదిలి పోతావా లేదా? నీ ముదనష్టపు కొడుక్కివ్వకపోతే మా అమ్మాయి కింక పెళ్ళి కాదు— ఇంకా అలా—

[రుసరుసలాడుతూ వెంకటకృష్ణయ్య నిష్క్రమిస్తాడు]

నారా : శాంతించండి. మామగారూ; ఆయన వెళ్ళిపోయారు!

సీతయ్య : ఈ వెంకటకృష్ణయ్యగారికి మీసాలతోపాటు మతికూడా పోయింది!

రామ : పోయాడా, చచ్చుగాడిద! శని విరగడయింది!—వీడి మీసాలు దేశాభ్యుదయం కాక్షించే మహానుభావులెవరో కత్తిరించి పారేసి వుంటారని నా దృఢవిశ్వాసం. లేకపోతే, తగుదునమ్మా అని ఏవో మూతిమీద గరికపోచలలాంటివి రెండు వెంట్రుకలు పెంచి వాట్లని గొప్పగా కోరమీసమనీ, కుచ్చుమీసమనీ, బుగ్గ మీసమనీ, ధనుర్మీసమనీ తనే స్వయంగా పొగడుకుంటూ ఊళ్ళ వెంబడి సిగ్గులేకుండా ఊరేగుతూవుంటే, ఎంత జాతీయ భావాలులేని మానవుడికైనా వొళ్ళు మండుకురాదూ? మొత్తం మీద వీడి రోగం కుదిర్చారు ఎవరో పుణ్యాత్ములు; పీడ వదిలిపోయింది!— మన కమలపెళ్ళి తప్పిపోయింది—

సీతయ్య : దానికోసం విచారించనక్కర్లేదు, మామయ్యా—

రామ : విచారమా? ఇంకా నయమే! కమలకి పెళ్ళికొడుకులకి లోటు ఏమిట్రా, వెర్రాడా? "కో" అంటే కోటిమంది వస్తారు.

సీతయ్య : నారాయణా!

నారా : "కో" అన్నారు కాదూ? నాదొక మనవి వుందండీ, మామగారూ—

రామ : ఏమిటి, బాబు, అది?

నారా : సంపెంగనూనో, ఏదో రాసి చక్కగా మెలితిప్పిన మీ మీసాలను చూస్తున్నకొద్దీ నాకు తనివి తీరటంలేదు; అవి నన్నెంతగా ఆకర్షిస్తున్నాయి. ఇంత సొగసైన మీసాలు మనదేశం మొత్తం మీద ఎవరికీ లేవని నేను ఘంటాపథంగా చెప్పగలను— మీ ప్రత్యర్థి ఎలాగా నిర్జితుడై, పరాభవంపొంది పారిపోయాడు

గనక, మీకు "ఆంధ్ర మీసరి " అనే బిరుదు ప్రసాదించాలని నాకు ముచ్చట వేస్తోంది ; నా ముద్దు చెల్లించరూ ?

సీతయ్య : [నవ్వుతూ] భేష్, భేష్! సెహబ్బాస్!

రామ : నిజమేనయ్యా, నారాయణా—నా మీసాల పస, విలువ నువ్వు చక్కగా గ్రహించావు ; నీకేదైనా బహుమానం చెయ్యాలని నాకు ఊరికే బుద్ధిపుడుతోంది ; నీ యిష్టం వచ్చింది కోరుకో, చిన్నవాడా!

సీతయ్య : ఆలోచిస్తావేం ? అడగరా. నారాయణా!

నారా : మీ కమలని వివాహం చేసుకోడానికి నాకు అనుమతి యిప్పించండి ; నా కంతకంటే ఏమీ అక్కర్లేదు—

రామ : ఏమన్నావు ?

నారా : నేను కమలని వివాహం చేసుకుంటాను!

రామ : అందుకు నీ యోగ్యత ?

నారా : నే నొక బీద కవికుమారుణ్ణి!

రామ : బీదా ? ఎంత బీద ?

నారా : నేను మీ మీసాలని అభినందిస్తూ, "మీసపంచకం" అని స్తోత్ర రత్నమాణిక్యాలు రచించానండి ; సెలవైతే చదివి వినిపిస్తాను.

రామ : నిజమే!

సీతయ్య : నిజమే, మామయ్యా ; పద్యా లేమిటి, బహు పసందుగా వున్నాయిలే!

రామ : అలాగా ? ఏది, చదువు, నాయనా, వింటాను.

నారా : ఇదిగోనండి [జేబులోనుంచి కాగితం తీసి శ్రావ్యంగా చదువుతాడు]—

" మీసపంచకం :

1. మీసము పస మగమూతికి,
కూసము పస కుర్రత్రాచు కోడెల కెల్లన్,
ప్రాసము పస కందములకు,
వాసము పస యింటికెప్డు వసతికి వసుధన్!

2. మీసము, వనితా మానస
పాశము, పరిపంథి హృదయ బాణోత్కటసం-
కాశము, మామక కవితా
వేశము, మన్మథ ధనుర్నివేశము తలపన్ !

3. ఇమ్ముగ విరిసిన అరవిం-
దమ్మును గ్రమ్మెను మధువ్రతమ్ములు కావా ?
తుమ్మెదలా ? మీసమ్ములు,
తమ్మి విరియె రామభద్రధవు వదనమురా!

4. ఇయ్యగ నిప్పింపంగల
అయ్యలకే కాని మీస మందరికేలా ?
నెయ్యమునకు సీతయ్యకు,
వియ్యమునకు రామభద్రవిభునకె చెల్లున్!

5. ఆస్యాడంబర వేషము,
లాస్యజంబీర ఫలవిలాసము, బహుధా
సస్యక్లేశము, వీరో-
పాస్య మితని మీసకేశపాశము ; జే! జే !!-"

రామ : భేష్ ! చాలా బాగున్నాయయ్యా !- అయితేను, చూడు, అబ్బాయి—

నారా : నారాయణ అండి—

రామ : నారాయణా !

నారా : అయ్య ?

రామ : నువ్వు పేదవాడనని మొహమాటానికి అని వుంటావని నాకు తెలుసు—

నారా : చిత్తం -

రామ : ఒకవేళ నిజంగా అయినా నా కేమీ లక్ష్యంలేదు ; నువ్వంటే నాకు అభిమానం అలా కుదిరింది.

నారా : ధన్యుడ నండి—

రామ : నువ్వు మా కమలని పెళ్ళిచేసుకోడానికి నా అభ్యంతరం ఏమీ లేదు—మీకు నా దీవనలూ, ఆశీస్సులూ, అవీని—కమల అభిప్రాయంకూడా—

నారా : నేను కనుక్కున్నానండి—

రామ : ఏమిటి ?

సీతయ్య : నువ్వుకూడా కనుక్కుందువుగానిలే, మామయ్యా—

రామ : అలాగా, అయితేను—కమల ఇంకా కాఫీ పట్టుకొచ్చింది కాదేం చెప్మా?— అందాకా ఒక చుట్టముట్టిస్తాను మరి [నారాయణతో] నీ దగ్గర అగ్గిపెట్టి వుందిటయ్యా ?

సీతయ్య : నిన్నేరా, నారాయణ—

నారా : ఉందండి [జేబులోనించి తీసి] ఇదిగో పెట్రోలు సిగార్ లైటర్ !

రామ : ఏదీ ? [నారాయణ చేతిలోనించి తీసుకుని పరిశీలించి] చాలా చక్కగా వుందయ్యా !

నారా : దీనిని మీకు బహుమతీ చేస్తానులెండి- ఉండండి. అలాగకాదు ; నేను వెలిగించి యిస్తాను- [రామభద్రయ్య దగ్గరనించి సిగార్ లైటర్ తీసుకుని వెలిగించి ఆయన నోటిలో వున్న చుట్టకి ముట్టిస్తాడు]

రామ : [చుట్ట రెండు పీల్పులు పీల్చి] భేష్ ! ఉండు, చుట్టకొసకి అంటించు—

సీతయ్య : అదుగో, కమల కాఫీ తీసుకొస్తోంది !

నారా : ఆహా ! నా కమలా ! [ఆమెను చూస్తూ ఆనందపరవశుడై సిగార్ లైటర్ను రామభద్రయ్య నోటిలోని చుట్టకి బదులు ఆయన మీసాలకి ముట్టిస్తాడు]

రామ : [కంగారుగా లేచి గంతులు వేస్తూ] ఆఁ, ఆఁ.... ఆఁ, ఆఁ ! [మీసాలు చురచుర అంటుకు మండుతాయి]

కమల : [ప్రవేశించి] ఆఁ, ఆఁ; అయ్యో, అయ్యో ! మీసాలు, మీసాలు ! [తను తెస్తున్న కప్పులూ, సాసర్లు వున్న పళ్ళెం ఎత్తివేస్తుంది ; అవి క్రిందపడి పగిలిపోతాయి]

సీతయ్య : ఒరే, ఒరే, నారాయణ, కమలకేసి చూస్తూ ఎంతపని చేసేశావో, చూడు!

నారా : ఆఁ, ఏమిటి? [గోడ దగ్గరకి పారిపోతాడు]

రామ : [ఆగ్రహావేశంతో] పట్టుకో! పట్టుకో! ఆ నారాయణని పట్టుకో, చూస్తావేంరా, సీతయ్యా?

సీతయ్య : ఏడి?-చూస్తావేంరా, నారాయణ? బల్లక్రింద దూరు; మామయ్య హత్య చేస్తాడు; తప్పదు. [నారాయణ పరుగున వచ్చి బల్ల క్రింద దూరతాడు]

రామ : [ఉగ్రుడై గంతులు వేస్తూ] పట్టుకో; వాడి తోళ్ళు వొలిచెయ్యి! బుర్ర చితకపొడు! వొస్తున్నా—

సీతయ్య : మరీ అంత పరధ్యాన్నం ఏమిట్రా, నారాయణ? నీ దిక్కుమాలిన సిగార్ లైటర్‌మంట అతని పెదవులకి బొత్తిగా అంత దగ్గరగా పెడతారా? ఒక్క తృటిలో చూస్తోండగా మామయ్య మీసాలు, పాపం, ఏలా చురచుర అంటుకు పోయాయో!— ఏడీ మామయ్య? [రామభద్రయ్య నారాయణమీద విసరడానికి కిటికీలో వున్న యాష్‌ట్రే (**Ash-tray**) తీస్తాడు]

కమల : ఆఁ, ఆఁ, పెద్దనాన్నగారు! పెద్దనాన్నగారు! [కుక్క మొరుగుతూ అక్కడికి వస్తుంది]

నారా : కప్ప, కప్ప! బోదురుకప్ప! [బల్ల క్రిందనించి మళ్ళీ గోడ దగ్గరకు పరిగెడతాడు]

సీతయ్య : ఆఁ, విసరకు మామయ్య, చుట్ట బూడిద దులుపుకునే గాజు గిన్నె విసరకు! బ్రహ్మహత్యాపాతకం! [రామభద్రయ్య విసిరిన యాష్ ట్రే గోడకు తగిలి ముక్కముక్కలైపోతుంది.]

కమల : అమ్మయ్య! [నిట్టూర్చి] పాపం, నారాయణగారికి తగలలేదు, బ్రతికాం.

రామ : ఏడీ విశ్వాసఘాతకుడు! స్వామిద్రోహి ఏడీ? [బల్లమీద వున్న కాఫీ పాట్ తీస్తాడు]

సీతయ్య : ఉరికెయ్యరా, నారాయణా, ఆ గోడమీదనించి బయటికి వురికెయ్యి. సందేహించకు! [కమలతో] భయపడకు, కమలా, ఫరవాలేదు.

కమల : [కంగారుగా] పెద్దనాన్నగారు! ఉండండి ఉండండి— ఆ కాఫీ పాట్ విసరకండి, బ్రద్దలై పోతుంది. [రామభద్రయ్య కాఫీ పాట్ నారాయణ వైపు గురిపెట్టి విసురుతాడు] ఆఁ, ఆఁ! [కుక్క మొరుగుతుంది. కాఫీ పాట్ గోడకి తగిలి ముక్కలై పోతుంది.]

నారా : [డాబా పిట్టగోడ ఎక్కి నిలబడి] ఇంక శాంతించండి, రామభద్రయ్య మామయ్యగారూ!

రామ : వాణ్ణి పట్టుకోవేంరా, సీతయ్య- చూస్తావేం?

నారా : లాభంలేదు—మీ రొక్క అడుగుముందుకు వేశారో నే నీ పిట్ట గోడమీద నుంచి క్రిందికి వురికేస్తాను; ఇంత ఎత్తునించి క్రింద పడ్డాక రాళ్ళమీదపడి నా భౌతికదేహం యాష్ ట్రే లాగ—

సీతయ్య : కాఫీ పాట్ లాగా—

నారా : ఆఁ, కాఫీ పాట్ లాగ తుత్తునియలై పోయి, నా ఆత్మ పంచ భూతాలలో కలసిపోతుంది. పోలీసులు వచ్చి నన్ను హత్య చేశారని తెలుసుకుని మిమ్మల్ని ఉరిస్తంభం ఎక్కిస్తారు; కావలిస్తే కమలగారు, సీతయ్య సాక్ష్యం ఇస్తారు.

రామ : [కొంచెం తాజుపడి] నిజమేనట్రా, సీతయ్యా ?

సీతయ్య : వాడి దసలే మొండి సాహసం, మామయ్యా—తల్చుకుంటే ప్రేమ కోసం ఎంత వోహోయిత్యం చెయ్యడానికైనా వాడు వెనుదియ్యడు !

నారా : ఇంక నా మరణవాఙ్మూలం వినండి: మీ మీసరాజిని నేను బుద్ధిపూర్వకంగా ధ్వసం చెయ్యలేదు. కాఫీ తెస్తున్న కమలగారికేసి చూస్తూ తన్మయత్వం చెంది ఆ సిగరెట్ లైటర్ మంట మీ చుట్టకి బదులు మీసాల చిగుళ్ళకి అంటించి వుంటాను. అది కేవలం ప్రమాదం—

రామ : ప్రమాదమా ? ప్రమాదమా ? అయితే మాత్రం ఇంత ప్రాణ ప్రదంగా పెంచుకుంటున్న నా మీసాలు అంటుకుంటా యేమో అనే బుద్ధి వుండక్కర్లేదూ ? అంత బొత్తిగా కళ్ళు మూసుకు పోనా ?

నారా : తప్పుడు మాటలనకండి-కళ్ళు మూసుకుపోవడం కాదది. ప్రేమ తన్మయత్వమూ, అదీని- నేను కమలని ప్రేమించినంతగా మీ రెవరినైనా ప్రేమించి వుంటే ఆ అనుభవం మీకు తెలుస్తుంది !

రామ : అదొకటి కూడానా ?

కమల : అవునండీ, పెద్దనాన్నగారు !

సీతయ్య : నిజమే, మామయ్య. ఇప్పుడైనా మన కమలని నారాయణకిస్తే బాగుంటుంది.

రామ : ఇంతవరకూ వచ్చాక ఇవ్వనూ మరి ? సిగ్గు లేకపోతే సరి !

సీతయ్య : ప్రేమా, దురదా సిగ్గు నెరగవంటాడు మా నారాయణ. ఏంరా, నారాయణ ?

నారా : మీసాలు లేకుండా వుంటే మీ మొహం ఎలా వుంటుందో చూడాలని అసలు నాకు కుతూహలం పీక్కుతింటోంది. అది ఇన్నాళ్ళకి తీరింది.

సీతయ్య : అయితే నువ్వు అనుకున్నట్టు వుందిట్రా, ఆయన మొహం, నారాయణా ?

కమల : పెద్దనాన్నగారి మొహం ఇప్పుడు చాలా బాగుంది కాదండీ ?

నారా : ఎలా వుందో చెప్ప మంటారా ?

కమల : చెప్పండి, సంశయించకండి—

నారా : నూతిలో నాని ఉబ్బిన పెద్ద బోదురు కప్పలాగ వుంది !

రామ : [కోపంతో] ఛ, నోరుముయ్యి !

కమల :
సీతయ్య : } [పకపక నవ్వుతారు]

రామ : ఎందు కలా వెకిలిగా నవ్వుతారు ? [సమాధానపూర్వకంగా] నారాయణా, నిన్ను నేను క్షమిస్తే ఆ గోడమీద నించి పురకడం మానేసి లోపలికి వస్తావా ?

నారా : నా మీద ప్రేమచేతకాదు. పోలీసులూ, ఉరిస్తంభం అంటే భయం చేత రమ్మంటున్నారు. నాకు తెలుసును. ఆఖరిసారి అడుగుతున్నాను, నాకు కమలనిచ్చి పెళ్ళి చేస్తారా ?

రామ : ఓరి నీ బెదిరింపు మండిపోనూ ! నీ బెదిరింపులకి లొంగిపోయే ఘటం కా దిది, ఏమనుకుంటున్నావో ! నువ్వు క్రిందపడి ప్రాణాలు తీసుకున్నా నాకేమీ భయం లేదు. కమలని నీ కిచ్చి పెళ్ళి చెయ్యాలా ఇంకాను ? అక్కడే వుండు, వొస్తున్నా : నా

స్వహస్తాలతో నీ ప్రేగులు బయటికి తీసి మెడలో హారాలుగా వేసుకోకపోతే నాపేరు రామభద్రయ్య కాదు! [ధూకుడుగా ఒక అడుగు ముందుకు వేస్తాడు]

నారా : మీ కంత శ్రమ అక్కర్లేదు-సరేమరి- ఆటాపీటాచెల్లంగోర్! నీకూ నాకూ మాటల్లేవ్! కావ్, కావ్!!—కమలా, సెలవు!—జై, పరమేశ్వరా! [పిట్టగోడమీదనించి క్రిందకి వురుకుతాడు]

కమల : [భయోద్రేకంతో] అయ్యో, అయ్యో! నారాయణగారూ!—సీతయ్య బావా!

రామ : [కంగారుతో] నిజంగా వురికేశా డేమిట్రా, సీతయ్యా? చూడు—వీడి వోహాయిత్యం ఇదైపోను!

సీతయ్య : [పిట్టగోడ దగ్గరకు వెళ్ళి క్రిందికి తొంగిచూసి] విచారించకు, కమల!— లేదు, మామయ్యా, రేపు పండగకి ఇంటికి వెల్లలు వేస్తున్నారుకాదు? నిచ్చెన ఒకటి వేసిపెట్టారు ఈ గోడకి- దాని మీదనించి, అదుగో, సురక్షితంగా దిగి నిశ్చింతగా తోటబాట వెంట నడిచి వెడుతున్నాడు మనవాడు!

రామ : [మళ్ళీ కోపంతో వాణికిపోతూ] ఏమిటి, పట్టుకో; వాణ్ణి చంపండి, పొడవండి!

సీతయ్య : ఇంక లాభంలేదు, మామయ్యా—

కమల : [నిట్టూర్చి] అమ్మయ్య! పోనీ, సురక్షితంగా వున్నారుకద? భయంతో నా ప్రాణాలు చలించిపోయాయి!

సీతయ్య : కోటు అయినా నలగలేదు, కుర్రాడికి!

రామ : సీతయ్య!

సీతయ్య : ఏం, మామయ్యా ?

రామ : నువ్వు తక్షణం వెళ్ళి వాణ్ణి సజీవంగాగాని, శవంగాగాని పట్టుకు తీసుకువచ్చి నాకు వప్ప చెపుతానని వాగ్దానం చెయ్యి ; లేక పోతే నాకు ఆత్మశాంతి వుండదు !

సీతయ్య : ఇప్పుడే వెడుతున్నాను, మామయ్యా ; నువ్వు నిశ్చింతగావుండు- కమలా ! దిగులుపడకు— వస్తాను ! [మెట్లుదిగి నిష్క్రమిస్తాడు]

[కమల పిట్టగోడ దగ్గరకి వెళ్ళి క్రిందికి చూస్తూ నుంచుంటుంది.]

రామ : [శూన్యంగా చూస్తూ] ఆంధ్ర మీసరిట, ఆంధ్రమీసరి ! హుం, ఎంత అప్రతిష్ఠ ! !

(తెర పడుతుంది)



పాత్రలు:

నారాయణ

సీతయ్య

నారాయణ తండ్రి

నౌకరు సన్యాసి

డాక్టరు నిర్మల

---

# పుష్పబాణవిలాసం

——:o:——

## ఒకటవ రంగం

నారాయణ గదిలో ఒక వైపున మంచం, పరుపు వుంటాయి. మరొక వైపున ఒక పెట్టె మీద గుట్టగా పువ్వులు అమర్చబడి వుంటాయి. వాటికి ఒక ప్రక్క ఒక చిన్న దీపపు స్తంభంలో దీపం, మరొక ప్రక్క అగరొత్తులు వెలుగుతూ వుంటాయి. సాయంకాలం: నారాయణ పెట్టెకి ఎదురుగా కూర్చుని పూజచేస్తూ వుంటాడు.

నారాయణ : ప్రేయసీ! ఈశ్వర సాక్షాత్కారం కోసం భక్తుడు లింగాన్ని పూజించినట్టు, నేను ప్రేమ సాక్షాత్కారంకోసం శ్రద్ధగా నీ ప్రియ వస్తువులని సేకరించి, పూజిస్తున్నాను. నీ అపార కృపా కటాక్ష వీక్షణం నాపై ఎన్నటికి ప్రసరిస్తుందో?— హృదయం సమర్పయామి, ఆత్మ సమర్పయామి, నా సర్వస్వం సమర్పయామి. [గంట వాయిస్తాడు]

సీతయ్య : [వీధి తలుపు కొట్టి] నారాయణా! నారాయణా..........! [పిలుస్తాడు]

నారా : [పూజ ఆపి బిగ్గరగా] ఆఁ, వొస్తున్నానురా, సీతయ్యా. ఆ అతిధి శాల అలంకరించు. [నెమ్మదిగా] సమయానికి వచ్చాడు; ఏదో మునిగిపోయినట్టు, నా ఆరాధనకి అంతరాయం కలిగించడానికి. ఛీ, వీ డెప్పుడూ ఇంతే—పానకంలో పుడకలాగ-[పెట్టెవైపు

జాలిగా చూస్తూ] వస్తాను, ప్రేయసీ! ఆ సీతయ్యగా డొచ్చాడు-
[తలుపు తీసి సీతయ్యని గదిలోకి తీసుకు వస్తాడు]

సీతయ్య : [గదిలో నాలుగు మూలలు పరకాయించి చూసి] అదేమిట్రా, ఆ పెట్టి మీద పువ్వుల గుట్టలాగ కనిపిస్తోంది. అబ్బా, రక రకాల పువ్వులు! ఎక్కడివిరా?

నారా : నాకు వాసన చూడనట్టి ప్రసవాలూ, అవీ అంటే ఎంతో ఇష్టం అని నీకు తెలియదుట్రా మరి? [సీతయ్య పువ్వులు కొన్ని తియ్యబోతాడు] ఉండు, వుండు, వాట్ల జోలికి వెళ్ళకు, అలా వుండనీ—ముట్టుకోక.

సీతయ్య : అదేమిటి! ఏమిట్రా, కరుస్తాయన్నట్టు భయపెడుతున్నావు? ఇదేమిటి? ఈ కంచు దీపస్తంభం ఎప్పుడు కొన్నావు? ఇందులో దీపం వెలుగుతోందే. ఇదుగో అగరొత్తులు, హారతీ— ఏమిరోయ్, ఏదైనా పూజ మొదలెట్టా వేమిటి?

నారా : అంటే అదేరా, కొంచెం పూజా అదీ చేసుకుంటూ, భక్తిగా వుంటోంటే మంచిదని తోచింది; అంతా ఈమధ్యనే. నీతో చెపితే వేళాకోళం చేస్తావని....

సీతయ్య : ఇంకా నయమే.

నారా : నాలో యీ పరివర్తనం రావడం నీ కాశ్చర్యంగా వుందికాదూ?

సీతయ్య : అదే చూస్తున్నాను.

నారా : పెద్ద పెద్ద ప్రవక్తల కందరికీ యిలాగే వాళ్ళ జీవితంలో ఒక శుభముహూర్తంలో, హఠాత్తుగా, అనుకోకుండా, ఇలాంటి అద్భుతమైన మార్పు కలిగిందని మనం చదువుకున్నాం కాదూ?

సీతయ్య : ఓహో, అయితే, ఆ పుష్పరాశి క్రింద వేంచేసిన ఆ ఆరాధ్య దేవత ఎవ రేమిటి ?

నారా : అదంతా వుందిలే, ఇంక అడగకు. నీకూ ఎప్పుడో పర్వదినం చూసి చెబుతానుగా ! అప్పుడు నువ్వు నాకు శిష్యుడ వౌదువుగాని.

సీతయ్య : అలాగేలే. ఇవాళ పర్వమే. అమావాస్య వెళ్ళిన కొత్త మంగళ వారం. [పెట్టె దగ్గరకు వెళ్ళి పరిశీలిస్తాడు]

నారా : ఉండు. అలా ఆ పూజా పీఠందగ్గరకి వెళ్ళకు. ఏమిట్రా, ఆ మోటతనం చెపుతోంటేను, సీతయ్యా ?

సీతయ్య : [పువ్వులన్నీ ఇటూ, అటూ తొలగించి] ఏమిట్రా, నారాయణా. ఇదేదో దేవ తన్నావు, ఆరాధ నన్నావు, నైవేద్య మన్నావు ? ఇక్కడేమీ విగ్రహం లేదు !

నారా : విగ్రహారాధనని విజ్ఞులు ఒప్పుకోరు కాదుట్రా ?

సీతయ్య : విగ్రహానికి బదులుగా ఈ కొత్త గుడ్డ ఏమిటి, యీ పువ్వుల కింద ? ఉండు, ఇదేమిటి—ఇది ఎవరిదో జాకెట్టులా గుందే ? [జాకెట్టు మడతలలో వున్న గాజు తీసి] ఇందులో ఈ గాజు ఎవరిది ? ఏమిరా మాట్లాడవు ?

నారా : సీతయ్యా, నువ్వు అసాధ్యుడవురా ? నీతో చెప్పకుండా నేను ఏ శుభకార్యం తలపెట్టినా అది కొనసాగనియ్యవు, ఖర్మం.

సీతయ్య : శుభకార్యం సరేలే—అసలేమిటో చెప్పవేం ?

నారా : ఎవరితోనూ చెప్పవుకద ?

సీతయ్య : చెప్పనులే—చెప్పు.

నారా : ఈ గాజు నేను సంపాదించానులే.

సీతయ్య : ఎవరి దగ్గరనించి ?

నారా : గాజులసెట్టి దగ్గరనించి—

సీతయ్య : మరి యీ జాకెట్టు ? నీ ఆది ఇచ్చుకుని కుట్టించుకున్నావా ?

నారా : నా కెందుకురా జాకెట్టు, వెర్రాడా ?

సీతయ్య : పూజ చెయ్యడానికి—

నారా : ఒరే, నీదగ్గర దాచడ మెందుకు ? సుశీల నెరుగుదువుకాదూ?

సీతయ్య : సుశీలా ? నువ్వు ప్రేమిస్తున్నానని చెప్పిన వాళ్ళల్లో యీవిడ నూటవొకటో ఆవిడ అనుకుంటాను ?

నారా : ఒరేయ్, సీతయ్యా, ఇతర విషయాల్లో నువ్వెంత తెలివైన వాడవైనా, ప్రేమ విషయంలో నువ్వు వట్టి మూర్ఖుడవురా—ఆ లాలిత్యము, ఆ సౌకుమార్యము, ఆ మార్దవమూ—

సీతయ్య : దానికేంలే—

నారా : నే నసలు ఈ సుశీలనే కాదుట్రా మరి ప్రేమిస్తోంట, పిచ్చి నాన్నా !

సీతయ్య : అలాగా ? ఆ సంగ తెందు కొచ్చిం దిప్పుడు ?

నారా : వొస్తున్నా—ఇందులో విశేష మేమిటంటే సుశీలకూడా నన్ను ప్రేమిస్తోందిలే : దానికి దృష్టాంతంగా, తార్కాణంగా, అంటే స్మారకచిహ్నంగా యీ జాకెట్టును, ఒక ప్రణయలేఖను పంపించింది నిన్న నాకు—

సీతయ్య : ఎందుకు ?

నారా : ఇంతే మరి నీ తెలివి ? మేము సాక్షాత్తూ కలుసుకునేదాకా, యీ అపరూప వస్తువుని నా దగ్గర నిక్షేపించి వుంచుకోమని—

సీతయ్య : అదా, నిన్న నీ కేదో పార్సిల్ వచ్చిందన్నాడు, సన్యాసిగాడు ? అయితే ఈ జాకెట్టునా నువ్వింత భక్తిశ్రద్ధలతోటి పూజిస్తోంట ?

నారా : అది నా ప్రాణంరా, సీతయ్యా ; నా జీవగఱ్ఱ, నా ప్రేమధనం- ప్రేమయొక్క అమూల్యత, దాని అంతరార్థం నీ కర్థంకావురా, సీతయ్యా. ఆ జాకెట్టు మడతలలో నాకు సుశీల సాక్షాత్తూ రక్త మాంసాలతో గోచరిస్తుంది ; తెలుసా ? ఇది ఆమె మృదుమధుర శరీరాన్ని సంభావించి వచ్చిన ధన్యజీవి- కావలిస్తే మన సన్యాసిని అడుగు.

సన్యాసి : [ప్రవేశించి] పిలిచారాండి, బాబూ ?

సీతయ్య : లేదు, కాని —ఏంరా, సన్యాసీ, అలా దిగాలుపడి కనపడు తున్నావు, ఈవేళ ?

సన్యాసి : ఏం లేదండి—

సీతయ్య : ఊరికేనే ?

సన్యాసి : నాకో కష్టం వొచ్చిపడిం దండిప్పుడు, బాబు—

సీతయ్య : అయ్యో, ఏం ?

సన్యాసి : మా సూరికండి....

నారా : చూశావా, పాపం మన సన్యాసి ఒక ప్రేమపిపాసి. వా డెప్పుడూ ఆ సూరినిగురించే ఇదవుతోంటాడు.

సీతయ్య : ఏం, మీ సూరికేం ?

సన్యాసి : ఏమీ లేదండి ; దానికి మొన్న నండి, పుట్టిన రోజంటేనండి, అది పనిచేసే ఇంట్లో వుండే అమ్మాయిగారు జాలిపడండి ఒక క్రొత్త జాకెట్టు కుట్టిం చిచ్చారండి.

సీతయ్య : ఆ అమ్మాయిగారు చాలా మంచి మనస్సు గలదిలావుంది-

సన్యాసి : చిత్తం. మా సూరి మొన్న రేతిరి నాకోసమని యిక్కడ కొచ్చిందండి. తీరా, యింటికెళ్ళి సూసుకుండేతలికి దాని జాకెట్టు కనబడలేదండి. నిన్న టేలనించీ నెలుక్కుంటున్నామండి ఆ జాకెట్టు కోసం. ఈ కరువురోజుల్లో దాని కిప్పు డింకో జాకెట్టు ఎక్కణ్ణించి తెచ్చివ్వగలనా అని కిందా మీదా పడి ఆలోచిస్తున్నానండి.

సీతయ్య : ఒరే, నారాయణా, ప్రేమతత్వం బాగా తెలిసినవాడవు, ప్రేమైక జీవులైన యీ సూరీ సన్యాసులకి నీ దగ్గరున్న ఆ కొత్తజాకెట్టు బహూమానం చెయ్యకూడదూ ?

సన్యాసి : అయ్యగారు తీసి దాచా రేమిటండి, బాబూ, దాని జాకెట్టు ?

నారా : ఛీ, నా కెందుకురా ? అయినా, నా దగ్గర వొకటి వుంది ప్రస్తుతం ; కొత్తదే అనుకుంటాను. అది పట్టుకెళ్ళి మీ సూరి కియ్యి, పోనీ సంతోషిస్తుంది.

సన్యాసి : చిత్తం, ఇంతాకన్నా వుందాండి, బాబు—ఏదండి ?

సీతయ్య : ఇదుగో— ఈ గాజుకూడా పట్టుకెళ్ళు. ఏంరా, నారాయణా ?

నారా : ఒద్దు ఆ గాజు వుండనీ నాకు. [జాకెట్టు తీసి సన్యాసికి యిస్తాడు.]

సన్యాసి : [జాకెట్టు పరీక్షగా చూసి] ఈ జాకెట్టు మీ కెక్కడి దండి, బాబు ?

నారా : అదేమిటి, అలా అడుగుతున్నావు ?

సన్యాసి : ఏమీ లేదండి ; ఇదేనండి బాబు, మా సూరి కొత్త జాకెట్టు !

నారా : ఛీ, అదేమిట్రా ?

సీతయ్య : ఇది నారాయణ బాబుగారి స్నేహితురాలు ప్రేమ చిహ్నంగా పంపించిందిరా, సన్యాసీ !

సన్యాసి : అయ్య బాబు, మా సూరి జాకెట్టు నా కానవాలు తెలియ దంటారాండి ?

నారా : నేను కాదని చెపుతోంటే నీకు కాదుట్రా ?

సీతయ్య : పోనీలే. ఏదో వొకటి ; యీ జాకెట్టు నువ్వు పట్టుకెళ్ళు.

సన్యాసి : చిత్తం. బతికించారండి ;- [సీతయ్యతో] అన్నట్టు నిన్న తమ రిచ్చిన పార్సిల్ పోస్టులో యేశానండి : చెప్పడం మరిచి పోయాను.

సీతయ్య : సరేలే.

నారా : ఏం పార్సిల్‌రా అది, సీతయ్యా ?

సీతయ్య : ఏదో పుస్తకంలే.

సన్యాసి : అది పోస్టు మేష్టరుగారు చూసండి, "మీ నారాయణగారికి, కాదు సీతయ్యగారికి మతిపోయిం దేమిటిరా, ఆయన ఎడ్రసుకు ఆయనే పార్శిల్ పంపించుకుంటున్నాడు ?" అన్నారండి.

నారా : [ఆశ్చర్యంతో] అదేమిట్రా, సీతయ్యా ?

సీతయ్య : ఇంకెందుకు మరి. ఆ పార్సిల్‌లోనే కాదుట్రా, నారాయణా. మరి నీకు ఆ సుశీల దగ్గరనించి కొత్త జాకెట్టు వచ్చింది !

నారా : ఏమిటి?

సీతయ్య : అదే మరి. ఆ జాకెట్టే సూరి మరిచి పోయింది మన యింట్లో. నువ్వు దాని కేవేవో పేర్లు పెట్టి ఆరాధిస్తున్నావు!

నారా : సీతయ్యా—

సీతయ్య : అవునురా, నారాయణ!

(తెర పడుతుంది)

## రెండవ రంగం

మర్నాడు సాయంత్రం: డాబా మీద— పున్నమ చంద్రుడు ఉదయిస్తూ వుంటాడు. ఒక మంచమూ, దానిమీద ముడతలు లేకుండా వేసిన తెల్లని పక్క. చుట్టూ పిట్టగోడమీద కుండీలలో రక రకాల పువ్వుల మొక్కలుంటాయి. ఇన్ని ఆకులూ, కొమ్మలూ పట్టుకుని నారాయణ "నలదమయంతు లిద్దరు..." అనే పద్యం చదువుతూ ప్రవేశించి, ఆ రొట్ట అంతా మంచంమీద పరచి, ఒక సారి ఆ హంసతూలికాతల్పం కేసి సాభిప్రాయంగా చూసి మురుస్తాడు. అతను పైజామా, షర్టు, కోటు ధరించివుంటాడు.

నారాయణ : [పక్కమీద పడుకుని దొర్లుతూ మళ్ళీ మొదలెడతాడు పద్యం చదవడం] "నలదమయంతు లిద్దరు మనఃప్రభవానల దహ్యమానులై ....మానులై .... సలిపిరి.... సలిపిరి.... సలిపిరి...."— తరవా తేమిటో? దీని తస్సా గొయ్యా!.... అబ్బా, [బాధగా] ఇలాంటప్పుడు ఎక్కడ తగులడతాడో ఆ సీతయ్యగాడు— అన్నట్టు, సీతయ్య ఒక హంసవుతే;— అబ్బా, ఏమిటి ఈ వేదన అంత కంత కింత మాధుర్యం అయిపోతోంది! తెలివి కూడా తప్పి పోతోన్నట్టుందేమిటి? అబ్బా.... బాధ.... అయ్యో.... అమ్మా.... [మూలుగుతాడు]

సీతయ్య : [ప్రవేశించి] ఒరేయ్ ! నారాయణా !

నారా : [మూలుగుతూ వుంటాడు ; మాట్లాడడు]

సీతయ్య : నారాయణా, నిన్నేరా—

నారా : [విసుగుగా] అబ్బా, ఎందుకూ, నన్నలా చంపుతావు ?

సీతయ్య : అదేమిట్రా, ఇంత చలిలో ఆరుబైట అలా మంచంమీద పడుకుని వూరికే మూలుగుతున్నావు ? వెన్నెల కూడా కాస్తోంది. ఈ మంచుకి పడిశం పడుతుంది—

నారాయణ తండ్రి : [వయస్సు 50 ఏళ్ళు. తల నెరసింది. మీసం వుంది. కొంచెం చాదస్తంగా మాట్లాడతాడు. పుత్ర వాత్సల్యం ఎక్కువ. బిళ్ళ పంచెకట్టు కట్టుకుని, షర్టు వేసుకుని వుంటాడు. కంగారుగా ప్రవేశించి] వచ్చావా నాయనా, సీతయ్యా. నీ కోసమే చూస్తున్నానయ్యా.

సీతయ్య : అయ్యో. ఏమిటండీ, మన నారాయణ ఇలాగ— ?

నా-తండ్రి : అదే బాబూ, నాకూ భయం వేస్తోంది. సాయంత్రంనించి ఒక్కవరసని ఇలా కోడై కూస్తున్నాడనుకో,—

సీతయ్య : కోడైఅ?

నా-తండ్రి : అంటే అదే—ఒకటే బాధ పడడం, ఒకటే పలవరించడం, ఒకటా ? ఒక్కగాక ఒక్క నలుసు మిగిలాడు నాకు– పోనీ, జ్వరమేమోఅంటే, వొళ్ళాట్టే వెచ్చగా వున్నట్టూలేదు.

సీతయ్య : [నారాయణ పక్క పరిశీలించి] ఇదేమిటి, వీడి మంచంనిండా ఈ రొట్ట అంతా ఏమిటండి ? ఈ గడ్డీ, యీ ఆకూ, యీ అలం—

నా-తండ్రి : అదేకాదుటోయ్, బాబు మరి, నాకేమీ అర్థం అవటంలేదు? సాయంత్రమంతా తనలో తనే యేదో గొణుక్కుంటూ ఆ ఉద్యాన వనంలో పూరికే విహరించడం మొదలెట్టాడు—

సీతయ్య : ఉద్యానవనమాండి? ఏ వుద్యానవనం?

నా-తండ్రి : అదే నందనవనం కాబోలు—

సీతయ్య : అదేమిటండీ?

నా-తండ్రి : ఏమో మరి వాడే అన్నాడు—

సీతయ్య : ఏ మన్నాడు?

నా-తండ్రి : మన పెరడే పెద్ద ఉద్యానవనమో, నందనవనమో అని.

సీతయ్య : మీ రెలా నమ్మేరు?

నా-తండ్రి : నమ్మడమేమిటోయ్, నా మొహం; ఏం చెయ్యమన్నావు మరి, వాడలా ఇదవుతుంటేను?— అని పూరుకున్నాడా? వసంతం వచ్చిందన్నాడు!

సీతయ్య : ఏమిటీ!

నా-తండ్రి : అవును వసంతమే!— "వసంతం" అంటే మొదట నేను ఎవరో అమ్మాయి పే రనుకున్నాను. కాదు, ఋతువు వొచ్చిం దన్నాడు. నే నక్కడికీ శిశిరంలో వసంతం ఏమిట్రా అన్నాను. వాడు వినిపించుకోక యీ ఆకులన్నీ పుణుక్కొచ్చి, శుభ్రంగా ముడతలు లేకుండా వేసిన యీ పక్కనిండా పోసి దానిమీద దొర్లడం మొదలెట్టాడోయ్!

సీతయ్య : ఎందుకు?

నా-తండ్రి : "ఎందుకురా ?" అన్నాను : అంటే, తాపంగా ఉంది ; ఇవన్నీ చల్లగా, శీతలంగా వుంటాయి,—బిసబిసాలో, ఏవో అన్నాడోయ్—

సీతయ్య : కిసలయాలు అని కాబోలు ; అంటే చిగుళ్ళు—

నా-తండ్రి : అదే అయివుంటుంది. ఏదో శైత్యాపచారాలు కావాలన్నాడు.-

సీతయ్య : శైత్యోపచారాలు అని అనుకుంటాను మీ అభిప్రాయం—

నా-తండ్రి : ఏమో, ఆ మాటలకి నాకేం అర్థం తెలిసి చచ్చింది గనక ? అంతేకాదోయ్ బాబు, నాభికూడా కావాలన్నాడోయ్.

సీతయ్య : నాభా అండి ?

నా-తండ్రి : అవును. వొంటికి పూసుకోడానికిట ; తినడానికి కాదుకదా అని కాస్త సంతోషించాను.

సీతయ్య : నయమే నాభికూడా తెప్పించి యిచ్చారు కాదు; రక్షించారు.

నా-తండ్రి : నాభి వొంటికి రాసుకుంటే చల్లగా వుంటుందంటావా ? గంధమా ఏమిటి అది ?

సీతయ్య : నాభి కాదండీ, మహాప్రభో అది. ఈసారి తెలుస్తోంది : మృగనాభి గంధం అయివుంటుందండి. పంకం అనికూడా అంటారు ; అంటే బురద.

నా-తండ్రి : బురదా ? చల్లదనానికి అని కూడా అన్నాడు సుమా. చూడు, సీతయ్యా—

సీతయ్య : అయ్య ?

నా-తండ్రి : వొళ్ళంతా వూరికే అగిడి మంట లెత్తేస్తోందని ఒకటే గోలోయ్!

సీతయ్య : మందుతుందండి—

నా-తండ్రి : అయితే నీకు తెలుసా? మీ రిద్దరు హాస్టలులో వున్నప్పుడు వీడి కిదివరకెప్పుడైనా యిలా వస్తూండడం మామూలుందేమిటి, బాబూ?

సీతయ్య : ఇదివరకు లేదుగానండి; అంతా అర్థమవుతోందండి.

నా-తండ్రి : తామరతూళ్ళు తెప్పించమన్నాడోయ్! పచ్చకర్పూరం—ఎక్కడా దొరక్కపోతే ఆఖరికి మన సన్యాసిగాణ్ణి పంపించి తులం ౧౫ రూపాయలు పెట్టి ఒక చిన్నమెత్తు తెప్పించాను.

సీతయ్య : అయ్యా, నే నొకటి చెపుతాను వినండి: వీడు కావాలన్నదల్లా తెప్పించి యిచ్చి ఇలా గారాం చేసి, వీణ్ణి పాడుచేస్తున్నారు మీరు.

నారా : [కొంచెం ఒత్తిగిలి] నాన్నగారూ!

నా-తండ్రి : నాయన—

నారా : అలా చూస్తూ వూరుకుంటారేం?

నా-తండ్రి : ఏమిటి, నాయనా, అది?

[గుడ్లగూబ అరుస్తుంది]

నారా : ఆ కోయిల ఊరికే అదేపనిగా కూస్తోంది; దాని గొంతుకలో ఏదైనా ఇంత కుక్కండోయ్, బాబు!

నా-తండ్రి : చూశావుటోయ్, వరస?

సీతయ్య : గుడ్లగూబరా, నారాయణా అది, కోకిలకాదు!

నారాయణ లేచి కూర్చుని, కోటు, చొక్కా అవీ విప్పి దూరంగా పడేస్తాడు, మళ్ళీ పడుకుంటాడు.

నా-తండ్రి : అదేమిటిరా, నాయనా, అలా గుడ్డలన్నీ విప్పేసుకుంటు న్నావు? తాపమే మళ్ళీ?

సీతయ్య : సిగ్గు లేదుట్రా, నారాయణా, బొత్తిగా దిగంబరస్వాములవారి లాగ?

నారా : సీతయ్యా—

సీతయ్య : ఏంరా, నారాయణ?

నారా : నువ్వు కాస్సేపు నోరు మూసుకుంటావా?

నా-తండ్రి : తప్పురా, నాయనా; అత న్నలా అనొచ్చా?

నారా : [పలవరింతగా] ఏనాడు నీ దివ్యసుందర విగ్రహాన్ని దర్శిం చానో, ఏ బస్సు స్టాండు మండపంలో నా మండుతోన్న పంచ కుచ్చెళ్ళని నీ శీతల కరస్పర్శంతో నేర్పుగా ఆర్పావో, ఆనాడే, ఆ బస్సుస్టాండు మండపంలోనే, నా పేద గుండె నీ హస్తగతం చేశాను!

నా-తండ్రి : [ఆశ్చర్యంగా చూస్తూ] దైవ ప్రార్థన చేస్తున్నా డేమిటోయ్, సీతయ్యా? ఏదో అగ్ని ప్రమాదం అంటున్నా డేమిటి?

సీతయ్య : ప్రార్థనాకాదు, మన్నూకాదు; ఇంకా వినండి—

నారా : మన పునస్సంధానం కోసం కాసి, కాసి కృశించి....

నా-తండ్రి : అదేమిటోయ్?

సీతయ్య : అదేనండి మరి—

నారా : ఆహా! సుశీలా! ఇది నీ పరిహాసలీలా? ఇంకనూ దయ రాదేలా?

సీతయ్య : ఓరి బేలా ! వీ కవిత్వం కాలా !

నా-తండ్రి : అదేమిటోయ్, సీతయ్యా. అసలే ఇదవుతోంటే, వాణ్ణి పాపం అలా అంటావు ?

సీతయ్య : లేకపోతే ఏమిటండి మరి ?

నా-తండ్రి : సీతయ్యా !

సీతయ్య : అయ్యా ?

నా-తండ్రి : వీడి చేష్టలు చూస్తోన్న కొద్దీ వీడికి కొంచెం మతి స్థిమితం తగ్గుతోన్నట్టు కనబడుతోందోయ్. ఎందుకోను—

సీతయ్య : నయమేనండి—వాడు నిక్షేపంలా గున్నాడు. మనస్సు స్థిమితం తగ్గుతోంట మీకూ, నాకూను.

నా-తండ్రి ; అలా అంటా వేమిటోయ్ ? తీరి కూర్చుని ఇలా బాధపడడం సరదా అంటావా వాడికి మాత్రం ?

నారా : అబ్బా.... తాపం.... దాహం....చలి, చలి ! [మళ్ళీ చొక్కా, కోటు తీసి తొడుక్కుని, పడుకుంటాడు.]

సీతయ్య : ఒరేయ్, వరూధినీ ! గిరికా !

నా-తండ్రి : ఏమిటి అన్నావు ?

సీతయ్య : "వరూధినీ, గిరికా"—అన్నాను. ఆ పాడు ప్రబంధాలన్నీ చదవకురా అని ఎన్నిసార్లు పోరినా విన్నాడు కాదు. దీన్ని విరహతాపమనీ, మదనజ్వరం అనీ, వలపు తెగులనీ ఇత్యాది పేర్లతో పిలుస్తారండి ; అనుభవిస్తున్నాడు !

నా-తండ్రి : ఏమిటి నిజమే ? అయితే....

సీతయ్య : ఎరక్కపోయి ఆ దిక్కుమాలిన మంటపల్లి అగ్రహారం ఎందుకు వెళ్ళేమో....

నా-తండ్రి : ఆ అమ్మాయి ఎవరో రమ్మందని వెళ్ళి వాళ్ళ కొంపకి—

సీతయ్య : లోగిలి కండి—

నా-తండ్రి : అదే— లోగిలికి నిప్పుపెట్టి వచ్చాడూ—?

సీతయ్య ఇంకేమిటండి మరి?

నారా : [పద్యాలు చదువుతాడు]

"నాడు స్టేషనులో మాట లాడునపుడు
సారెకును తాకు నీ కటాక్షముల కట్టె
త్రుళ్ళి దడదడ మనుచు మోకాళ్ళదాక
ఈ వలపు గుండె జారిపోయినదె, చెలియ!

మండు రేయెండ రేగిన మామకీన
విరహ సుప్తాగ్ని సప్తజిహ్వాకల కెడద
అట్టె పరశురామప్రీతి నందు పెద్ద
నాలుగిళ్ళ భవంతి చందమున తోచు!"

సీతయ్య : చిత్తగిస్తున్నారాండి?

నారా : అయ్యో, ఇన్ని సిగరెట్లు నేను కాలుస్తున్నాను. నన్ను ఒక్క సిగరెట్టూ కాల్చదు!

నా-తండ్రి : ఏమిటి, మావాడు సిగరెట్లు కాలుస్తాడుటోయ్? నువ్వు దగ్గరుండి చూస్తూ వూరుకుంటున్నావా?

సీతయ్య : చుట్టలు త్రాగకూడదట్రా అబ్బీ, అని ఎన్నిసార్లు చెప్పానో అడగండి, వాడికి తెలివి వచ్చాకాను?

నా-తండ్రి : త్రాగడమే ?

సీతయ్య : లేదు, పిల్చడమండి —

నా-తండ్రి : ఏమిటి, నస్యం కూడానా ?

నారా : [పాడతాడు] "ఈ వియోగ జలధి గడచి బ్రతికినగదా, నేను ముదము గనుట ; ఆహా, సఖీ, భరింపగగలనటె ?.... ఈ వియోగజలధి...."

సీతయ్య : అయ్యో- ఇంక ముదిరిపోతోంది....

నా-తండ్రి : అబ్బ ! అలాంటి అవాచ్యం మాట లనకోయ్, నేను వినలేను.

సీతయ్య : ఒరేయ్, నారాయణా, ఈ చల్లగాలిలో నువ్వా మంచంమీద నించి లేచి, ముందు లోపలికి పద. [కుదిపి లేపుతాడు]

నారా : మీరు నన్ను చంపినా ఇప్పుడిక్కడనించి కదలలేనోయ్, బాబూ.

నా-తండ్రి : నారాయణా, నా మాట విని, లేవవు, నాయనా ?

సీతయ్య : పాపం, మీ నాన్నగా రలా ఇదవుతోంటే లేవలేమిరా, నారాయణా ?

నారాయణ కళ్ళు మూసి, పళ్ళు బిగించి మంచం మీద రూళ్ళ కర్ర లాగ పడుకుంటాడు.

నా-తండ్రి : లే, నాయనా....అయ్యో, అయ్యో, ఇంకేముంది ? సీతయ్యా, వీడు పళ్ళు గిట్ట కరిచేశాడు !

సీతయ్య : అలా అంత దగ్గరగా వెళ్ళకండి వాడికి ; మిమ్మల్ని కూడా కరుస్తాడు !

నా-తండ్రి : నురుగులు కూడా వస్తున్నాయి నోట్లోంచి! ఇంక నేనేం చెయ్యను ?

సీతయ్య : ఫరవాలేదండి, అదంతా పిత్తప్రకోపం.

నా-తండ్రి : ఇప్పుడు నేనేం చేశాను వీణ్ణి పిచ్చకోపానికి ? అబ్బే, లేదోయ్ ; వీడు మూర్ఛ పోయాడు కాబోలునోయ్, తండ్రీ!

సీతయ్య : మన పురాణ పురుషులంతా మూర్ఛలు పోయినవాళ్ళే కాదండీ ? ఫరవాలేదు! మరేం గాభరా పడికండి. ముందు వీణ్ణి మనం వెంటనే లోపలికి తీసుకు వెళ్ళి పడుకోపెట్టాలి.

నా-తండ్రి : ఎలాగోయ్, సీతయ్యా, నాకు కాళ్ళు వొణుకుతున్నాయి — వెనక వీళ్ళ అమ్మ—

సీతయ్య : అలాంటి వన్నీ జ్ఞాపకం చేసుకోకం డిప్పుడు. భయంలేదు. మీరా తలాపు దిక్కున పట్టుకోండి. నేను కాళ్ళకాడ దిక్కున పడతాను. మంచం సాయం పట్టి పడుకో పెడదాం—పట్టండి మరి. అలా విచారిస్తూ కూర్చుంటే లాభంలేదు. [నారాయణ తండ్రి మంచం సాయం పడతాడు] అదీ....అలాగ....

నా-తండ్రి : అయ్యో, నారాయణా, నారాయణా!

మంచం సాయం పట్టి గదితలుపు తోసి లోపల పెడతారు. తిరిగి యిద్దరూ డాబా మీదికి వస్తారు. మంచంమీద నారాయణ డాబామీదకి కనబడుతూ వుంటాడు.

నా-తండ్రి : ఉన్న ఒక్క నలుసునీ ఎంతో ఇదిగా పెంచుకొస్తున్నాను- ఇదేమిటోయ్, సీతయ్యా, ఆఖరి కిలా అయింది ?

సీతయ్య : అబ్బే, అలా దుఃఖించకండి మరి ; తగ్గిపోతుంది.

నా-తండ్రి : మీ రా మందపల్లి నించి వచ్చిన పదిరోజుల నించీ....

సీతయ్య : మంటపిల్లి అండి—

నా-తండ్రి : అదే వల్లకాడు పిల్లి!— అప్పటినించీ, చూస్తోండగానే వీడు ఎలా చిక్కిపోవడం మొదలెట్టా డనుకున్నావు! రాత్రిళ్లు నిద్రపోడు, ఏ పనీ చెయ్యడు, సరీగ్గా తిండికూడా తినటంలేదు: ఏమిటో మట్టితిన్న పాములాగ ఒకటే ఆలోచన. దిక్కుమాలిన ఆలోచన; ఆ ప్రమీల—

సీతయ్య : సుశీల—

నా-తండ్రి : ఆఁ, సుశీలే కాబోలు, వీడి కేదో మచ్చుమందు పెట్టివుంటుం దోయ్, బాబు!

నారాయణ అమాంతంగా లేచి, మంచం ప్రక్కన వున్న బల్లమీద గాజు గ్లాసులో వున్నషర్బత్తు గడగడ త్రాగేసి మళ్ళీ పడుకుంటాడు.

సీతయ్య : ఆఁ. ఆఁ!

నా-తండ్రి : అదేమిటి?

సీతయ్య : అదేమిట్రా, నారాయణా. ఆ గ్లాసులోది ఏమిటి, అలా గడగడ త్రాగేసి పడుకున్నావు?

నా-తండ్రి : అయ్యో, అయ్యో, [కంగారుగా] వీడి ఓహాత్యం ఇదయిపోను! సీతయ్యా, వీడేదో కలుపుకు తాగేసి విరుచుకు పడిపోయాడోయ్; ఇప్పు డేమిటి సాధనం? కొయ్యైపోయాడు—

సీతయ్య : [గ్లాసు తీసి పరీక్షించి] ఈ గ్లాసులోది ఏదో చిక్కగా, జిడ్డు జిడ్డుగా వుందండి—

నా-తండ్రి : ఆఁ?

సీతయ్య : [నారాయణని కుదిపి] ఒరేయ్, నారాయణా, నీకు పుణ్యం వుంటుంది. ఏమిట్రా, బాబూ, నువ్విప్పుడు త్రాగినది? చెప్పు, ఇంకా మించిపోలేదు.

నా-తండ్రి : చెప్పవు, నాయనా, మీ నాన్నగారితో చెప్పవు. తండ్రీ? నీకేం లోటు చేశానురా నన్నిలా ఏడిపిస్తున్నావు? నీకు ఏది కావలిస్తే అది తెప్పించి యిచ్చుకుంటాను, చెప్పవూ?

సీతయ్య : అదుగో, కళ్ళు తెరిచాడు. చెప్పరా, మీ జనకులు అలా దుఃఖిస్తూంటే జాలి లేదుట్రా నీకు, నారాయణా?

నారా : సాహసే లక్ష్మీ! ఈ వికృత వసంతమూ, యీ వెకిలి పువ్వులూ, తుమ్మెదలూ, యీ కాల్చేసే చందమామా, మంద పవనమూ, నన్నింకేమీ చెయ్యలేవు: ఆఖరికి నేనే గెల్చాను; మృత్యువుని ఆహ్వానించి జయించాను. ఆహా! మృత్యుం జయుణ్ణి!

నా-తండ్రి : ఆఁ. అయ్యో. ఏమిటీ అంటాడు, సీతయ్యా?

సీతయ్య : ఏమిట్రా నీ మాటలకి అర్థం?

నారా : ఒరేయ్, సీతయ్యా!

నా-తండ్రి : పలకవేమోయ్, సీతయ్యా. వా డలా పిలుస్తోంటేను?

నారా : నాన్నగారూ!

నా-తండ్రి : నాయన?

నారా : నాకిప్పు డొక కుక్కనై మొరగాలని వుందండీ! [వికటంగా "బొంయి బొంయి" మని నవ్వుతాడు.]

సీతయ్య : ఏం కుక్కరా అది, నారాయణా?

నారా : కుక్కలలో పెక్కు రకములు గలవు ! [లేచి కూర్చుని చదువుతాడు] "పులియడు. బూచిగా. డసురపోతులరా జను మంతిగాడు. చెంగలువ, సివంగి. భైరవుడు, సంపగి, సాళ్వడు, వాయువేగి........ వాయువేగి..........వాయువేగి–" తరవాత ఏమిట్రా, సీతయ్యా ?

నా-తండ్రి : సీతయ్యా, వీడు తిన్నది నాభి కాదోయ్, గన్నేరు పప్పేమోనోయ్ !

సీతయ్య : రెండూ కాదండి. తినలేదు ; ఏదో త్రాగాడు— ఒరేయ్, నారాయణా, అమ్మవు కాదూ, ఏమిటి నువ్వు త్రాగింది, చెప్పవుట్రా ?

నారా : ఆమ్లమురా, సీతయ్యా, ఒకానొక ఆమ్ల విశేషము !

నా-తండ్రి : ఏమిటదీ ?

నారా : ఆమ్లము, జంబీరామ్లము !

నా-తండ్రి : ఏమిటోయ్, అది ? ఏదైనా టానిక్కా ? ఆమ్లా ఆయిలో ఏదో అంటారు, అదేమిటి ?

సీతయ్య : ఆమ్లమంటే యాసిడ్ అండీ బాబూ !–ఏమి యాసిడ్‌రా అది, నారాయణా ? జంబీరామ్ల మేమిటి ? అదేదో ఇంగ్లీషులో అఘోరించరాదూ ?

నారా : అబ్బా, మంటలు, మంటలు వొళ్ళంతా కాలి అట్టుడికి పోతోంది !

నా-తండ్రి : అలాటి దేదైనా త్రాగితే ప్రేగుల్లో మండుతుంది గాని, ఒళ్ళంతా ఉడుకుతుందిటోయ్ కుమ్ములో పెట్టిన దుంపలాగ, సీతయ్యా ?

సీతయ్య : కొన్ని ఆమ్ల విశేషా లంతేనండీ, బాబూ— ఉండండి—

నారా : ప్రాణాలు పోతున్నాయండోయ్, నాన్నగారూ! [మళ్ళీ పడుకుంటాడు]

నా-తండ్రి : అయ్యో, అయ్యో, మళ్ళీ పడిపోయాడోయ్ కుర్రవాడు! ఏం దిక్కింక నాకు? అయ్యో భగవంతుడా! [నారాయణ మీద పడి దుఃఖిస్తాడు]

సీతయ్య : ఉండండి, అలా వాడి మీద పడకండి; ఉన్న కాస్త వూపిరి సలపదు.

నా-తండ్రి : [కంగారుగా] నీళ్ళు! నీళ్ళు!

సీతయ్య : [నారాయణ దగ్గరికి వెళ్ళి] సోడా, సోడా!

నా-తండ్రి : గసగసాలు, కటకరోహిణి!

సీతయ్య : దుంపరాష్ట్రం, ఆంధ్రరాష్ట్రం!

సన్యాసి : [చీపురు కట్టతో ప్రవేశించి] అయ్యా, వారికి కొంచెం గాలి వొదులుతారా?

సీతయ్య : అవును అన్నట్టు, విసనకర్ర, చీపురుకట్ట!

సన్యాసి : ఇదుగోనండి, చీపురుకట్ట! [అందించబోతాడు]

సీతయ్య : ఏమిటది? చీపురుకట్ట ఎందుకురా, చెవిటి పీనుగా?

సన్యాసి : మీ రిప్పు డడిగారు కారండి? మంతిరిస్తా రనుకున్నాను!

నా-తండ్రి : [గద్గదంగా] సన్యాసీ, ఒరేయ్ సన్యాసి!

సన్యాసి : పిలిచారాండి, అయ్యగారూ?

సీతయ్య : అవును పిలిచారు—నువ్విప్పుడు అర్జంటుగా పరుగెత్తికెళ్ళి ఒక డాక్టర్ని తీసుకురావాలి.

సన్యాసి : ఏ డాక్టరుగారి నండి, బాబు ?

సీతయ్య : ఓరి నీ యక్ష ప్రశ్నలు మండ, ఏ డాక్టరేమిట్రా ? ఏ డాక్టరైనా సరే........

సన్యాసి : మనింటికి మామూలుగా దయచేసే డాక్టరుగారు ఊళ్ళో లేరండి ; అందుకు చెప్పాను.

సీతయ్య : చూడు, ఇంక అట్టే వెధవ కబుర్లు చెప్పక వెళ్ళి ఎవరో ఒక డాక్టర్ని ఉన్నపళంగా తీసుకు చక్కారా ఇక్కడున్నట్టు, తెలిసిందా ?

సన్యాసి : ఇంగ్లీషు డాక్టరేనాండి ?

నా-తండ్రి : ఒరేయ్ సన్యాసి- [వారిస్తాడు]

సన్యాసి : లేకపోతే మరి, ఉమాపతీ అనీ, నాటు వైద్దెమనీ ఇంకా వున్నాయి కాదండీ ?

సీతయ్య : ఉమాపతీ వొద్దు, ఉద్ధరిపతీ వొద్దు- వెళ్ళి ఇంగ్లీషు డాక్టర్నే తీసుకురా ; ఇలాంటి కేసులకి వాళ్ళే వుండాలి.

సన్యాసి : చిత్తం, అందుకోసమే నండి మరి ; ఇప్పు డెళ్ళి రమ్మంటారా అండి ?

సీతయ్య : [గద్దిస్తూ] మరి రేపు వెడదామనుకుంటున్నావుట్రా ? ఇంకా ఇక్కడే వున్నావేం ? అయ్యగారికి ప్రాణం మీదికి వచ్చిందని తెలియదూ ?

సన్యాసి : [నారాయణ తండ్రి కేసి వొక సారి చూసి] ఏ అయ్యగారి కండి, బాబూ ?

నా-తండ్రి : [దీర్ఘంగా] త్వరగా వెళ్ళి రారా, సన్యాసిగా–

సన్యాసి : అందుకోసమే నండి మరి- ఇక్కడున్నట్టు రానండీ ? [నిష్క్రమిస్తాడు]

సీతయ్య : [నుదురు మీద చమట తుడుచుకుంటూ నిట్టూర్చి] అమ్మయ్య !

నా-తండ్రి : మరేం ఇది లేదంటావా, సీతయ్యా ?

సీతయ్య : ఏమో చెప్పలేమండి. డాక్టరుగా రొచ్చి చూసిందాకా ఏదీనీ– ఊపిరి బాగానే తీసుకుంటున్నాడు ; వీడు పుచ్చుకున్న వస్తువును బట్టి ఉంటుందండి అంతాను. అయ్య- అయినా ఇప్పుడు మనం చెయ్యగలిగిం దేమీ లేదు. వాణ్ణి కదపకండి.

నా-తండ్రి : నువ్వు వీణ్ణి కాస్త చూస్తూ వుంటావా ? లేచేటప్పటికి బలంగా వుంటుంది, కొంచెం కాఫీ తయారు చేయిస్తాను.

సీతయ్య : అయ్యో, మరేం భయం లేదు. అలాగే చేయించండి, రెండు మూడు కప్పులు చేయింపించండి–

నారారాయణ తండ్రి లోపలి కెళ్ళి కొంచెం సేపుండి మళ్ళీ వస్తాడు- సీతయ్య ఆవులిస్తూ పచారు చేస్తుంటాడు.

నా-తండ్రి : సీతయ్యా !

సీతయ్య : అయ్య.

నా-తండ్రి : ఈ సన్యాసిగాడు వెళ్ళి చాలా సేపయింది. పోనీ, నేనుకూడా వోసారి వెళ్ళి రానేమిటి ?

సీతయ్య : అబ్బే ! ఎందుకండి, దీనికి మళ్ళీమీరు వెళ్లాలా ? నేనుండి

ఏం చేస్తాను? నేను వెళ్ళి రాలేనూ? అక్కర్లేదండి. యీ పాటికి వస్తుంటారు.

నా-తండ్రి : నారాయణ లేచాడా?

సీతయ్య : ఇంకా లేదండీ, అలాగే పడుకుని వున్నాడు. ఇలా ఒత్తిగిల్లనైనా లేదు.

నా-తండ్రి : [జాలిగా] ఎలాగోయ్?

సీతయ్య : అలాగేనండి మరి. కాఫీ అయిందాండి?

నా-తండ్రి : అయిపోయినట్టే, దగ్గరకూర్చుని స్ట్రాంగ్‌గా తయారు చేయిస్తున్నాను. వస్తాను మరి. జాగ్రత్తగా చూస్తోంటావు కాదు, బాబూ?

సీతయ్య : అయ్యో, నా కిన్నిసార్లు చెప్పాలా అండి?

నా-తండ్రి : తండ్రి పేగు చూడు మరి? నా ఆదుర్దా అలాగుంటుంది.

సీతయ్య : కాదండీ—

నా-తండ్రి : నేను రానా మరి? [నిష్క్రమిస్తాడు]

సీతయ్య : అయ్య— [తనలో] వీ డింకా అలాగే పడుకుని వున్నాడు, రూళ్ళ కర్రలాగ! [గోడకి జార్లావేసివున్న పడక కుర్చీకేసి చూసి] ఇక్కడ పడక కుర్చీ వుందేమిటి? నేనింకా చూడనే లేదు. [ఆవులించి] అబ్బ, కళ్లు కూరుకొస్తున్నాయి. ఈ వరండాలో కాస్త విశ్రమిస్తాను. మెళుకువ వచ్చినప్పుడోసారి ఆ గదిలోకి తొంగిచూస్తూవుంటే చాలు.... [పడక కుర్చీ వేసుకుని దానిలో పడుకుని నిద్రపోతాడు]

డాక్టర్ నిర్మల : [వయస్సు 28 ఏళ్ళు. బొద్దుగా, కొంచెం పొడవుగా వుంటుంది. చాలా చురుకైనది. తెల్లని, జరీ అంచు చీర, డాక్టర్లు వేసుకునే తెల్లని ఓవర్‌కోటు ధరించి వుంటుంది. కొంచెం ఎత్తుమడమల జోళ్ళు వేసుకుంటుంది. నీటుగా 'బన్ను' లాగ వేసుకున్న జుట్టుముడిలో పువ్వుల కదంబం వుంటుంది. మెడలో స్టెతస్కోప్, కోటు జేబులో పెన్, థర్మామీటర్ వుంటాయి. విసురుగా వచ్చి మెడిసిన్‌చెస్ట్ బల్లమీద పెట్టి] అయ్యో, ఇతని దగ్గర ఎవ్వరూ లేరే! ఇలా వొక్కణ్ణీ వొదిలేశారేం? [సీతయ్య జబ్బ పట్టుకు గుంజుతుంది]

సీతయ్య : ఆఁ. ఆఁ. [కళ్ళు నులుముకుంటూ కంగారుగా లేవబోతూ] ఉండండి, అలా నా జబ్బ పట్టుకుని గుంజకండి.

నిర్మల : ఒళ్ళు మత్తెక్కిపోయి మైకం కమ్ముకు పోతోంటే ఎలాగో ప్రయత్నించి ఇటూ, అటూ పచారు చెయ్యాలిగాని, అలా పడకకుర్చీలో జోగుతోంటే ఇంకా ఎక్కువై ముంచుకు రాదూ?

సీతయ్య : [ఆమెకేసి తేరిపారచూస్తూ] ఆహా! మీ రెవరో స్వర్గలోకం లోంచి దిగివచ్చిన దేవకన్యకలాగ వున్నారు!

నిర్మల : నే నెలా వుంటేనేం? ముందు మీకు తెలివి వచ్చింది, సంతోషం. ఈసారి మీ రోగం కుదురుస్తాను! ఇలా నన్నాను కొని పది అడుగులు వెయ్యండి, ముందు.

సీతయ్య : [ఆశ్చర్యంతో] పదా. ఏడా?— అబ్బ, మీ చెయ్యి ఎంత మృదువుగా వుంది, లేత తమలపాకులాగ!

నిర్మల : నా కాళ్ళుకూడా మృదువుగానే వుంటాయి, ఇంకా చూడండి-

సీతయ్య : అబ్బే, అక్కర్లేదండి, మృదువుగానే వుండివుంటాయి. సందేహ మేమిటి? మీ మాటలో నాకు నమ్మకమే.

నిర్మల : ముందు లేవండి ఆ కుర్చీలోంచి—

సీతయ్య : ఎందుకు? ఎక్కడికి?

నిర్మల : ఇప్పుడు చెప్పేను కాదూ?

సీతయ్య : ఏమిటి, ఎవరు మీరు?

నిర్మల : నే నెవర్నో తెలియకుండానే నన్ను పిలిపించారనుకుంటాను అయితే, ఏం?

సీతయ్య : నేను మిమ్మల్ని పిలిపించలేదే— మా నారాయణ ఏమిటి చెప్మా? అయినా మీ రిప్పు డిక్కడికి వచ్చినందుకు నాకు చాలా ఆనందంగా వుంది. అయితేనూ— నన్నెందుకు అమాంతంగా గిల్లి కుదిపారు?

నిర్మల : తెలివి రావడానికి—

సీతయ్య : వచ్చిందిగా— ఇంక కూర్చోరూ అలాగ?

నిర్మల : నే నిక్కడ కూర్చోడానికి రాలేదు.

సీతయ్య : నేను ఎన్నాళ్ళనించో వెతుకు తున్నాను—అంటే, నా స్వప్న సీమలో—

నిర్మల : నేను వెళ్ళిపోతున్నాను.

సీతయ్య : అమ్మమ్మ!—ఇలా ఒక అవ్యాజకటాక్షం నావైపు పారేసి మీ రలా నిష్క్రమించడం—

నిర్మల : మీ కింకా సరిగ్గా మెళుకువ రాలేదనుకుంటాను. ఏమిటి మీ కిప్పుడు బాధ?

సీతయ్య : అది మీరు తీర్చగలరా ?

నిర్మల : ప్రయత్నిస్తాను. అది నా వృత్తి.

సీతయ్య : నిజమే.

నిర్మల : అందుకోసమేగా మరి నే నిక్కడికి వస్త ?

సీతయ్య : ఏమిటి ? నే ననుకుంటూనే వున్నాను—

నిర్మల : ఏమిటది ?

సీతయ్య : నా బాధ తీర్చగల నారీశిరోమణి మీరే అని.

నిర్మల : అయితే నాకు చేతకాదంటారా ?

సీతయ్య : ఎంతమాట ! నా కిప్పుడు తలలో వసంతంలో లాగ ఏవో చెట్లు గబగబా చిగురు పోస్తున్నట్టు వుంది !

నిర్మల : నా తలలో వేనా ? అవేచెట్లవో నాకూ తెలియదు ; కదంబం అంటారు.

సీతయ్య : నా బుర్ర ఏమిటో పాము పడగ లాగ వికసించిపోతోంది !

నిర్మల : అదా— అవన్నీ అవే తగ్గి పోతాయి.

సీతయ్య : చూడండి. మీ పేరెవరు అన్నారు ?

నిర్మల : నే నిప్పు డేమీ అనలేదు ; కాని, నిర్మల నా పేరు.

సీతయ్య : నిర్మల ! ఆహా, మీకు మల్లేనే మీపేరు కూడా ఎంత మనోహరంగా ఉంది !

నిర్మల : మీ ధోరణి మార్చడానికి వీలౌతుందా ?

సీతయ్య : ఎలాగ మార్చడం ? భోజరాజు మొహంకేసి చూస్తే కవిత్వం పుట్టుకొచ్చినట్టు మీ సుందరవదనారవిందం చూస్తోంటే నాకు పూరికే లలిత నిర్మల భావాలు పుట్టుకొస్తున్నాయి !

నిర్మల : ఓహోహ, ముదిరిపోతోంది—

సీతయ్య : మీకు ఇంకా వివాహం కాలేదని నా విశ్వాసం—

నిర్మల : ఆ అప్రస్తుత ప్రశంస ఎందుకిప్పుడు ?

సీతయ్య : అబ్బే. ఊరికే అడిగాను.

నిర్మల : నా వైవాహిక విషయం మీ కంత కుతూహలంగావుంటే— ఇంకా కాలేదు.

సీతయ్య : ఆఁ !

నిర్మల : ఆఁ అన్నారేం ?

సీతయ్య : నేను చెప్పాను కాదూ ? నా విశ్వాసం చాలా దృఢమైనది లెండి.

నిర్మల : అలాగా ? నాముందు ఎవరైనా నుంచుని "ఆఁ" అని నోరు చాపితే, వారి నాలుక పరీక్ష చెయ్యమని అర్థం.

సీతయ్య : అయితే నన్ను మీ ముందు నుంచుని "ఆఁ—" అనమంటారా ? నాకు ఒక్కటే నాలుక !

నిర్మల : ఇక్కడింక నే నుండవలసిన అవసరం వున్నట్టు తోచదు, నేను వెడుతున్నాను. [బల్లమీదవున్న మెడిసిన్ ఛెస్ట్ తీసుకుంటుంది]

సీతయ్య : అదేమిటి, ఆ పెట్టి పట్టుకుపోతున్నారు ?

నిర్మల : ఏం, ఇది నాది—

సీతయ్య : మీదా ! ఆ పెట్టి ?

నిర్మల : అవును నాదే, నామందుల పెట్టి—

సీతయ్య : మందులపెట్టా! మీదా? అయితే—

నిర్మల : అవును—

సీతయ్య : అయితే మీరు డాక్టరా?

నిర్మల : నేను డాక్టర్నెందుకు కాకూడదు?

సీతయ్య : అవును, ఎందుకు కాకూడదు? అన్నట్టు ఆడ డాక్టర్లు కూడా వుంటోంటారు కాదూ?

నిర్మల : మీ కుర్రాడు వచ్చి నన్ను పిలిచిన గాభరా చూస్తే ఇక్కడెవరికో పురుడో, ఏదో రాక బాధపడిపోతున్నారు కాబోలు ననుకుని పరుగెత్తుకొచ్చాను.

సీతయ్య : నాకు పురుడొస్తుం దనుకొనేనా అయితే అలా గిల్లి గుంజా రిందాకాను?

నిర్మల : లేదు, ఇక్కడెవరో ఏదో త్రాగి మూర్ఛ పడిపోయారు, త్వరగా వచ్చి రక్షించా లన్నాడు మీ వాడు. అదంతా వట్టి నాటకం అన్నమాట? ఈ అర్ధరాత్రివేళ—

సీతయ్య : ఓహో, ఉండండి, అలా తొందరపడకండి; స్పృహతప్పి పడిపోయిన ఆసామీ వున్నాడు, లోపల.

నిర్మల : ఏమిట? అయితే మీకుకాదూ జబ్బు చేస్త?

ఇంతలో, నారాయణ తండ్రి కప్పూ సాసర్లలో కాఫీ తెస్తూ గడప తగిలి బోర్లా పడతాడు: కప్పూ, సాసరూ బ్రద్దలౌతాయి.

సీతయ్య : అయ్యయ్యో, అలా పడిపోయా రేమిటి? [పరుగెడతాడు]

నిర్మల : మీ రుండండి—ఈయ న్నిలా సాయం లేకుండా ఒక్కడినీ ఎందుకు తిరగనిస్తున్నారు, అయితే? [వెళ్ళి ఆయన జబ్బ పట్టుకుని లేవదీస్తుంది]

నా-తండ్రి : [కోపంగా] ఏం, నే నెందుకు ఒక్కణ్ణీ తిరగకూడదు ? నాకు సాయం ఎందుకు ? మధ్యని ను వ్వెవరవు ?

సీతయ్య : అయ్యో ఉండండి. ఈమె డాక్టరుగారు, డాక్టరు—

నిర్మల : నిర్మల—

సీతయ్య : ఆఁ— డాక్టరు నిర్మలగారు.

నా-తండ్రి : ఏమిటి, ఈవిడ డాక్టరా ?

నిర్మల : అవును, నేను డాక్టర్నే—యింట్లో అందరికీ ఏమిటీ పిచ్చి సందేహం ?

సీతయ్య : [నారాయణ తండ్రితో] అయితేనూ, మీ కేమీ దెబ్బ తగల లేదుగద ?

నా-తండ్రి : అబ్బే— వెధవ గడప ; కాలికి పంచ తగులుకునీ—

నిర్మల : ఈయన బాగానే వున్నారే— ఏదీ, నాలు గడుగులు వెయ్యండి.

నా-తండ్రి : ఇక్కణ్ణించి నేను ఒక్క అడుగైనా ఇంక ముందుకు వెయ్య లేను. [మళ్ళీ చతికిలబడతాడు. నిర్మల లేవదీస్తుంది]

సీతయ్య : ఏం ?

నిర్మల : ఫరవాలేదు, నన్ను పట్టుకుని నాలు గడుగులు వెయ్యండి.

నా-తండ్రి : అబ్బే, లాభంలేదు. నిలబడమంటే నిలబడతాను, అంతే,

నిర్మల : ఏం ఇంకా మైకంగా ఉందా ?

నా-తండ్రి : మైకమా ? మీ ఉద్దేశం నేనేం త్రాగుబోతు ననుకున్నారా ? అలాంటిది మా యింటా వంటాలేదు. [నిర్మల భుజంమీద

ఒక చెయ్యి, సీతయ్య భుజంమీద ఒక చెయ్యి వేసి నుంచుని కళ్ళు ఎఱ్ఱ జేస్తాడు]

సీతయ్య : అయితే, ఆవిడ ఎందుకు చెప్పారో, పోనీ రెం డడుగులైనా వెయ్యండి బావుండదు—

నా-తండ్రి : ఓయి పిచ్చిసీతయ్యా, నా కాలు బెణికింది కాదుటోయ్ మరి!

నిర్మల : [ఆయన్ని ఒక కుర్చీలో కూర్చోబెట్టి] అసలు మీరెందుకు లేచారు?

నా-తండ్రి : ఎంతసేపని ఆ వంటింట్లో కూర్చోను మరి?

నిర్మల : నేను వచ్చేలోగా ఎందుకా తొందర?

నా-తండ్రి : అదొకటి కూడానా?

నిర్మల : ఆ కాలు ఝాడించండి,—ఓసారి.

నా-తండ్రి : అమ్మయ్యో నావల్ల కాదు.

నిర్మల : పోనీ, అలా కదలకుండా కూర్చోండి--మీ కడుపులో ఇప్పుడు మరేమీ—

సీతయ్య : ఓహోహ! చూడండి, డాక్టరు నిర్మలగారూ, ఈయనకు కాదు సుస్తీగావుంట-

నా-తండ్రి : నాకే జబ్బుగా వుందనుకుంటోందేమిటోయ్ ఈవిడ అయితేను? ఓహోయిత్యం!

నిర్మల : ఈ ఇంట్లో మనుషులంతా ఏమిటి చిత్రంగా కనుపిస్తున్నారు! అయితే ఎవరికి ఇక్కడ జబ్బుగా వుంట? ఈ పిచ్చి ఆసుపత్రిలో నాకు కూడా మతిపోయేలాగుంది.

సీతయ్య : అసలు పిచ్చివాడు ఆగదిలో వున్నాడండి-

నిర్మల : ఆయనకి నిజంగా ఉన్మాదమేనా?

సీతయ్య : ఓవిధంగా అలాంటిదే—

నా-తండ్రి : అదేమిటోయ్ సీతయ్యా?— చూడండి డాక్టరమ్మగారూ, మావాడు అదేదో ఆమ్లంట త్రాగి నురుగులు కక్కుకుంటూ మూర్ఛపోయాడు. మీరు వాణ్ణెలాగైనా రక్షించాలి; మీ రుణం తీర్చుకోలేము.

నిర్మల : ఆమ్లమా? ఆమ్లమంటే?

సీతయ్య : జంబీరామ్లమన్నాడండి, మా నారాయణ. ఇంగ్లీషులో యాసిడ్ అంటారండి.

నిర్మల : యాసిడ్డే, అయ్యో ఇంతసేపు వూరుకున్నారేం? పదండి ముందు; రోగి ఎక్కడ?

నా-తండ్రి : ఆలస్యం అయిపోయిందంటారా అండి?

సీతయ్య : ఇలారండి ఈ గదిలోను. [తలుపు బార్లా తీస్తాడు నిర్మల లోపల ప్రవేశిస్తుంది]

సన్యాసి : [ప్రవేశించి] డాక్టరమ్మగా రొచ్చారాండి, అయ్యగారూ?— [గదిలో వున్న ఆమెను చూసి] ఇదిగో—

సీతయ్య : ఈవిణ్ణి పంపించి ఇంతసేపూ నువ్వెక్కడ పుణికింతా లాడుతున్నావురా, సన్యాసీ?

సన్యాసి : ఈరికి మన అడ్రేసు చెప్పి ముందెళ్ళమనండీ—

సీతయ్య : ఊఁ. ముందెళ్ళమనీ, నువ్వేం రాచకార్యం వెలగబెడుతున్నావు?

సన్యాసి : ఏంటోనండి - దారిలో మా మేనకోడలు కనపడితేనండి—

సీతయ్య : సూరా ?

సన్యాసి : చిత్తం.

నా-తండ్రి : ఏంరా, సన్యాసిగా, ఈలాంటప్పుడుట్రా మీ మేనగోడలుతో నీ సరాగాలు ?

సన్యాసి : అయ్యబాబు, అది నాక్కనపడ్డమే బ్రహ్మాండమండి. అందు కనండి మరి—

సీతయ్య : ఇందరా సన్యాసీ— [ఒక రూపాయ నోటు జేబులోంచి తీసి యిస్తాడు]

సన్యాసి : ఏంటండది ?

సీతయ్య : ఇది పుచ్చుకుని దాచుకో; మంచి డాక్టరుగారిని తీసుకొచ్చావు !

నిర్మల : [గది లోపలనించి] ఇదుగో -

సీతయ్య : అదేమిటి, అలా వింతగా పలకరిస్తున్నారు ?

నా-తండ్రి : ఏమండమ్మా, ఎలా వుంది మావాడికి ?

నిర్మల : ఇంకా ఊపిరి బాగానే తీసుకుంటున్నాడు మీ కుర్రవాడు—అంత భయపడవలసిన అవసరం లేదనుకుంటాను—

నా-తండ్రి : పోనీ చెప్పకండి ; మీ కడుపు చల్లగా—

సీతయ్య : ఇంకా మావాడికి స్పృహ రాలే దెందుచేతండి ?

నిర్మల : వస్తుంది, మరి—ఏదో యాసిడ్ త్రాగేడంటున్నారా—చూడండి—

సీతయ్య : సీతయ్య అండి.

నిర్మల : సీతయ్యగారూ—

సీతయ్య : ఏమండి ?

నిర్మల : మీ ఇంట్లో నవాసాగరం వుందా, కొంచెం ?

సీతయ్య : అదేమిటండి—సప్తసాగరాలంటారు గాని నవాసాగరం ఏమిటండి ? అది ఇళ్ళల్లో వుండడానికి వీలైనదే అంటారా ?

నా-తండ్రి : నవాసాగరం అంటే మందోయ్ వెర్రివాడా ? [డాక్టరు నిర్మలతో] లేదండి, అమ్మా.

నిర్మల : అయ్యో నామతి మండ ; నా ఛెస్టులోనే వుంది- చూడండి నా ఛెస్టు—

సీతయ్య : ఏమన్నారు ?

నిర్మల : నా ఛెస్టు, మందులపెట్టి, ఎదురుగుండా కనబడటంలేదూ ?

సీతయ్య : కనపడకేమండి ? తెస్తున్నానండి.

నిర్మల : ఇతని కనురెప్పలు కదుల్తున్నాయి—మీరెవరైనా కొంచెం పలకరించండి.

సీతయ్య : మీరు పిలవండి, ఫరవాలేదు— ఇదుగోనండి మీ ఛెస్టు. [తెచ్చి మంచం ప్రక్క వున్న బల్లమీద పెడతాడు]

డాక్టర్ నిర్మల పెట్టి మూత తీసి, స్మెల్లింగ్ సాల్ట్ నారాయణ ముక్కు దగ్గర పెడుతుంది. నారాయణ ఛెడీలుమని రెండు, మూడు తుమ్ములు తుమ్ముతాడు.

నా-తండ్రి : అద్గదీ, అమ్మయ్యా ! ఒరేయ్ నారాయణా, ఇలా చూడు నాయనా, ఒకసారి—

నిర్మల : ఈయన పేరు నారాయణా ?

సీతయ్య : మరేనండి— ఒరే నారాయణా, కళ్ళు బాగా విప్పి ఓసారి ఇలా చూడు ; ఈ వచ్చిన వారెవరు ?

నారా : [ఆవులిస్తూ పక్కమీద సగం లేచి కూర్చుని] ఏమిటీ, నేనిప్పు డెక్కడున్నాను ?

నా-తండ్రి : మన ఇంట్లోనేరా, నాయనా—

సీతయ్య : వీరిని గుర్తుపట్టేవా ?

నారా : ఏమిటో, నా కళ్ళని నేను నమ్మలేకుండా వున్నాను. ఈమె ఎప్పుడు వచ్చింది ? ఆహా, నా భాగ్యదేవతా !

నా-తండ్రి : మన అందరికీనురా, నాయనా—

నిర్మల : ఓహో ఇదా, ఈయన పలవరిస్తున్నాడా ?

నా-తండ్రి : రోజూ తెగ వాగుతాడండి నిద్దరలో—

నిర్మల : [నారాయణ చెయ్యి పట్టుకుని నాడి పరీక్షించి] అబ్బ, నాడి తీవ్రంగా కొట్టు కుంటోంది. "ఆ" అనండి. [నారాయణ ఆశ్చర్యంతో "ఆ" అంటాడు ; నిర్మల చప్పున ధర్మామీటరు తీసి అతని నోట్లో పెడుతుంది. అతను కంగారుగా అది కొరక బోతాడు] అది అలా కొరి కెయ్యకండి. [ధర్మామీటరు నోట్లోంచి తీసి చూసి, ఆశ్చర్యంగా] మళ్ళీ టెంపరేచరు లేదు ! ఇతను తాగిన గ్లాసేదీ ? [సీతయ్య అందిస్తాడు ; పుచ్చుకుని, పరిశీలించి] ఆఁ-

సీతయ్య : అదేనండి అసలు మావాడి జబ్బు -

నిర్మల : ఎన్నాళ్ళనుంచి ఇలా వుంటోంది ?

నా-తండ్రి : సుమారు పది రోజులనించండి.

నిర్మల : ఇంకేం ?- సైకోన్యురోసిస్ !

నా-తండ్రి : అదేం జబ్బోయ్, సీతయ్యా ?

సీతయ్య : దీన్నే ప్రేమ అనీ, ప్రణయమనీ అంటారులెండి.

నిర్మల : ఈయన్ని లేవదీసి కూర్చోబెట్టండి ముందు-

సీతయ్య : పట్టండి—పట్టవేంరా సన్యాసిగా, అలా గుడ్లప్పచెప్పి చూస్తూ నుంచుంటావేం ? ఐసా-అదీ— [ఇద్దరూ కలిసి నారాయణని లేవదీసి కూర్చోబెడతారు]

నారా : ఏమిటి ఈ గందరగోళమంతాను? [జార్లాపడి కూర్చుని] ఈవి డెవరు ?

నిర్మల : మీ కిప్పు డేమిటి బాధ ?

నారా : మీ రలా నా కెదురుగా నుంచుని యీ హంగామా అంతా చెయ్యడమే....

నిర్మల : మీరు త్రాగిన దేమిటి ?

నారా : ఆ విషయం మీ కెందుకు ? అది నా అంతరంగిక విషయం.

నా-తండ్రి : తప్పురా నాయనా, ఆమె ఎవరనుకుంటున్నావు ? డాక్టరుగారు.

నారా : [ఆశ్చర్యంగా] ఏమిటి ! - ఏమిరా సీతయ్యా ?

సీతయ్య : నిజమేరా, నారాయణా.

నారా : అయితే నాకేం ప్రాణంమీద కొచ్చిందనుకున్నా రేమిటండీ, నాన్నగారు, డాక్టర్ని పిలిపించారు ?

సీతయ్య : మరి నువ్వ దేదో త్రాగి మూర్ఛిల్లావు కాదుట్రా ?

నిర్మల : ఈయన కింకా తెలివి బాగా రాలేదు—ఏదీ ఒకసారి లేచి నిలబడండి.

నారా : [మొండిగా] ఏమిటిది, నేను నిలబడను.

నా-తండ్రి : నారాయణా! [వారిస్తాడు]

నారా : ఏమిటండి మరి, అసలే నా హృదయం—

నిర్మల : అదే పరీక్షిస్తాను—బట్టలు విప్పండి-

నారా : [విస్మయంతో] ఏమిటీ! ఏమి టన్నారు?

నిర్మల : సీతయ్యగారూ—

సీతయ్య : వస్తున్నానండి. [నారాయణ కోటు లాగేస్తాడు]

నిర్మల : ఆ చొక్కా కూడాను -

నారా : [సీతయ్య తన చొక్కాకూడా విప్పడానికి ముందుకి రావడం చూసి] ఉండు, వుండు. ఏమిట్రా సీతయ్యా జంతువులాగా?

నిర్మల : త్వరగా.

నా-తండ్రి : చొక్కా విప్పెయ్యరా, నాయనా, డాక్టరుగారు చెపుతోన్నప్పుడు-

నారా : నే ననేదీ, ఎలాగ?

సీతయ్య : ఎలాగేమిట్రా?

నారా : అది అంత అవసరమంటారా?

నిర్మల : ముఖ్యంగా—

నారా : కాని-

నిర్మల : ఏం, సిగ్గుపడతారేం?

నారా : ఏం చెయ్యమన్నారు? లేకపోతే సంతోషించమన్నారా? మీ ఎదురుగుండా మర్యాదగా ఉండదేమో అని—

నిర్మల : జబ్బు నయ మవడం ముందు, మర్యాదలు తరవాత—

నారా : నా కిప్పుడేం జబ్బులేదు. నేను సంపూర్ణారోగ్యంతో తుల తూగుతున్నాను ; సరా ?

నిర్మల : ఆ సంగతి నేను నిర్ణయించాలి.

నారా : అయితే—

నిర్మల : ఊఁ.

నారా : లోపల బనియను లేదు మరి, చెప్పేస్తున్నాను.

నిర్మల : ఫరవాలేదు.

నారా : [చొక్కా తీసి] సరే కానియ్యండి- [ముడుచుకుని కూర్చుంటాడు]

నిర్మల : [స్టెతస్కోప్‌తో గుండెలు పరీక్షిస్తూ] ఊపిరి గట్టిగా తీసి వదలండి—చలివేస్తోందా ?

నారా : గుడ్డలన్నీ విప్పించేశారు, ఈ నడి శీతాకాలంలో అర్ధరాత్రి వేళ చలెయ్యదూ ? అదొక జబ్బా ?

నిర్మల : ఎక్కువగా మాట్లాడకండి.... ఊఁ.. మీ రిదివర కెంతమందిని ప్రేమించారు ?

నారా : ఏమన్నారు ?

నిర్మల : మీ రిదివరకు ఎంతమంది అమ్మాయిలకి మీ నీరసమైన హృదయం అర్పించారు అని—

నా-తండ్రి : ఏమండమ్మా, అంత నీరసంగా వుందా మావాడి గుండె ?

సీతయ్య : ఇది ముక్కస్య ముక్క హృదయం కాదండి,— ప్రేమ స్థావరం, వలపు పట్టూ అదీని—

నిర్మల : మాట్లాడరేం ?

నారా : అలాంటి విషయాలు మీ దగ్గర ఎలాగ చెప్పడం ?

నిర్మల : [ఊపిరితిత్తులు పరీక్షిస్తూ] ఫరవాలేదు. డాక్టర్ల దగ్గర ఏమీ దాచకూడదు- ఇంతకీ నేను మిమ్మల్ని ప్రేమించడం లేదుగా ?

సీతయ్య : బాగా సెలవిచ్చారు.

నారా : నన్నుగురించి ఆ కన్యకామణుల అభిప్రాయ మేమిటో పూచీ ఇవ్వలేను గాని, నేను ప్రేమించిన అమ్మాయిలు—

నిర్మల : "నైన్టీనైన్" అనండి—

నారా : అమ్మయ్యో ! అబ్బే. అందులో సగమైనా వుండరు, తొంభై తొమ్మండుగురే ! అమ్మనాయనో—

నిర్మల : "నైన్టీనైన్" అని అనండి దయచేసి—

నారా : ఓహో, నేనూ .... అంటే ఇంకా నాకూ .... అయితే, "నైన్టీనైన్"

నిర్మల : [స్టెతస్కోపు మడిచి భుజంమీద వేసుకుని] థాంక్యూ ! మీ ఊపిరి తిత్తులు బాగానే వున్నాయి.... [సీతయ్యతో] మీ ఇంట్లో కొత్తసున్నం వుందా ?

సన్యాసి : తమలపాకుల్లో వేసుకునేదేనాండి, అమ్మగారూ ?

నిర్మల : అవును.

నా-తండ్రి : ఓ, బోలెడుందండి. నా కాలికి పట్టు వేస్తారా ?

సీతయ్య : బెల్లం కావాలాండి ?

నిర్మల : అక్కర్లేదు సున్నం తెప్పించండి వెంటనే.

సన్యాసి : ఒక కుండెడు తెప్పించమని సెలవాండి, అమ్మా ?

నిర్మల : తొందరగా—

సీతయ్య : సున్నం ఎందుకు ?

నిర్మల : ఈయన యాసిడ్ త్రాగేడు అంటున్నారు కదూ ? దానికి విరుగుడు సున్నం! మీ నారాయణగారిచేత అది తినిపించాలి ముందు !

నారా : [విస్మయంతో] ఏమిటి ?

సీతయ్య : అవునురా, అన్నట్టు నారాయణా ; కెమిస్ట్రీలో చదువుకున్నాం కాదూ ?

నారా : ఒరే, సీతయ్యా--

సీతయ్య : భయం లేదురా, నారాయణ.

నారా : నువ్వు వట్టి బుద్ధిహీనుడవురా !

సీతయ్య : ఎందుచేత ? ఏం ?

నారా : ఇంతేనా నీ తెలివి తేటలు ? మళ్ళీ ఏదో పెద్ద చదివేనంటావు ? [చొక్కాతో డుక్కుంటూ] ఆమ్లం అంటే పుల్లగా వుండేదేనా ?

సీతయ్య : కాదని ఎవరన్నారు ?

నారా : అయితే నిమ్మకాయకి ఇంకో పేరేమిటి ?

సీతయ్య : జంబీరం—జంబీరమా ? హోర నీ....

నారా : అంతే.... !

నా-తండ్రి : కాస్సేపు ఆ సున్నం వచ్చేదాకా ఆ ధోరణి తగ్గించి నిమ్మళంగా వుండరా, నాయనా.

నారా : నేను జంబీరామ్లం పుచ్చుకున్నానూ అంటే పంచదార వేసిన నిమ్మపళ్ళరసం సేవించాను అన్నమాట! అది త్రాగేసరికి నాకు చల్లగా నిద్దరట్టిపోయి వూరుకుంది. దీనికోసం పెద్ద యాసిడ్ అని పేరెట్టి నాచేత కొత్తసున్నం బొక్కించడానికా యీ డాక్టర్ని తీసుకొచ్చి ఇంత హడావిడి చేస్తున్నారు?

నా-తండ్రి : ఏమిటి!—నువ్వు ఆరోగ్యంగానే వున్నావురా, అబ్బీ, ఇంత సేపూను? నీ కోసం ఎంత హడలిపోయి బెంగెట్టుకు పోయామురా, నిజంగాను?

సీతయ్య : సున్నం తినవలసివస్తుందని వీ డిప్పు డిదంతా చెప్పేడు గాని లేకపోతేనాండి—

నిర్మల : చూడండి, ఇంక నేను వచ్చిన పని అయిపోయింది. మీ నారాయణకి ఒక ప్రిస్క్రిప్షన్ ఇస్తాను.

నా-తండ్రి : అయ్యో, ఇంతకంటేనాండి: ఇవ్వండమ్మా, మళ్ళీ ఇలాటి దెప్పుడూ రాకుండాను.

నిర్మల : ఇతని కొక చక్కని సుశీల నెక్కడైనా చూసి పెందరాళే పెళ్ళి చేయించండి.

నా-తండ్రి : ఒక చక్కని ఎవరనీ అన్నారు?

నిర్మల : సుశీలని—

నారా : చూశారా, నాన్నగారూ?

నా-తండ్రి : ఏమోయ్, సీతయ్యా?

సీతయ్య : అబ్బే లాభంలేదండి. ఆవిడమూలానే కాదండీ మన కిప్పుడింతేసి పనులు పుట్టాయి?

నిర్మల : అదేమిటి ?

సీతయ్య : మావాడు సుశీలని ప్రేమించాడు లెండి.

నారా : గాఢంగా అని చెప్పరా, సీతయ్యా; దాచకూడదు.

సీతయ్య : గాఢంగానండి- మా నారాయణ ప్రేమజలధిలో గజఈత గాడు లెండి ! కాని, ఆమె వీణ్ణి త్రోసిరాజంది.

నిర్మల : అదా ? సుశీల అంటే ఆ సుశీలేకాదు. ఎవరైనా చక్కనిపిల్ల అని నా వుద్దేశం.

నా-తండ్రి : చూశావుట్రా, నారాయణా, ఆమె ఎమంటున్నారోను ? నే నప్పుడు విశ్వనాధంబావగారి పిల్లని కుదిర్చి చేసుకోరా అని ముద్దుగా చెపితే, అర్థ ఆ తాసీల్దారుగారి అమ్మాయిని ప్రేమిస్తున్నాను అని భీష్మించావు. ఆ తరవాత ఇంకో ప్రమీల అనీ, యీ సుశీల అనీ ఇలా ఇదవుతున్నావు.

నారా : ఏమిటో నాకీ గొడవేమీ అర్థం కావడం లేదండి, నాన్నగారూ. మీ రలా అంటే నా మనస్సుకు కష్టంగా వుంటుంది.

నిర్మల : నేనింక వెడతాను మరి, చాలా కాలాతీతం అయిపోయింది.

సీతయ్య : ఆ చేత్తో నాకు కూడా ఒక మంచి ప్రిస్క్రిప్షన్ ఇచ్చి వెళ్ళరూ!

నిర్మల : మీ కింకా అవసరం లేదు.

సీతయ్య : అబ్బే ! ఉండండి బాబూ, మీ రింకా గ్రహించలేదు. మీ ఆసుపత్రికి రమ్మన్నారా ?

నిర్మల : అవసరం లేదు. తరవాత నేను చెబుతానుగా—

సీతయ్య : ఏమిటి, నిజమే ?

నిర్మల : అన్నట్టు మీ అడ్రసు ఏమిటి ?

సీతయ్య : [సంతోషంతో] నే నెంత ధన్యుణ్ణి! [జేబులోంచి తీసి] ఇదిగో నా లెటర్ హెడ్డు. నా కప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తోంటారు అనుకుంటాను ?

నిర్మల : నా కదే పని. నా బిల్లు ఎక్కడికి పంపించాలో తెలియక అడిగాను- థాంక్స్. నే వస్తానండి.

సీతయ్య : అంతే అంటారా?

నిర్మల : అంతే. [సన్యాసితో] ఏయ్ అబ్బాయ్, నాతో బండిదాకా రా.

సన్యాసి : [మెడిసిన్ ఛెస్టు తీస్తూ] చిత్త మండి.

సీతయ్య : ఒరేయ్, సన్యాసీ అదలా వుంచు.—పోనీ మీ ఛెస్టు అయినా బండిదాకా నన్ను పట్టుకు రానియ్యండి.

నిర్మల : మీ కెందుకులెండి శ్రమ ; వీడు తీసుకొస్తాడు.

డాక్టరు-నిర్మల, సన్యాసి నిష్క్రమిస్తారు. -నారాయణ, అతని తండ్రి లేచినుంచుంటారు.

సీతయ్య : అసలు ఈవిడికి హృదయం లేదనుకుంటాను.

నా-తండ్రి : నారాయణా, సీతయ్యా, [ఇద్దరి భుజాలమీద చేతులు వేసి దగ్గరగా తీసుకుని] నాయనలారా, మనం ఇవాళ చాలా అదృష్టవంతుల మనుకోండి నిజంగాను!

సీతయ్య : ఇదేమిటీవేళ ? నాకుగూడా నిగ్రహం తప్పిపోయి ఆమెతో ఏదో పిచ్చిపిచ్చిగా మాట్లాడేను! నాకే సిగ్గేస్తోం దిప్పుడు తల్చుకుంటేను- ఇదంతా మన నారాయణ ప్రభావమో, పుష్పబాణ విలాసమో మరి.

నారా : [పకపకనవ్వుతాడు] (తెర పడుతుంది)

---

## పాత్రలు:

| | | |
|---|---|---|
| కాంతయ్య | : | వకీలు |
| మాధవరావు | : | కాంతయ్య బావమరది |
| శేషగిరి | : | మాధవరావు స్నేహితుడు |
| సుందరమ్మ | : | కాంతయ్య భార్య ; మాధవరావుకి అక్క |
| రాధ | : | కాంతయ్య కూతురు. |
| (పోస్టు జవాను) | | |

# రాధా మాధవం

:o:

## ఒకటవ రంగం

కాంతయ్యగారి గృహం - సాయంకాలం - కచేరీ సావడిలో- ఒక టేబుల్, దానిచుట్టూ నాలుగు కుర్చీలు, గోడకి ఒకవైపున ఒక సోఫా, మరొక వైపున "లా" పుస్తకాలతో నిండిన రెండు బీరువాలు వుంటాయి. కాంతయ్యగారి భావమరది మాధవరావు కూర్చుని పాడుకుంటూ వుంటాడు. అతని వయస్సు 21 ఏళ్ళు. కొంచెం పొడవుగా, బలంగా వుంటాడు. తెలివైన వాడు. తెల్లని పైజామా, సిల్కుషర్టు వేసుకుని వుంటాడు.

మాధవరావు : [పాట]

కొండ కోనలో కోయిల కూస్తే
గుండె జారి పోయిందె! (కో! కో!!)—గుండె....
చందమామ మోము చాన, చూస్తే,
సరసలేకపోయావేమే?.... కొండ కోనలో........

మొండి గోడ మీద ముళ్ళ కంచెలు
మొగ్గలు వేశాయే!
పండుతమలపాకు చాయదానా!
పరిమళములు విరిసేశాయే!!.... కొండ కోనలో....

రాధ : [వయస్సు 18 ఏళ్ళు. కొంచెం పొట్టిగావున్నా, నిండుగా వుంటుంది. పండుతమలపాకు శరీర చ్ఛాయ. ఆకర్షణీయమైన దుస్తులు వేసుకుని వుంటుంది. చాలా చురుకైనది. [ప్రవేశించి] మామా, టీ ఇదుగో- [టీ కప్పు, సాసరు బల్లమీద పెడుతుంది.]

మాధ : థాంక్యూ, డియర్ !

రాధ : ఏమిటి మామా, ఇవాళ చాలా హుషారుగా వున్నావు? ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నట్టుండే వాడివి, సైగల్ లాగ పాడేస్తున్నావే!

మాధ : మీ నాన్న మెడ్రాసు వెళ్లాడు కాదూ? ఏమిటో, బావ వూళ్ళో వుంటే నా కేదో ముళ్ళమీద వున్నట్టు వుంటుంది, ఈ యింట్లో, రాధా, నేను డబ్బు లేని వాణ్ణని నన్ను పురుగుని చూసినట్టు చూస్తాడు అతను. మీ తాతయ్య నా కేమీ లేకుండా చేసి చచ్చిపోతే, ఆ తప్పు నాదా చెప్పు?

రాధ : అలాగ అనుకోకు, మామా. నాన్నని లెక్కచెయ్య కూడదు నువ్వు. నేనూ, అమ్మా వున్నాంగా, నీ కేం లోటు?

మాధ : బి. ఏ. పేసయానా; నా కేదైనా ఉద్యోగం కూడా అయిపోతే, నా బాధ బావ కింక లేకపోను.

రాధ : ఉద్యోగమైనా నువ్విక్కడే వుండిపోవాలి, మామా. నాన్న కేం తెలుసు: వట్టి చాదస్తుడు. అమ్మ అనేకసార్లు ఏడుస్తూ వుంటుంది, నువ్వంటే నాన్నకి ఇష్టం లేదని.

మాధ : ఇంట్లో మొగాడికి ఇష్టం లేకపోయాక, ఆడవాళ్ళ ఏడ్పు మాత్రం ఏం ప్రయోజనం, రాధా?

రాధ : ఎలాగ, మామా, మరి?

మాధ : ఏమి ఎలాగ?

రాధ : నిన్న వూరికి వెళ్ళే ముందర నన్నెన్ని మాటలు అన్నాడనుకున్నావు నాన్న? నాకు పద్దెనిమిది ఏళ్ళు నెత్తికి వచ్చాయట. నన్ను ఇంటర్‌దాకా చదివించడమే అసలు తప్పు చేశాడట. ఆడ

దానికి చదువు అనవసరమట. నాకు చిన్నప్పుడే పెళ్ళి చేసెయ్య వలసిందట. నేను తనకి గుండెల మీద కుంపటినిట—

మాధ : బావకి గుండెలు లేవు, రాధా.

రాధ : ఇంకా వుండు: నీతో నేను చనువుగా మాట్లాడ కూడదుట. నేనూ, అమ్మా కలిసి ఏదో గూడుపుఠాణీ చేస్తున్నాముట. ఇంకా ఏమిటేమిటో అని చెండుకున్నాడు.

మాధ : అవును, రాధా, బాధగానే వుంటుంది, నే నేం చెయ్యగలను ?

రాధ : చదువు నేనే మానేస్తాను, మామా.

మాధ : నయమే, మంచి పనే చేస్తావు !

రాధ : అది కాదు, మామా, మొన్న నేను సెలవలకి ఇంటికి వచ్చే టప్పుడు, వా డెవడో శేషగిరిట— సెప్టెంబరు పరీక్షలకి వచ్చాడు. నాకో ఉత్తరం వ్రాసి యిచ్చాడు : వాణ్ణి చంపేద్దామన్నంత కోపం వచ్చింది నా కప్పుడు.

మాధ : ఎవరు ? శేషగిరా అన్నావు ? సెప్టెంబరు ఛాన్సుకి వచ్చాడా ?

రాధ : అవును - ఈడ్యట్ !

మాధ : నేనే ?

రాధ : [నవ్వి] అబ్బ, నువ్వెప్పుడూ ఇంతే—వాడూ- నా కోపం అంతా పోతోంది మరి-

మాధ : రాధా, ఆ శేషగిరి నాతో బి. ఏ. చదివాడు ; మనవాడే ; చాలా తెలివైనవాడు.

రాధ : వాడి తెలివి తేటలు తెలుస్తూనే వున్నాయిగా ?

మాధ : నువ్వు ఫలానా అని తెలిసి వుండదు వాడికి. పైగా, మొగ కుర్రాళ్ళు ఉత్తరం వ్రాస్తే గర్వపడాలిగాని, కోపగిస్తారా ? అసలు, నాలుగు వందలమంది మొగాళ్ళతో కలిసి నలుగురే ఆడవాళ్ళు చదువుతూ వుండడం మూలాని ఇలాంటి చిక్కులు వస్తూ వుంటాయి. అందుచేత చదువుకునే ఆడవాళ్ళ సంఖ్య పెరగాలి, ఏమంటావు ?

రాధ : మరి నా హృదయంలో నిండి వున్న నీ—

మాధ : పాపం, ఆ శేషగిరికి కూడా ఒక హృదయం వుంటుంది, రాధా. మీ నాన్నకి తప్ప అందరికీ హృదయాలు వుంటాయి.— అక్కయ్య ఏం చేస్తోంది ?

రాధ : అమ్మేనా ? వంటయింట్లో టీ చేస్తోంది.

మాధ : అన్నట్టు, నేను టీ త్రాగడం మరిచేపోయాను. [సాసరులో కప్పు తీసి త్రాగుతాడు]

రాధ : [కొంచెం వూరుకుని] మామా !

మాధ : [టీ కప్పు బల్లమీద పెట్టి] ఆఁ—

రాధ : నువ్వింతకు ముందు ఎవర్నైనా ప్రేమించావా ?

మాధ : వెర్రి పిల్లా !

రాధ : అబ్బ, చెపుదూ. [దగ్గరగా వచ్చి కూర్చుంటుంది]

మాధ : చెపుతానుగాని, వుండు ; అంత దగ్గరగా కూర్చోకు మరి : బావ ఇంకా ఎక్కడైనా దాక్కుని మనకేసి చూస్తున్నాడేమో అని భయం వేస్తుంది నాకు !

రాధ : [కొంచెం జరిగి] సరేలేగాని- ఈసారి చెప్పు మరి—

మాధ : ఏమిటి ?

రాధ : నువ్వు ఎవర్నైనా ప్రేమించావా ?

మాధ : నా చేత అబద్ధ మాడించడం ఏం సరదా నీకు ?

రాధ : అమ్మా, అంటే ఎవర్నో ప్రేమిస్తున్నా వన్నమాట!

మాధ : అమ్మా అంటేకాదు-

రాధ : నిజం చెప్పవూ ? ప్రేమిస్తున్నావా ?

మాధ : ఆ!

రాధ : గాఢంగా ?

మాధ : ఆ!

రాధ : చిన్నప్పటినించీ ప్రేమిస్తున్నావా ?

మాధ : ఆహా—

రాధ : ఆమెని నేను ఎరుగుదునా ?

మాధ : ఆ!

రాధ : బాగా చదువుకుందా ?

మాధ : ఆ!

రాధ : చూశావా ? నిజమే ? నాకంటే అందంగా వుంటుందా ?

మాధ : ఆ! [కంగారుగా] అన్నట్టు, వుండదు.

రాధ : ఎవర్ని చెప్పవు, మామా ?

మాధ : నీ కెందు కామె సంగతి ?

రాధ : నేను కూడా ఆమెలాగ వుండడానికి ప్రయత్నిస్తాను-

మాధ : ప్రయత్నించ నవసరంలేదులే-

రాధ : నన్నింక ఏడిపించకు, మామా ; చెప్పవూ ఆమెపేరు ?

మాధ : చెపితే నమ్మవు.

రాధ : ఫరవాలేదు, చెప్పు.

మాధ : రాధ !

రాధ : [సిగ్గు, సంతోషంతో] అమ్మదొంగా ! చంపేశావు !

మాధ : అయితేమాత్రం ఏంలాభం, రాధా ? బావకి డబ్బుమీద ఆశ.

రాధ : అబ్బ, ఇలాంటి సమయంలో నాన్న సంగ తెత్తకు, మామా. ఇప్పుడంటే తను ప్లీడరీచేసి డబ్బు సంపాదించాడు గాని, అమ్మని పెళ్ళి చేసుకునే నాటికి అతని కేమీ లేదుటగా ?

మాధ : ఆ రోజు లిప్పుడు జ్ఞాపకం వుంటాయా ?

రాధ : మామా, గోడమీద ప్రాకిన ఆ రాధామనోహరం తీగచూడు, ఎలా చితక పూసిందో !

మాధ : అవును, నీకు మల్లేనే నిండుగావుంది !

రాధ : [పాటగా]

"రాధామనోహరం పువ్వులు !
మాధవుడుమామ చిరునవ్వులు ! !" [నవ్వి] ఎలావుంది ?

మాధ : [పాటగా]

"రాధామనోహరం మొగ్గలు !
రాధ సొట్టలుపడే బుగ్గలు ! !" [వెక్కిరింపుగా నవ్వి] ఇదె

లాగ వుంది ?

రాధ : "రాధా మనోహరం పువ్వులు !"

మాధ : "రాధామనోహరం మొగ్గలు !!" [ఇద్దరూ పకపక నవ్వుతారు]

తలుపుతీసి రాధతల్లి సుందరమ్మ- వయస్సు 45 ఏళ్ళు, పచ్చగా, బొద్దుగా వుంటుంది- ప్రవేశిస్తుంది.

మాధ : బావ !

సుంద : పాడుకోండి, నాయనా. పాడుకోండి !

రాధ : అమ్మా, చూడవే, నేను రాధామనోహరం తీగలాగ వున్నానంటున్నాడు మామ !

మాధ : లేదే, సుందరం అక్కయ్య ; లేకపోతే, మా-శే—

రాధ : [కోపం అభినయిస్తూ] ఇదుగో మరి—

సుంద : ఏమిట్రా, తమ్ముడూ, మళ్ళీ దాన్ని ఉడికిస్తున్నావా ?

రాధ :
మాధ : } [ఒక్క సారిగా] లేదే !

సుంద : ఒరే, తమ్ముడూ, చిల్లో బొల్లో మంటూ మీ రిద్దరూ చిలుకాగోరింకల్లాగ ఇలా నట్టింట్లో సుఖంగా వుండడం నే నెప్పటికైనా చూస్తానంటావా ?

రాధ : ఇప్పుడు వున్నాం కాదూ ?

మాధ : ఇప్పుడు తీగ అన్నందు కింత అయిందా ? ఇంక నువ్వు చిలకా గోరింకా అన్నావంటే——

సుంద : అబ్బే. మీ కింకా చిన్నతనం వదలలేదర్రా. ఇలా ఎన్నాళ్ళని వుంటారు ? లోకులో ?

రాధ : నాన్నో ?

సుంద : అన్నట్టు, తమ్ముడూ, మీ బావ మెడ్రాస్ ఎందుకు వెళ్ళారో నీకు తెలుసా ?

మాధ : దీనికి ప్రశ్న ఎందుకు ? కోర్టుపనిమీద—

సుంద : అబ్బే, కాదు, చెన్నపట్టణంలో ఏదో సంబంధం వుంది, చూసి వస్తానని వెళ్ళారు.

మాధ : రాధకే ! ?

రాధ : [కోపంగా] నాకు అక్కర్లేదు, పాడు సంబంధాలు !

సుంద : అసలు రెండు రోజులనించి ఎవరో పిల్లని చూసుకోడానికి వస్తారని కూడా అంటున్నారు.

మాధ : రాధ తలవొంచుకుని కూర్చుని హార్మోనియమూ అవీ వాయిస్తుంది కాబోలు !

రాధ : ఆ వచ్చినవాడి నెత్తిమీద వాయిస్తాను !

సుంద : ఉండవమ్మా, నేను మాత్రం ఒప్పుకుంటానా, అలాంటి దేదైనా వస్తే ఏ నూతిలోనైనా దిగుతానుగాని ?

రాధ : నిజంగా దిగకేవ్ ; ఊరికే బెదిరించు నాన్నని, అంతే.

మాధ : అబ్బో, ఇలాంటి వాటికి బెదిరే ఘటం కాదు మీ నాన్నది !

సుంద : చిన్నప్పటినించీ నిన్ను దగ్గరకి తీసి చదువు చెప్పించానా ? ఆయన మాత్రం ఏదో తల్లిదండ్రులు లేనివాడుగదా అని జాలిపడి ఈ ఖర్చుకి ఒప్పుకున్నారు. కాని, రాధకీ, నీకూ పెళ్ళి చేద్దాం అని నేను ఎప్పుడైనా అన్నానో, నామీద మండిపడి, 'చూసిచూసి ఒక్క దమ్మిడీ అయినా లేని సన్యాసికిచ్చి పిల్ల గొంతుకెలా కొయ్యను ?' అని తప్పించుకుంటూ వుంటారు.

రాధ : ఏమిటి, మామని పెళ్లి చేసుకుంటే నా గొంతుక తెగుతుందంటాడా? నాన్న కళ్ళకి మామ కత్తిపీటలాగ కనపడతాడనుకుంటాను!

మాధ : అదేమిటి, రాధా, బావ మండిపడతాడంటే, అతను కొరకంచు అన్న మాటా?

సుంద : అదికాదు; బాగా నగలు పెట్టే మొగుడు వచ్చి పీకికి బాంగారపు ఉరి వేస్తే మంచిదని ఆయన ఉద్దేశం!- ఆఁ, ఇంకిప్పుడు వారం పది రోజుల్లో తొందరగా ఏదో సంబంధం వెతికివేసి రాధకి పెళ్ళి చేసెయ్యాలని మొండిపట్టు పట్టుకుని కూర్చున్నారు.

రాధ : మామా, మనం చెప్పకుండా ఏవూరైనా వెళ్ళిపోదామా?

సుంద : ఉండు, తల్లీ!— అందుచేత, తమ్ముడూ, నువ్విప్పుడు రాధని వెంటనే పెళ్ళి చేసేసుకోవాలి.

మాధ : పెళ్ళంటే చేసుకోవడం నా చేతుల్లో వుందిగాని, ఇప్పుడు అర్జాంతరంగా పది వేలు పట్టుకొచ్చి బావ కెక్కడ చూపించగలనే బాబూ?

సుంద : మీ బావ కింక నేను బ్రతికి వుండగా మంచీ చెడ్డా తెలిసి రావురా-

మాధ : అతను బ్రతికి వుండగాను—

రాధ : ఏం, మామా, ఎక్కడికైనా వెళ్ళిపోయి హాయిగా వుందాం!

మాధ : ప్రయాణపు ఖర్చులో, వెర్రిదానా?

సుంద : అందుకు నా కొక ఉపాయం తోచింది—

మాధ : ఏమిటది?

సుంద : పెద్దక్కయ్య రాధని ఒక సారి చూడాలని వుందని వూరికే ఇదవుతూ పదే పదే వ్రాస్తోంది. నువ్వు రాధని అక్కడికి తీసుక

వెళ్ళు. నేనూ దానికి వ్రాస్తాను : మీ పెళ్ళి ఏర్పాట్లన్నీ అదే చేస్తుంది.

మాధ : బావో మరి ? మమ్మల్ని వేటాడెయ్యడూ ?

సుంద : బావకి నే నేదో విధంగా సద్ది చెబుతాను. మీరు స్వేచ్ఛగా పెళ్ళి చేసుకోవచ్చు. అంతేగాని, నా కంఠంలో వూపిరి వుండగా రాధని పైవాడి కెవ్వడికీ యివ్వనివ్వను. అదీకాక, పెద్దక్కయ్య అంటే మీ బావకి కొంచెం భయం వుందిలే—

రాధ : అమ్మా, పెద్దక్కయ్య ఎంత మంచిదే!

మాధ : అవునుగాని, అక్కయ్యా, పెద్దక్కయ్య పిల్లలు లేరని, నన్ను పెంచుకోవాలని అంటోందిట, నిజమేనా ?

సుంద : పెంచుకుంటే ఏ చిక్కూ లేకపోను మనికి : బోలెడు ఆస్తి దిగబెట్టి పోయాడు దాని మొగుడు.

రాధ : ఇంతకీ నాన్న తిరిగి ఎప్పుడు వస్తాడు ?

సుంద : రేపో, ఎల్లుండో వచ్చేస్తారు. కనుక, మీ రిద్దరూ రేపు ప్రొద్దున్నే మెయిలులో ప్రయాణం ; బట్టలూ, అవీ సద్దుకోండి మరి.

మాధ : అక్కయ్యా, నువ్వెంతో మంచిదానవే!

రాధ : మామా, కోకిల కూస్తే బాగుంటుందా, మెయిలు కూస్తే బాగుంటుందా ?

ఒక జట్కా బండి ఇంటి ముందు ఆగుతుంది

సుంద : బండి ఏదో వచ్చింది ; మీ బావ కోసం ఎవరో వచ్చినట్టున్నారు.

మాధ : రాధకి పెళ్ళివారేమో!

రాధ : ఛీ! చూశావుటే, అమ్మా—

వీధిలోనుంచి "కాంతయ్యగారి యిల్లు ఇదేనాండి" అని ఎవరో కేకవేసి అడుగుతారు

మాధ : ఆ; ఇదే.

సుంద : రావే, అమ్మాయీ లోపలికి పోదాం. [వీధి గేటుకేసి చూసి] ఎవరో చిన్నవాడే!

రాధ : పెళ్ళికొడుకైతే చంపుతా!

సుంద : తప్పు; లోపలికిరా. [ఇద్దరూ నిష్క్రమిస్తారు]

వ్యక్తి : [వయస్సు 23 ఏళ్ళు. ఎర్రగా, పొడవుగా వుంటాడు. హుషారైన వాడు. గుమ్మం దగ్గరికి వచ్చి] పంతులుగారు వున్నారాండి?

మాధ : [ఆశ్చర్యంతో] హల్లో, ఏమిరోయ్, శేషూ! ఇలాగ వచ్చావేమిటి? ఎన్నాళ్ళకి!

శేష : సరి. ఇదుగో, మాధవా, నువ్విక్కడ వున్నావేం? ఈ కాంతయ్య గారిని బాగా ఎరుగుదువేమిటి?

మాధ : ఆ, కొంచెం ఎరుగుదును. [శేషగిరిని లోపలికి తీసుకువచ్చి] ముందు ఆ సూట్ కేస్ అలాపెట్టి కొంచెం స్థిమితపడు. మంచినీళ్ళు కావాలా?

శేష : [అలసిపోయినట్టు] ఉష్!.... అక్కర్లేదు. [సూట్ కేస్ గోడవార పెట్టి, ఒక కుర్చీలో కూర్చుని] అమ్మయ్య. వెధవ రైలు—

మాధ : ఊం. ఏమిటి, మెడ్రాస్ నుంచేవా? పరీక్ష బాగా వ్రాశావా?

శేష : ఆ, ఏదో వ్రాశానులే. అయితే, ఈయన—

మాధ : ఎవరు, కాంతయ్యగారేనా? నిన్ననే మెడ్రాస్ వెళ్ళారు.

శేషు : ఆఁ ! పాపం, నాకోసమే వెళ్ళివుంటారు.

మాధ : ఆయనకీ, నీకూ అంత రాచకార్యం ఏమి వచ్చింది ?

శేషు : అబ్బే, ఈయన నన్ను గురించి చాలా విన్నారుట–

మాధ : అయితే, అంత కీర్తిశేషుడ వయ్యా వన్నమాట ఈ మధ్యని ?

శేషు : ఆఁ అఁ, నిరుడు టెన్నిస్ ఛాంపియన్‌షిప్ కొట్టాను కాదూ ? ఈయన మా నాన్నని కూడా పూర్వం కొంచెం ఎరుగునుట ; అంచేత—

మాధ : సంప్రదాయం నచ్చిందన్నమాట ; డబ్బు సంగతి కూడా వాకబు చేసేవుంటాడు ?

శేషు : అయితే, అంతా నీకు తెలుసునన్న మాట. నాకు నెల్లాళ్ళనించి వుత్తరం మీద వుత్తరం వ్రాస్తున్నారు, ఒకసారి వచ్చి పిల్లని చూసుకుని వెళ్ళమని–

మాధ : ["చెల్ చెల్ రే నవ్‌జవాన్" అనే పాట ఈలలో పాడతాడు]

శేషు : అదేమిటి ?

మాధ : [ఈల ఆపి] ఏమీలేదు—నువ్వు మీ వూరు వెడుతూ, పోనీ దారిగదా, ఏదో తమాషా చూడవచ్చునని ఇక్కడ ఒకసారి దిగావు : అవునా ?

శేషు : సరీగ్గాను. కాని-

మాధ : ఫరవాలేదు ; పిల్లని చూద్దుగాని-

పోస్టు జవాను మాధవుడికి ఒక ఉత్తరం యిచ్చి వెడతాడు. దాన్ని అతను చదవకుండానే జేబులో పెట్టుకుంటాడు-

శేషు : అయితే, నువ్వు వీళ్ళని బాగా ఎరుగుదువన్న మాట ?

మాధ : [నవ్వుతూ] కాంతయ్యగారు మా బావరా; అంటే మా చిన్న అక్కయ్య మొగుడు. వీళ్ళ యింట్లో వుండేగా నేను చిన్నప్పటి నించీ చదువుకున్నాను?

శేషు : [ఆశ్చర్యంతో] ఏమిటి!

మాధ : [పిలుస్తాడు] రాధా!....రాధా!

శేషు : [మరింత ఆశ్చర్యంతో] ఏమిటి, ఈ అమ్మాయి పేరు రాధా?!

మాధ : ఏం, అందులో తప్పేముందీ?

శేషు : ఏమీలేదు, ఏదో జ్ఞాపకం వచ్చి-

మాధ : ఇప్పుడే అంతా నిన్ను గురించి చెప్పుకుంటున్నాం. [బిగ్గరగా] రాధా! ఒకసారి అర్జెంటుగా ఇలా రావాలి. అమ్మని కొంచెం టీ పెట్టమను—

తలుపు తీసి రాధ ప్రవేశిస్తుంది

శేషు :
రాధ : } [ఒక్కసారిగా ఆశ్చర్యంతో] ఏమిటి, మీరా!

మాధ : ఉండండి; అలాగ కంగారు పడకండి, పరిచయం చేస్తాను: ఒరే శేషూ, నేను మాధవుణ్ణి గదా! ఈమె మా మేనత్త రాధ!

రాధ : ఇతనే మా మేనమామండీ!

శేషు : క్షమించాలి, నన్ను గురించికూడా-

రాధ : అక్కర్లేదు, మిమ్మల్ని నే నెరుగుదును: మీరు ప్రేమ లేఖలు వ్రాసే మెషీను!

మాధ : రాధా, ఇంటికొచ్చిన వాళ్ళ నలా అమర్యాద చెయ్యొచ్చా? ఇతను నాకు స్నేహితుడు; కనుక నీకూ కావలసినవాడే. ప్రస్తుతం నిన్ను చూద్దామని వచ్చాడు.

రాధ : నన్నుకాదు ; నాన్నని చూద్దామని అనుకుంటాను.

శేష : ఆ మాటకొస్తే, ఇద్దర్నీని. మీరు నన్ను క్షమించాలి: నే నా వుత్తరం మనస్సులో ప్రేమలేకుండా, కల్మషం పెట్టుకుని వూరికే సరదాకి వ్రాశానని అనుకుంటున్నారంటే నాకు చాలా అన్యాయం చేసిన వారౌతారు.

రాధ : మనిషి తరహా తెలుసుకోకుండా వుత్తరం వ్రాయడానికి చేసిన మీ సాహసం తల్చుకుంటే నాకు జాలివేస్తోంది.

మాధ : అదీ, అంటే కోపం లేదన్నమాట. మనుషుల్ని అర్థం చేసుకునే పద్ధతి అదీ.

శేష : చూడండి, మీరు నా హృదయాన్ని ఆకర్షించారు ; మీకు వుత్తరం వ్రాసి కనుక్కోకపోతే మీ మనస్సు నాకెలా తెలుస్తుంది, చెప్పండి ?

రాధ : ఇలా ఇదివర కెంతమంది మనస్సులు కనుకున్నారు ? నేను నిజంగా మీ హృదయాన్ని ఆకర్షిస్తే, మరిప్పు డీ పెళ్ళికూతురు చూపుల కెందు కొచ్చారు ? పెళ్ళికూతురు రాధే అని మీకు తెలుసా ?

శేష : నాకుతెలుసు ననలేదే. కాని, నే నీ పెళ్ళికూతుర్ని పెళ్ళి చేసుకుందామనే వుద్దేశంతో రాలేదు. ఇప్పుడే మనవాడితో చెబుతున్నాను : ఏదో తమాషా చూద్దామని వచ్చానని——

మాధ : ఆగండి. నన్నుకూడా కొంచెం మాట్లాడ నివ్వండి- రాధా, శేష చాలా మంచివాడు. ఒరే, శేషూ, అసలు సంగ తేమిటంటే, నేనూ, రాధా పెళ్ళాడాలి !

శేష : రెండు పెళ్ళిళ్ళూ వొక్కసారే అవుతా యన్నమాట ?

రాధ : నేను మామని పెళ్ళి చేసుకుంటున్నా నన్న మాట ; ఒకటే పెళ్ళి : ఇందులో మీకేమీ అవకాశం లేదు పాపం !

మాధ : [మందలిస్తూ] రాధా!

శేషు : అలాగైతే నేను హృదయపూర్వకంగా విరమిస్తున్నాను; Congrats!

రాధ : మీ అభ్యంతరం ఏమీ లేదన్నమాట; మీ ఔదార్యానికి చాలా కృతజ్ఞురాలిని!

మాధ : ఒరేయ్, నాన్నా, నువ్వైనా కొంచెం శాంతించాలి. చూడు, నేనూ, రాధా చిన్నప్పటినుంచీ పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాం. కాని, మా కాంతయ్య బావ కిష్టంలేదు, నేను బీదవాణ్ణని. ఏదో, వూరికే పై సంబంధాలు వెతికేస్తున్నాడు. మా అక్కయ్య—

సుందరమ్మ తలుపుతీసి, రెండు టీ కప్పులు వున్న పళ్ళెం పట్టుకుని ప్రవేశిస్తుంది.

మాధ : అదుగో. రావే, అక్కయ్యా!

సుంద : ఇదుగో, తమ్ముడూ, ఈ టీ అలా పట్టికెళ్ళి వారి కియ్యి.

మాధ : ఫరవాలేదు. ఇతను, శేషగిరి అని నాకు ముఖ్యమైన స్నేహితుడు; చెపుతోవుండే వాణ్ణి కాదూ?

శేషు : నమస్కారమండి!

సుంద : అలాగా, ఎప్పుడూ చూడలేదు. కొంచెం టీ తీసుకో, బాబూ. [పళ్ళెం బల్లమీద పెడుతుంది.]

శేషు : చిత్తం.

మాధ : బావ చేసిన తెలివితక్కువకి ఫలితంగా నేను మా స్నేహితుణ్ణి చాలా కాలానికి మళ్ళీ చూశానన్నమాట.

సుంద : అదేమిటి?

రాధ : ఈయన పెళ్ళికూతురు చూపుల కొచ్చారు! [నవ్వుతుంది]

శేషు : అబ్బే! [వెకిలిగా నవ్వుతాడు.]

సుంద : నే ననుకుంటూనే వున్నాను. ఆయనేదో, మతిలేక మూర్ఖంగా పిలిపించారు; మనస్సులో వుంచుకోకు, బాబూ.

శేషు : ఫరవాలేదండి.

మాధ : అక్కయ్యా, నాకో వుపాయం తోస్తోందే—

సుంద : ఏమిటి ?

మాధ : మేం పొద్దున్న మెయిల్లో తిన్నగా పెద్దక్కయ్యగా రింటికి వెళ్ళటం లేదు. ముందు మా శేషు వూరు వెడతాం. అక్కడ వొక పెద్ద తోటలో వీళ్ళ కొక మంచి బంగాళా వుంది- ఏంరా, శేషూ ?

శేషు : తప్పకుండా రావాలని కోరుతున్నాను; ఇంతకన్నా వుందా—

రాధ : వెళ్లొచ్చంటావా, మామా ?

శేషు : న న్నింక మీరు మనస్ఫూర్తిగా క్షమించాలి. అక్కడ మీకు ఏమీ లోటు లేకుండా చూసే పూచీనాది.

సుంద : క్షమించడ మెందుకు, బాబూ ? ఆయన దీన్ని తమ్ముడికి ఎక్కడ యిచ్చి పెళ్ళి చెయ్యవలసి వస్తుందోనని, మొండి పట్టుదలతో దీనికి తెలియకుండా నిన్ను పిలిపించారు: కడుపులో పెట్టుకోకు, నాయనా

శేషు : ఏం ఫరవాలేదండి.

మాధ : చూడు, మేము ముందరే పెద్దక్కయ్య దగ్గరకి వెడితే, బావ మా వెనకాలే త్రాచుపాములాగ తరుముకు వస్తాడు అక్కడికి. అందుచేత ముం దొక నాలుగు రోజులు మన శేషుగారి బంగాళాలో—

సుంద : బావుంది ; అలాగే కానివ్వండి.— బాబూ, నువ్వూ తమ్ముడూ నాకు ఒకటే. మీ ఉపకారం ఎన్నటికీ మరచిపోలేము. ఒక్కగాక ఒక్క పిల్ల ; దీన్ని ఏ పరాయివాడికి కట్టబెట్టి దీని బ్రతుకంతా అధోగతిపాలు చేస్తారో అని నేను నిజంగా అహోరాత్రాలూ కుమిలిపోతున్నాను. [కళ్ళ నీళ్ళు పెట్టుకుంటుంది]

శేషు : అబ్బే. ఫరవాలేదండి. అక్కగారూ : మీ రలాగ కంట తడి పెట్టుకోకూడదు.

మాధ : శేషూ, భేషు ! అలా వుండాలి కలిసికట్టుతనం ! ఏదీ చెయ్యి ! [అతని చెయ్యి పట్టుకుని వూపుతాడు]

రాధ : శేషగిరిగారూ, ఇప్పుడు మీ రంటే నా కెంతో గౌరవం ఏర్పడింది : నన్ను క్షమించండి.

శేషు : ఇందులో ఏముందండీ పెద్ద ?

మాధ : అక్కయ్యా, బావ రెండు మూడు రోజులదాకా రాడుకాదూ ?

సుంద : ఏమో, మరి—

శేషు : అబ్బే, నేను చెప్పాను కాదూ, ఆయన నా కోసమే వెళ్ళివుంటారని? నేను ఇక్కడికే వచ్చేశాను గనక, ఇంక అక్కడ ఆట్టే రోజులు వుండరు ఆయన- మనం రేపు ఉదయం మెయిలులోనే బయలు దేరాలి.

రాధ : అయితే, అజ్ఞాతవాసానికి అన్నీ సద్దుకుందాం, పదండి.

సుంద : [శేషుతో] కొంచెం టీ పుచ్చుకోవు, నాయనా, చల్లారిపోతోంది ?

శేషు : అలాగేనండి. [టీ కప్పు తీసుకుని కొంచెం త్రాగి] ఈవూళ్ళో మెయిలు ప్రొద్దున్నే ఎన్ని గంటలకి వస్తుందిరా, మాధవా ?

మాధ : కాకులు కూసేటి వేళ గబగబ వచ్చున్ !– లోపలికి పదం డింక–

తెర పడును

## రెండవ రంగం

తెల్లవారుతుంది- రైల్వే స్టేషనులో మెయిలు వచ్చి ఆగుతుంది. ప్రయాణీకుల కలకలం, తినుబండారాలు మున్నగునవి అమ్మేవాళ్ళ కేకలు- రంగస్థలం మీద ఒక ఇంటర్ క్లాసు రైలు పెట్టె సెట్టు కట్టబడి వుంటుంది. బ్యాక్ గ్రౌండ్‌లో రైలుపెట్టె కిటికీలలోనుంచి టెలిగ్రాఫ్ స్తంభాలు, సిగ్నల్స్ స్తంభాలు, దూరంగా చెట్లు కనబడుతూ వుంటాయి. గ్రామఫోన్ రికార్డు, లౌడ్ స్పీకర్ ఏర్పాటులతో ట్రెయిన్ ఆగడం, కదలడం మున్నగు ధ్వనులను కల్పించవచ్చు—మాధవుడు, రాధ, శేషు ప్లాట్ ఫారం మీద సామానుతో ప్రవేశిస్తారు.

మాధ : టిక్కెట్లు కొన్నావురా, శేషూ ?

శేషు : ఆ.—ను వ్వీ పెట్టె పుచ్చుకో. [మాధవుడికి చిన్న సూట్ కేసు ఒకటి అందించి] ఇంటర్ క్లాసు దగ్గరకి పదండి.

మాధ : రాధా, ఇంటర్ ! ఇదుగో, రా మరి-

రాధ : నీ వెనకాలే వస్తున్నాను, మామా.

రైలుపెట్టె తలుపుతీసి పెట్టెలు లోపల పెట్టి, ముగ్గురూ లోపలికి ఎక్కుతారు. శేషు తలుపు వేస్తాడు. గార్డు విజిల్ వేస్తాడు. రైలు కూసి కదులుతుంది. బ్యాక్ గ్రౌండ్‌లో టెలిగ్రాఫ్ స్తంభాలు, చెట్లూ కదలి పరుగెడుతోన్నట్టు కనిపిస్తాయి. ప్లాట్ ఫారంమీద వాళ్ళంతా నిష్క్రమిస్తారు.

మాధ : [రైలు పెట్టెలో సామానులు సర్దుతూ] బావుంది ! మనం ఇంకొక క్షణం ఆలస్యం చేస్తే రైలు దాటిపోను.— రాధా, నువ్వులాగ

ఆ మూల కిటికీ దగ్గర కూర్చో. [ఆ బెంచిమీాదే రెండవ కొసను ఒక వ్యక్తి ముసుగు పెట్టుకుని గుర్రు పెట్టి నిద్రపోతూ వుంటాడు]

శేషు : ఈయన ఎవరో స్వయంగా ముసుగుతన్ని గుర్రు పెడుతున్నా డురా! [ఆ వ్యక్తి ప్రక్కన కూర్చుంటాడు]

రాధ : నాన్నేమో! [నవ్వుతుంది]

మాధ : [రాధ ప్రక్కన కూర్చుంటూ] రాధా, వేళాకోళానికి వేళ వుండాలి. ఇవాళ అసలే నా నరాలు దుర్బలంగా వున్నాయి; నన్ను అలాగ హడలగొట్టకు.

శేషు : ఒరే, దాంపత్యానికి ఇదిట్రా మొదలు?

రాధ : అబ్బ, చలేస్తోంది, మామా— [పమిటకొంగు ఒంటినిండా కప్పుకుంటుంది]

శేషు : ఇంక కొంచెం సేపు ఓపిక పట్టండి; వచ్చే స్టేషనే మా వూరు. అక్కడ దిగామంటే ఎక్కడ చలి అక్కడికి ఎగిరిపోతుంది.

రాధ : ఆయన ఎవరో లేవగొడదామా?

మాధ : [వారిస్తూ] ఉష్! లెట్ స్లీపింగ్ డాగ్స్ లై— నిద్రపోయే కుక్కల్ని పడుకోనివ్వాలి— అన్నట్టు, నిన్నను నా కొక ఉత్తరం వచ్చింది; ఈ హడావడిలో అది చదువుకోడమే మరిచి పోయాను. [జేబులోనించి ఉత్తరం తీసి, చింపి, చదివి సంతోషంతో బిగ్గరగా] భేష్! బ్రతికాం!!

రాధ : [ఆతురతతో] ఎక్కడనించి, మామా?

ఇంతలో నిద్రపోతున్న వ్యక్తి మాధవుడి కేకకి మేలుకుని, కొంచెం మొహంమీాది ముసుగు తీసి ఆవలిస్తూ కళ్లు నులుముకుంటాడు.

మాధ : [నెమ్మదిగా] చచ్చాం!— ఉష్....! ఆ నిద్రపోయే అతను బావ!

రాధ : [ఆ వ్యక్తివైపు పరకాయించి చూసి, రహస్యంగా] అవును, నాన్నే!

శేషు : [నెమ్మదిగా] ఉండండి- ఒరే, నువ్వు ఇలాగ వచ్చి ఈ బల్లమీద కొంచెం దూరంగా కూర్చుని, ఆ కిటికీలోనించి బయటి ప్రకృతి సౌందర్యం విలోకిస్తూ వుండు; తెలిసిందికాదూ? ఊఁ, త్వరగా [మాధవుడు చప్పున లేచి, ప్రక్కనవున్న బల్లమీద కూర్చుంటాడు.] రాధగారూ, కంగారు పడకండి. మీరు పమిటచెంగు మరింత నిండా ముసుగు వేసుకొని— మొహం కనపడకుండా— నాకు దగ్గరగా జరిగి కూర్చోండి. అటువైపు చూడకండి; తరవాత సంగతి నేను చూస్తాను. గప్‌చిప్, కామోష్!

వ్యక్తి : [వయస్సు 50 ఏళ్ళు; నల్లగా, లావుగా పొట్టిగా వుంటాడు- కళ్ళు నులుముకుంటూ బద్ధకంగా లేచి, ఆవలిస్తూ] ఇదే స్టేషను బాబూ? [శేషుని అడుగుతాడు.]

శేషు : ఇప్పుడే ఏలూరు దాటామండి.

వ్యక్తి : [కంగారు పడుతూ] అయ్యో, అయ్యో, నా నిద్దర వల్లకాడుగాను! చచ్చాను! ఇప్పుడు నేనేం చెయ్యను? గొలుసు లాగేదా?

శేషు : ఇప్పుడింక గొలుసు తెంపినా లాభం లేదండి. వచ్చే స్టేషనులో దిగుదురుగాని— మనది ఏలూరే నేమిటండి?

వ్యక్తి : అవునండీ— నేను వెళ్ళిన పని ఎలా తగులడిందో—

శేషు : ఫరవాలేదు, కంగారు పడకండి- తమ నామధేయం?

వ్యక్తి : కాంతయ్య- నేను ప్లీడర్ని— అయితే ఏం లాభం లేదంటారా?

శేషు : అబ్బే లేదండి; పైగా జుర్మానా వేస్తారు!

కాంత : పని అంతా పాడైపోయిందండీ, పాడు నిద్ర. పాపం, నా కోసం మా యింటి దగ్గర ఒక పెద్దమనిషి కనిపెట్టుకుని వుంటాడు కూడాను.

శేషు : పాపం.

కాంత : మీరు ఎవరు, బాబూ?

శేషు : మేము తురకల మండి.

కాంత : ఆ అమ్మాయిని అలాగ చలిగాలిలో కూర్చోపెట్టారేం, పాపం? ఇలా కూర్చోమనండి, నేను పెద్ద వాణ్ణి—

శేషు : ఫరవా లేదండి.

కాంత : కంట్లో ఏమైనా పడతాయి కూడాను; అయ్యో, వొణుకు తోందండి చలితో, పాపం—

శేషు : అబ్బే, అదీ రైలు కుదుపులెండి.

కాంత : బాబూ, తెనుగు స్వచ్ఛంగా మాట్లాడుతున్నావు- ఈ పిల్ల మీ మేనకోడలా?

శేషు : మీ కెలా తెలిసింది?

కాంత : నాకు మెలుకువ వచ్చేటప్పటికి 'మామా' అని పిలుస్తోంది మిమ్మల్ని. నాకు మా అమ్మాయి జ్ఞాపకం వచ్చింది. అయితేను, మీరు తురకం మాట్లాడు కోరూ?

శేషు : అదీ మాట్లాడతామండి.

కాంత : [రాధ మొహంమీద వేసుకున్న ముసుగు గాలికి కొంచెం జారి నప్పుడు చూసి] బాబూ, తురకల ఆడంగులకి చెవులనిండా కుటూ

భోగులూ వుంటాయంటారు, అందరికీ వుండవా ఏమిటి? ఈ చలిలో మంచి బురఖా వేయించలేకపోయావా, నాయనా? ఆ చీర చెంగు కప్పుకోడానికి చాలడంలేదు, పాపం—

శేషు : ఏమిటోనండి- [రాధతో] ఫరదా బరాబర్ రఖో, బేటీ!

కాంత : ఆయన ఎవరు?

శేషు : ఏమో, నాకు తెలియదండి.

కాంత : [మాధవరావుని పలకరిస్తూ] చూడు, బాబూ; ఏమయ్యోయ్! నీ దగ్గర గడియారం వుందా? [మాధవుడు మాట్లాడడు; లేచి అతన్ని సమీపించి] నిన్నే, బాబూ. [పరకాయించి చూసి విస్మయంతో] ఏమిటీ, మాధవా!

మాధ : ఏమిటీ, బావా? నువ్వెక్కడికి వెడుతున్నావ్?

కాంత : నువ్వెక్కడికిరా వెడుతున్నావు?

మాధ : ఇదుగో, మా స్నేహితుడితో వాళ్ళవూరు వెడుతున్నాను.

కాంత : నువ్వెవరో తనకి తెలియదన్నా డాయన?—ఇందులో ఏదో వుంది; ఆ అమ్మాయి ఎవరు?

మాధ : వాళ్ళ అమ్మాయే!

రాధ : [కోపంతో] ఛా, ఇంక నేనీ నటన భరించలేను; నా కళ్ళలో ఏదో పడింది, మామా! [కళ్ళు నలుపు కుంటుంది]

మాధ : ఆఁ-

కాంత : [కోపంతో] ఏమిటి! ఓరి మీ దుంపలు తెగ! రాధ నెక్కడికిరా తీసుకుపోతున్నారు? ఓరి- మీ దుర్నుం మండిపోను! నే నింకా బ్రతికి వుండగానే——

రాధ : మామా, నా కంట్లో వూదు—

కాంత : ఆఁ, వాడు వొద్దు; ఉండు నేను వూదుతా—

రాధ : నీకు చేతకాదు, నాన్నా; తుంపర్లు పడతాయి!

కాంత : ఇంత నిర్లక్ష్య మేమిటే? వాడు వూదితేనేగాని పనికిరాదూ? పైగా, నా కింకా యాభై అయినా నిండలేదు, తుంపర్లు పడతా యంటావా? ఉండు, వాడు మాత్రం వొద్దు. ఈ అవిధేయత నా దగ్గర పనికిరాదు. పోనీ, ఈ సాయిబునైనా వూదమం టానుగాని—

మాధ : అతను సాయిబు కాడు!

కాంత : [ఆశ్చర్యంతో] సాయిబు కాడూ?— అవును; అన్నట్టూ—

రాధ : అబ్బ, మామా, మామా! మండిపోతోంది! [కన్ను మరింత నలుపుకుంటుంది]

మాధ : [ఆమె కంటిలో గట్టిగా వూది] ఆఁ, పోయిందా?

కాంత : కాస్త హిందూస్తానీ కూడా వెలిగించాడు, మహా వచ్చిన వాడిలాగ—

శేషు : ఇం కెందుకు దాచడం? నేను, తమకోసం మీ యింటి దగ్గర కనిపెట్టుకుని వుండవలసిన పెద్దమనిషిని; మీరు మోజుపడి పిలిపించిన వరుణ్ణి!

కాంత : [ఆశ్చర్యంతో] ఏమిటీ, నీ పేరేనా శేషగిరి?

శేషు : అక్షరాలా.

కాంత : మరి ఏలూరులో వుండక వీళ్ళతో పారిపోతున్నావేం?

రాధ : మేము పారిపోవడంలేదు, నాన్నా; పెళ్ళికి వెడుతున్నాం.

కాంత : ఎవరి పెళ్ళి, అమ్మాయీ ?

రాధ : నాపెళ్ళి ; మామతో—

కాంత : ఏమిటీ, ఈడ్చి తన్నితే దమ్మిడీ లేదు, ఈ సన్యాసివాడితోటా నీకు పెళ్ళి ?

శేషు : మీకు డబ్బు వున్న వరుడే కావాలంటే, నాకూ ఏమీ ఆస్తి లేదు !

కాంత : అయితే, నువ్వూ వీడిలాంటి తలమాసిన పకీరువే నన్నమాట ! నాకు తెలియనే తెలియదు—

రాధ : నీకు హృదయం లేదు, నాన్నా.

కాంత : హృదయం లేకపోతే మనుష్యులు బ్రతికి వుండలేరు, అమ్మాయి ! ఇంతేనా, మళ్ళీ సైన్సు చదివేనంటావు, బోలెడు డబ్బు తగలేసి ? హృదయం అంటే ఏమిటి ? మామిడికాయ ఆకారంగా ప్రతి మానవుడి ఛాతీలోను కొంచెం ఎడమ ప్రక్క వుండి శరీరాని కంతటికీ రక్తం పంపుచేసే ఒక కండర విశేషం—తెలిసిందా ?

మాధ : పంపూకాదు, అర్ధశేరు నవటాకూ కాదు; రాధ చెప్పింది అట్లాంటి హృదయం కాదు, బావా.

శేషు : మాధవుడు నాకు చిన్నపట్నినించీ స్నేహితుడు.

కాంత : దొడ్డ స్నేహితుణ్ణే సంపాదించావు : జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలిందట !

శేషు : వాడూ, ఆమే పెళ్ళి చేసుకుందామని చిన్నతనం నుంచీ స్థిర పరచుకుంటే, మధ్యని నన్ను పిల్లని చూసుకు వెళ్ళమని నాకు వ్రాయడం మీకు ధర్మంగా వుందా ?

కాంత : పెళ్ళి చేసుకుందామని స్థిరపరుచుకున్నారూ ? స్థిరపరచుకోడానికి వా ళ్ళెవరు మధ్యని ?

శేషు : వాళ్ళు ఒకళ్ళ నొకళ్ళు ప్రేమించుకుంటున్నారు—

కాంత : ప్రేమా ? ప్రేమ బువ్వ పెడుతుందా, పిచ్చాడా ?

రాధ : బువ్వ నువ్వే పెట్టాలి, నాన్నా.

కాంత : ఇంతవరకూ వచ్చాక, ఇంకా బువ్వపెట్టనూ మరి ? మీరు నా మాట ఖాతరు చేశారు కాదు గనక మీ రింక అడుక్కు తింటూ పోయినా నేనేం విచారించేవాణ్ణి కాదు, తెలుసా ?

రాధ : నేను మాధవని ప్రేమిస్తున్నాను !

మాధ : నేను రాధనే ప్రేమిస్తున్నాను గదా ?

రాధ : నీకు ప్రేమ అంటే అర్థం తెలియదు, నాన్నా-

కాంత : ఇంత చదువూ చదివిస్తే ఇదన్నమాట ఫలితం ? పుస్తకాలలో దంతా బుర్ర కెక్కింది !— చూడూ, నేను ప్రేమించే మీ అమ్మని పెళ్ళి చేసుకున్నానని నువ్వు అనుకుంటోన్న ట్టయితే అది శుద్ధ పొరపాటు ; మా కాలంలో ఇలాంటి వెర్రి ప్రేమలూ, విరహతాపాలూ లేవు.

మాధ : తెలుస్తూనే వుందిగా : అక్కయ్య మా టంటే నీకు లక్ష్యం లేదు-

కాంత : అసలు నా మా టంటే దానికి లక్ష్యం వుందాంట ? ఇదంతా దాని పన్నాగమే నని నాకు తెలియదూ ?

శేషు : అబ్బే, రామ, రామ ; ఆవి దేమీ ఎరగరండి, పాపం-

కాంత : అలాగా ? ఆవిడ సంగతి ఇంకా నీకు సరిగ్గా బోధపడలేదన్న మాట—

శేషు : ఇంతెందుకు ? పంతులుగారూ, మీ మంచి కోసమే చెబుతున్నాను ; చూడండి—

కాంత : ఇదొకటి, మనిషికి చిర్రెత్తించే విషయం : నా మంచే ఆలోచిస్తున్నాడుట ! హుఁ-

శేషు : అవును, మీరు ఆలోచించుకోలేకపోయినప్పుడు, నేను ఆలోచించి పెడితే తప్పా ?

కాంత : ఓహోహ, వ్యవహారం ముదురుతోందే ? నాతో ఎగతాళి అనుకుంటున్నారు కాబోలు- ఇప్పుడు మిమ్మల్ని ఇద్దర్నీ [మండి పడుతూ] రాధని బలవంతంగా ఎక్కడికో తీసుకుపోతున్నారని కేసు పెట్టి ప్రాసిక్యూట్ చేయించకపోతే నా పేరు కాంతయ్య కాదు ! చూసుకోండి, నా తడాఖా !

రాధ తలుపుతీసి బయటికి ఉరకబోతుంది-

శేషు : [ఆమె చేయి పట్టుకుని కంగారుగా] ఉండండి, వుండండి రాధగారూ, ఎక్కడికి ? ఆఁ, ఆఁ ! ఏమి టది ?

రాధ : [అతని చేయి వదిలించుకుంటూ] నన్ను వదలండి- నేను చస్తేనే గాని మా నాన్నకి ప్రాణం హాయిగా వుండదు-

తలుపు తియ్యగానే రైలు హోరు పెద్దగా వినబడుతుంది. వెనుకవైపు వున్న బ్యాక్‌గ్రౌండ్‌లో టెలిగ్రాఫ్ స్తంభాలూ, చెట్లూ అతి వేగంగా పరిగెడుతున్నట్లు కనబడతాయి.

మాధ : [బిగ్గరగా] రాధా, రాధా ! ఉండు— [ఆమెను పట్టుకుంటాడు]

రాధ : వొదులు, మామా, వొదులు-

కాంత : [విస్మితుడై కొంచెం తగ్గి] అయ్యో, రాధా ! అమ్మవు కాదూ ! అలాగ ప్రాణత్యాగం చేసి వోఘాయిత్యం చెయ్యకు—చూస్తా

వేం రా, మాధవా, దాన్ని ఇంకా గట్టిగా పట్టుకోవేం? మనిషి ప్రాణం కంటే—

మాధ : ఒక ప్రాణం కాదు, నీ మూర్ఖం వల్ల రెండు నిండు ప్రాణాలు పోవడానికి సిద్ధంగా వున్నా యిప్పుడు.

కాంత : అదేమిటి? నువ్వు కూడా పడదా మనుకుంటున్నా వేమిటి? పడితే పడు : నువ్వు పడితే జానేదేవ్ ; నాకేం దిగులు లేదు!

రైలు వేగం, హోరూ మరింత ఎక్కువౌతాయి

మాధ : [మళ్ళీ ఉరకబోతున్న రాధని ఇంకా గట్టిగా పట్టుకుంటూ] ఆఁ, ఆఁ- రాధా!

శేషు : అది కాదండి ; ఇప్పు డామె వొంట్లో స్వస్థతగాలేదు ; ఆమె ఒక్కరూ పడితేనే రెండు ప్రాణాలకి నష్టం వస్తుం దంటున్నా డండి మాధవుడు ; బోధపడింది కాదండీ?

కాంత : ఆఁ! అది కూడానా! హరిమీ- ఇంకేముంది! [తన తలను చేతులతో అదుముకుంటూ] నా పని అయిపోయింది : నువ్వే గెల్చావురా, మాధవా.— [రాధతో] అమ్మా, చెప్పావు కావు? మామనే పెళ్ళి చేసుకుందువుగానిలే, ఎంచక్క ; నా అభ్యంతరం ఏమీ లే దింక- రా మరి, బంగారపు తల్లి!

రాధ : [ఆనందాశ్చర్యాలతో] ఏమిటి, నిజమే! మామా, నన్ను గట్టిగా పట్టుకో, జారిపోతున్నాను!

మాధ : ఫరవాలేదు, రాధా ; నా చేతులలో వుండగానే— [రాధ చటుక్కున నిలువునా నుంచుంటుంది. ఆమె తల మాధవుడి గడ్డానికి ఢీ కుంటుంది] అబ్బ ; అంత అకస్మాత్తుగా లేస్తారా? నా గడ్డం చితికింది! [ఒక చేతితో గడ్డం తడుముకుంటాడు]

రాధ : [ఆనందం పట్టలేక ఒక్క పెట్టున విరగబడి నవ్వుతుంది]

శేషు : ఆ తలుపు వేసెయ్యరా, ఇంక - ఈ అద్భుతరసం పనిచేసి ఈ సారి బావగారికి క్రిందికి ఉరకాలని బుద్ధి పుట్టవచ్చు! [తను వెళ్ళి తలుపు మూస్తాడు]

కాంత : నే నెందుకు ఉరుకుతానోయ్? [జాలిగా] ఉరికినకంటే ఎక్కువే అయింది. [నిట్టూరుస్తూ సీటుమీద కూలబడి] ఏటొచ్చీ, డబ్బు లేనివాడనే సందేహం ఒకటి తప్ప—

మాధ : అన్నట్టు, ఆ సందేహం ని న్నింక పట్టుకు పీకనక్కర్లేదు: చెప్పడం మరిచిపోయాను- [జేబులోనుంచి వుత్తరం తీస్తూ] నిన్న మా పెద్దక్కయ్య ఉత్తరం వ్రాసింది; నన్ను పెంచుకుని రాధ నిచ్చి నాకు పెళ్ళి చేస్తానని!

రాధ : అదే నేమిటి, మామా, ఇందాకటి వుత్తరం?

మాధ : మరే.

కాంత: [సంతోషంతో] ఇంకేం: ఇప్పుడు నా కింక ఏమీ అభ్యంతరం లేదు—తల్లీ, నువ్వు మామనే పెళ్ళి చేసుకుని సుఖంగా వుండు; మిమ్మ ల్నిద్దర్నీ నేను మనస్ఫూర్తిగా దీవిస్తున్నాను!

రాధ : [ఆనందాతిరేకంతో] మామా! [అతని చెయ్యి పట్టుకుంటుంది]

మాధ : అదృష్టమంటే మనదే, రాధా! [ఆమెను దగ్గరకు తీసుకుని] నా మనస్సులో ఈ ఆనందంతో ఏమిటో ఊపిరి సలపడం లేదు! [రైలు ధ్వనికి తాళం పడేలాగ పాటగా]

"ఇంద్రధనుస్సులు నిచ్చెన వేసీ,
చంద్రవంక వుయ్యాలా చేసీ,
ఆకాశంలో విహరిద్దామా?"

రాధ : "భూమి నెత్తిమీద శఠగోపం
బోర్లించినట్టుండే చోటికి
పోతే బావుండదూ, మామా ?"

శేషు : "తోచినట్టు చేసెయ్యడమేనా ?
తోడపెళ్ళికొడుకుతో చెప్పరూ ?"

కాంత : "ఏమర్రా, పాటాపేస్తారా ?
ఏయ్, మిమ్మల్నే, మతోతోంది !"

రాధ : "నందనవన సుమసౌరభాలనీ,—

మాధ : "స్వర్గలోక సవుందర్యాలనీ,—

రాధ :
మాధ : } [ఇద్దరూ కలిసి] "జీవయాత్రగా వెలిగించేద్దాం ! !"

కాంత : "నా
బుర్ర గిరగిరా తిరిగిపోతోంది,
భూమిలాగ తిరిగిపోతోంది !
మీ పాటాపేస్తారా, లేదా ?—"

పాట ఆగుతుంది- రాధ, మాధవుడు విరగబడి నవ్వుతుంటారు

శేషు : చూడండి, బావగారూ !

కాంత : [ఆయాసంతో] ఉస్స్ !—ఆఁ, ఏమిటి ?

శేషు : వచ్చే స్టేషనే మావూరు : అందుచేత మీరు కూడా అక్కడ మాతోపాటు దిగి, మా యిల్లు నాలుగు రోజులు పావనం చేసి—

కాంత : ఒక్కగాక ఒక్క పిల్లకి పెళ్ళి !— మా వదినగారు చేస్తే

నే వూరుకుంటానా ? మీ వూళ్ళో కూర్చుంటే ఎలాగ, వెర్రాడా ? వెళ్ళి అయిదురోజులపెళ్ళికి ప్రయత్నాలు చేయించ వద్దూ ?

రాధ : అయితే-నాన్నా, నువ్వు తిరిగి వెళ్ళిపోదువుగాని; నేనూ, మామా వీరి యింట్లో రెండు రోజులు వుండి, ఒకసారి వెళ్ళి పెద్దక్కయ్యని కూడా చూసి వస్తాం, ఏం ?

కాంత : మళ్ళీ తొందరగా వచ్చివెయ్యండేం ? పెళ్ళి కాకుండా అలా షికార్లు చెయ్యకూడదు !

రాధ :
మాధ : } [ఒక్కసారిగా] అలాగే–

స్టేషన్‌లో రైలు ఆగుతుంది. ప్రయాణీకుల కలకలం, వగైరా-

శేషు : [తలుపుతీసి దిగుతూ] బావగారూ, దిగండి.

కాంత : ఇదేనా మీ వూరు ? – అన్నట్టు నేను టిక్కెట్టుకి ఎక్సెస్ చేయించాలి కూడాను. [దిగుతాడు]

రాధ : [దిగుతూ] మామా, జాగ్రత్తగా దిగు, పడిపోతావు !

మాధ : [దిగి, నెమ్మదిగా] రాధా ! బావ రెండు ప్రాణాల సంగతి నమ్మేశాడుసుమా ! [ఇద్దరూ నవ్వుకుంటారు.]

(తెర పడుతుంది.)



## పాత్రలు :

తంజావూరు రాజు విజయరాఘవ నాయకుడు

యువరాజు మన్నారుస్వామి

రాజగురువు శ్రీనివాస తాతాచార్యులు

మధుర రాజు చొక్కనాధ నాయకుడు

తంజావూరు మహారాణి రాజగోపాల కాంచికాదేవి

రాకుమార్తె ఇందిరాదేవి

దాసి లక్ష్మి

దండనాధులు

రాయబారులు

భటులు

---

# వీర విజయరాఘవం

—:o:—

## ఒకటవ రంగం

తంజావూరు- విజయరాఘవ నాయకుని సభాభవనంలో. మంత్రులు, సామంతులు, దండనాయకులు, కవులు, కవయిత్రులు, నాట్యకత్తెలు కడు వైభవోపేతముగ కొలువు సేయ, విజయరాఘవ నాయకుడు నవరత్నఖచిత హేమసింహాసనమున ఆశీనుడై వుంటాడు. నాట్యకత్తె కస్తూరి నృత్యగానములను పూర్తి చేసి రాజుకు నమస్కరించి నిలబడి వుంటుంది.

విజయరాఘవుడు : కస్తూరీ, నీ అద్భుత నృత్యగాన విన్యాసాలకు మాకు చాలా ఆనందమైంది: నీకు వేయిన్ని నూటపదహారు వరహాలు మా పారితోషికం !

కస్తూరి : [నమస్కరించి] ధన్యురాలను, మహాప్రభూ ! [తన యథాస్థానమునకు పోయి కూర్చుంటుంది]

విజయ : ఆఁ.... ఏదీ. రంగాజీ ! నీవు రచించిన "ఉషాపరిణయ" కావ్యం కొంచెం చదివి మాకు వినిపించు-

రంగాజీ : మహాప్రసాదం-

విజయ : తరవాత మేము రచించిన "రఘునాథాభ్యుదయ నాటకం"లోని కొన్ని ఘట్టాలను చదివి వినిపింతువుగాని-—

రంగాజీ : చిత్తం.

భటుడు : [ప్రవేశించి] మహాప్రభూ !

విజయ : ఏమిరా ?

భటుడు : శ్రీమాన్ చతుర్వేది, శతక్రతు శ్రీ శ్రీనివాస తాతాచార్యుల వారు విజయం చేస్తున్నారు.

విజయ : సత్వరం లోపల ప్రవేశపెట్టు— అభ్యంతర మందిరంలోని కైతే మాత్రం అయ్యవార్లంగారి ఆగమనానికి అభ్యంతరం ఏమి వుంటుంది ?

భటుడు : ఆజ్ఞ, మహాప్రభూ ! [నిష్క్రమిస్తాడు]

శ్రీనివాస తాతాచార్యులు : [ప్రవేశించి] శుభమస్తు. శ్రీ విజయరాఘవ నాయక మహారాజులుంగారికి !

విజయ : [సింహాసనము నుంచి లేచి దిగి వచ్చి] అయ్యవార్లంగారికి ప్రియశిష్యుడు నమస్కరిస్తున్నాడు. [నమస్కరిస్తాడు.]

శ్రీనివాస : దిగ్విజయ ప్రాప్తిరస్తు !

విజయ : స్వామీ, నా వామపార్శ్వాన వున్న ఈ హేమపీఠంమీద సుఖాసీనులు కండు. [ఆయనను ఆ యాసనం పై కూర్చుండజేసి తాను మరల సింహపీఠిపై కూర్చుంటాడు]

శ్రీనివాస : మంచిది.— [ఆనందాశ్చర్యాలతో] ఆహా, మహారాజా !

విజయ : స్వాములు ఏమిటో సెలవియ్యబోయారు ?

శ్రీనివాస : ఏమీలేదూ ; శోభనాంగులైన ఈ నాజమ్మ, చంపకవల్లెమ్మ లిద్దరూ తమ సింహాసనానికి మీద ఉభయ పార్శ్వాలా వుండి కొలుస్తూవుండగా, రంగాజీ, కృష్ణాజీల వంటి కవయిత్రీ మణుల కైవారాలతో, సీతా, కస్తూరీ, అంబుజవల్లీ, శశిరేఖాది

సుహాసినులు పరివేష్టించి సేవిస్తూండగా, తమరు శ్రీ వైకుంఠంలో లక్ష్మీభూదేవీయుతులై కొలువుండే సాక్షాత్తు శ్రీమన్నారాయణమూర్తివలె భాసిస్తున్నారు!

విజయ : ఇదంతా తమ వాత్సల్యం.

శ్రీనివాస : సత్యం వక్కాణిస్తున్నాం : తమతో సమకాలికులమై ఈ ప్రత్యక్షమైన కన్నులవైకుంఠం దర్శించే భాగ్యం మాకు భోగ్యమవడ మంతా కేవలం మా పూర్వజన్మ సుకృతం!

విజయ : స్వామీ, మన రంగాజీ రచించిన "ఉషాపరిణయం" బహు రసవంతంగా వుంది సుమండీ ; కవిత్వం ప్రసాదగుణ ప్రధానంగా వుందని మాకు తోస్తోంది—

శ్రీనివాస : శిరసున శారదాధ్వజము, కాల గండపెండేరము ధరించిన సుకవినాయకమౌళి మన్ననను పొందిన రంగాజీ ప్రతిభా విశేషం కొనియాడ దగినది. ఈమె తొలుత రచించిన "మన్నారుదాసవిలాసము" కంటె ఈ గ్రంథం మిన్నగా వున్నదని మాకూ తోచింది.

విజయ : మన్నారుదాసవిలాస మంటే జ్ఞాపకం వచ్చింది : మన్నారుగుడిలోని మా కులదైవం రాజగోపాలస్వామివారి ఆలయ ప్రాకారపునర్నిర్మాణం- మరొక నూతన గోపురం పూర్తి అయితే చేయించాం గాని, ప్రతి సంవత్సరం మన్నారుగుడి పోయి రావాలంటే కొంచెం శ్రమ అని తోస్తోందండి—

శ్రీనివాస : రాజ్యకార్యభారం సయితం క్రమంగా అధికమౌతున్నది కూడాను.

విజయ : అందుచేత, తమ అనుమతి తీసుకుని మా రాజగోపాల స్వామి వారిని మన తంజనగరంలోనే సుప్రతిష్ఠుల చేసి అర్చించాలని సంకల్పం.

శ్రీనివాస : అవస్యం అట్లాగే చేయించండి. ఆ స్వామివారు అసలు మన నగరంలో వేంచేసి నివాసం చెయ్యడమే ఎక్కువ సముచితం.

విజయ : ప్రతి నిత్యమూ అంచెసవారీమీద శ్రీరంగం పోయి ఆ స్వామి అమ్మవార్ల సన్నిధిని సేవ ముగించుకొని పదహారు గడియల ప్రొద్దులోపల నగరం తిరిగివచ్చి భోజనం చేసే సదాచారం సన్నగిలి, గోపుర మెక్కి శిఖరదర్శనంతోటే తృప్తిపడే పరిస్థితి ఇప్పు డేర్పడింది.

శ్రీనివాస : అదేమిటి అలా సెలవిస్తున్నారు? బాగా ఆలోచిస్తే భక్తవత్స లుడైన ఆ స్వామి సర్వకాల సర్వావస్థలలోను మన శ్రేయస్సే కోరుతూ, మనం ప్రార్థిస్తే మన నగరమే విజయం చేసి రక్ష చేస్తాడు కాదూ?

విజయ : అయితే, స్వామివారి ప్రతిష్ఠకి తగిన ఏర్పాట్లన్నీ చేయిస్తారు కాదూ?

శ్రీనివాస : తక్షణం చేయిస్తున్నాం. ఇంతకంటే కోరదగిన దేముంటుంది? తంజావూరు పౌరులు తరిస్తారు, మేమూ ఇట్టి విషయమే ఒకటి ప్రస్తావించా లనుకుంటున్నాం.

విజయ : సెలవియ్యండి.

శ్రీనివాస : మాయూరమధ్యార్జునాల కావేరీ స్నానఘట్టాలతో పదివేల ప్రజ పట్టేటట్టుగా విశాలమైన పుష్యమంటపాలు కట్టించ డానికి ఉత్తరువులు దయచేయించాలి.

విజయ : ఇంతకంటే వుందా ? సుభం ; ఈ దైవకార్యం శీఘ్రంగా ప్రారంభింపజేయించండి.

శ్రీనివాస : దైవ కార్యాలపట్ల మహారాజులుంగారి శ్రద్ధాసక్తులు మే మెరుగనివి కావు.

విజయ : ఏమయినా, స్వామీ, మాకు వయస్సు మళ్ళుతోందేమో అని సందేహం జనిస్తోందండి—

శ్రీనివాస : అది తమరు సెలవియ్యవలసిన మాటకాదు.

విజయ : లేదు, మొన్న మన ఆస్థాన జ్యోతిష్కుడు భూగోళం వేంకటేశుని చేత మా జాతకం పరీక్షింప జేశాం.

శ్రీనివాస : చిత్తం.

విజయ : మా కిప్పుడు డభ్భై సంవత్సరాలు పైబడి ఎనభయ్యో పడిలో వున్నామట.

శ్రీనివాస : కాని, ఆ వయస్సు తమ దివ్యసుందరాకృతిలో గోచరించదు. మొన్నటి రోజున రాజసభ వినోద గోష్ఠిలో కృష్ణాజీ ఛలోక్తిగా వేసిన ప్రశ్నకు రంగాజీ యిచ్చిన చమత్కారయుక్తమైన ప్రత్యుత్తరాన్ని ఈ సందర్భంలో తమకు జ్ఞప్తికి తేగోరుతున్నాం.

విజయ : ఏమిటది ?

శ్రీనివాస : "దంతపుపని మంచముపై
కాంతా, కూర్చున్నవాడు కంతుడు కాడా ?—
కంతు డనంగుడు, నీ తెలి-
వింతేనా ? విజయరాఘవేంద్రుడె, చెలియా !" అని

విజయ : [నవ్వి] అవును- ఈ కృష్ణాజీ రంగాజీలు మన ఆస్థానానికి అలంకారమణులు. అయినా, ఇప్పు డేదైనా యుద్ధం వచ్చిందంటే మాత్రం సిద్ధమేలెండి.

శ్రీనివాస : వీరవిజయరాఘవ నాయకులు సెలవిస్తున్నారు. కాని, మనం ఏమరి వున్నప్పుడు మధుర చొక్కనాథనాయకుడు దొంగ పోటున మన రాజ్యానికి ఆయువుపట్టులైన వళ్ళంకోట మొదలైన స్థావరాలను ఆక్రమించుకున్నాడు. మళ్ళీ ప్రబల పరాక్రమంతో భయంకరయుద్ధం చేసి అతన్ని ఓడించి శ్రీవారు ఆ ప్రదేశాలను తిరిగి స్వాధీనం చేసుకోవడం ఎన్నటికైన మరచిపోగలమా ? ఈ రెండు సంవత్సరాలనించీ శాంతి చేకూరి దేశం సుభిక్షంగా వుంది.

భటుడు : [ప్రవేశించి] మహాప్రభూ !

విజయ : ఏమిరా ?

భటుడు : నాగపట్టణం నుంచి డచ్చి రాయబారులు వచ్చి ఆజ్ఞకై వేచి వున్నారు మహాప్రభూ.

విజయ : ప్రవేశపెట్టు.

భటుడు : చిత్తం, మహాప్రభూ ! [నిష్క్రమిస్తాడు.]

ఇద్దరు డచ్చి రాయబారులు : [ప్రవేశించి] జయము జయము జయము శ్రీ విజయరాఘవ నాయక మహారాజులుంగారికి–

విజయ : ఏమయ్యా, నాగపట్టణంలో మీ వర్తక వ్యాపారానికి రక్షణ సరిగా జరుగుతోందా ?

డచ్చి : ఆ విషయం మనవి చేసుకోడానికే వచ్చాం, దేవరా !

విజయ : ఏమిటి మీ కిప్పుడు తటస్థించిన యిబ్బంది ?

డచ్చి : యాభై సంవత్సరాల క్రిందట తమరు మా కంపెనీకి మా వ్యాపార సౌకర్యం కోసం మాకు నాగపట్టణాన్ని దానం చేయించి వెండి శాసనం దయచేయించారు—

విజయ : అవును.

డచ్చి : ఆ రేవుమీద మాకు దఖలు పడిన సంపూర్ణ స్వాతంత్ర్యానికి మధుర నాయకులు అంతరాయం కలిగించి మమ్మల్ని అనేక విధాల ఒత్తిడి చేస్తున్నారు, మహారాజా. దానికి తగిన రక్షణ దయచేయించమని ప్రార్థించడానికే ఇప్పుడు తమ సన్నిధికి వచ్చి వున్నాం.

విజయ : మేము మీకు దాన మిచ్చిన నాగపట్టణంలో మధుర నాయకుల ఒత్తిడా ?

డచ్చి : చిత్తం.

విజయ : ఏమి ఇంకా వీరి ఆగడం ! సరే, మేము విచారించి తగిన కట్టుదిట్టం చేయిస్తాం. భయంలేదు, మీరు వెళ్ళండి.

డచ్చి : మహాప్రసాదం. సెలవు— సీమ నించి కొత్తగా వచ్చిన విలువైన కానుకలు సమర్పించుకున్నాము, దేవరా !

విజయ : మంచిది. మీరిక వెళ్ళండి. [డచ్చి రాయబారులు నిష్క్రమిస్తారు. శ్రీనివాస తాతాచార్యులుగారితో] గురుదేవా, చూశారా, ఈ మధురవారి దుండగీడుతనం ? ఇంకా వీరికి బుద్ధి రాలేదు.

శ్రీనివాస : మహారాజా. ఈ మధురవారు మహాకుత్సితులు.

విజయ : స్వామీ, ఉపేక్ష కూడదు గాని, ప్రస్తుత మేమీ ప్రమాదం లేదని భావిస్తున్నాం.

శ్రీనివాస : చిత్తం. ఒకసారి పరాజితులైనవారు ఏమి చెయ్యగలరు? ఇక మన కేమి భయం?

భటుడు : [ప్రవేశించి] మహాప్రభూ!

విజయ : ఏం?

భటుడు : మధుర నుంచి రాయబారులు వచ్చి ఏలినవారి దర్శనం కోసం వేచి వున్నారు, దేవరా!

విజయ : మధుర నుంచి రాయబారులా! ఆశ్చర్యమే- వెంటనే ప్రవేశపెట్టు.

భటుడు : చిత్తం, మహాప్రభూ! [నిష్క్రమిస్తాడు]

మధుర రాయబారులు : [ప్రవేశించి] జయము జయము శ్రీ తంజనగర రాజ్యాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ రాజా విజయరాఘవనాయనిం గారికి— మధుర రాజ్యాధినేతలు శ్రీశ్రీశ్రీ రాజా చొక్కనాథ నాయనింగారి భృత్యులము మా శ్రీవారి దూతలుగా వచ్చి నమస్కార పురస్సరంగా మనవి చేసుకుంటున్నాం-

విజయ : మంచిది. అలా కూర్చోండి.

రాయబారులు తమకు చూపబడిన స్థానాలలో కూర్చుంటారు

రాయబారులు : మహాప్రసాదం, ఏలికా!

విజయ : ఈసారి చెప్పండి - ఏమిటి మీ శ్రీవారి అభీష్టాలు?

రాయబారి : దేవర సముఖాన సగౌరవంగా ఈ కానుకలను సమర్పించుకొని, మా శ్రీవారి వచనాలుగా విన్నవించు మనవి—

విజయ : ఏమిటది ?

రాయబారి : మా ఏలినస్వామి కల్యాణం గావించుకోవాలని సంకల్పించుకొన్నారు—

విజయ : ఓహో, దానికి మా సన్నిధికి రావలసిన అగత్య మేమున్నది ?

రాయబారి : శ్రీ తంజాపుర రాజకుమార్తెగారి రూపలావణ్య గుణగణాదులను గురించి ఆకర్షించి అనురక్తులై మా మహారాజావారు ఆమెను వరించారు ; అందుకు ఏలినవారి అనుజ్ఞను అర్థిస్తున్నారు.

విజయ : ఏమన్నావు ?

రాయబారి : ఈ శుభకార్య నిర్వహణంవల్ల తంజాపుర మధురరాజ్యాల మైత్రీ, అనుబంధమూ ఇనుమడించి, నాయకరాజప్రతిష్ఠాప్రతాపాలు బాగా శోభించగలవని ఆశిస్తున్నామని సెలవిచ్చారు.

విజయ : ఏమి, తంజాపుర మధురాజ్యాల మైత్రి ఇనుమడిస్తుందా ? ఈ సదుద్దేశంతోటేనా, మేము ఏమరుపాటున వున్నప్పుడు మీ శ్రీవారు దొంగపోటుగా దండెత్తి మా వళ్ళంకోట ప్రముఖ స్థావరాలను వశం చేసుకున్నది ? మేము వెంటనే మేలుకొని అవక్రపరాక్రమంతో ఘోరయుద్ధం చేసి మీ రాజావారిని సంపూర్ణంగా ఓడించి వాటిని తిరిగి స్వాధీనం చేసుకొనకపోతే మీ రింకా మిడిసిపడిపోదురనుకుంటాము. ఇప్పుడు మా ప్రతాపానికి జడిసి ఈ నక్కవినయపు రాయబారాలా ?

రాయబారి : గతమంతా మరిచిపోయి ఇప్పుడైనా చేయీ చేయీ కలుపుకుంటే, నిరంతరం ప్రక్కలో బల్లెంలాగ బాధింపజూసే మహమ్మదీయులు మన వైపింక కన్నెత్తి చూడడానికి కూడా

భయపడతారని, ఏక ముఖమైన హిందూ సామ్రాజ్యం దక్షిణా పథంలో ధవళకీర్తులతో విలసిల్లుతుందనీ మనవిచేయమన్నారు.

విజయ : ఇప్పుడు మీది క్రింది చేయి కావడంవల్ల మేము గతమంతా మరిచిపోవాలా? ఏమి, మీ చొక్కనాధనాయనింగారి సాయం లేకపోతే దక్షిణసామ్రాజ్యాన్ని జాగ్రత్త పెట్టడం ఏమంత మాకు చేతకాదనుకున్నారా?

రాయబారి : మనవి చేసుకుంటున్నాం— రాజా పెద్ద వీరప్ప నాయనివారు మొదలుకొని, రాజా తిరుమల శౌరి వరకున్న నడచివచ్చిన సంబంధము కాని నూతన చుట్టరికము కాదు గదా? దేవర వారు తీవరించక, శుభవార్త ఉత్తరుపు దయచేయించవలయు నని ప్రార్థిస్తున్నాం.

విజయ : [కోపముతో మండిపడుతూ] ఏమిటి మీ రాజావారి ఆగ డమూ, మీ ఆగడమూను? ఆయన తాత తిరుమలశౌరికి మా సోదరి అచ్యుతరఘునాధమ్మగారిని పట్టమహిషిగా వివాహం చేస్తే, ఆమె హాస్యాని కేదో అన్నందుకు ఆయన ఆమెను బాకుతో పొడిచిన దురంతం మరిచిపోయామను కున్నారా? ఆ తిరుమలశౌరి మనుమడే కాదా ఈయన?

రాయబారి : క్షమించండి, దేవరా - మేము వా విధిని నిర్వర్తించాం.

శ్రీనివాస : అందుకే, "వివాదశ్చ వివాహశ్చ సమయో రేవ శోభతే" అన్నారు విజ్ఞులు, మహారాజా-

విజయ : సరిగా సెలవిచ్చారు. అప్పుడు నాయనగారేదో రాజనీతి అనుకొని ఆ సంబంధం చేశారు.

శ్రీనివాస : పైగా తమ తంజనగరం నాయకులు సాక్షాత్తు విజయనగర రాజవంశ బంధువులు; ఈ మధురాపురంవారు భృత్య వంశజులు—

విజయ : సత్యం వక్కాణించారు. [రాయబారులతో] అయినా, మీకూ మాకూ వియ్యమేమిటి? వెనక అట్లాంటి దురంతం జరిగి వుండగా తిరిగీ సంబంధం కావలెనని ఏ బుద్ధితో మా వద్దకు మిమ్ము పంపించినాడు మీ నాయకుడు?

రాయబారి : దేవరా—

విజయ : ఇంతైనా భయం లేకుండా సాహసంగా కన్యను యిమ్మని అడుగ వచ్చినందుకు వీరికి తగిన శాస్తి చేయించాలి—

రాయబారి : మేము అపరాధులం కామని మనవి చేసుకుంటున్నాం, ఏలికా.

విజయ : మరేమైనా వేరు పనులు కలిగితే మా వద్దకు రావచ్చును. ఇటువంటి పనులు కోరి ఇకమీద వస్తే మాత్రం తగిన ఆజ్ఞ చేయిస్తాం.— ఎవరూ అక్కడ?

భటుడు : మహాప్రభూ?

విజయ : వీరిని వెంటనే తీసుకువెళ్ళి నగరు సింహద్వారానికి వెలుపల విడిచి రండి.

భటుడు : చిత్తం, మహాప్రభూ.

విజయ : వీరికి బత్తెం, భరణం మనం విచారించనక్కరలేదు.

భటుడు : ఆజ్ఞ—

విజయ : వీరు భేటికి కొంచుక వచ్చిన వస్తువాహనాది కానుకలన్నీ స్వీకరించక వెంటనే త్రిప్పి పంపించివెయ్యండి—వీరి నింకా మా సముఖాన్నించి తీసుకవెళ్ళరేం? [గద్దిస్తాడు]

భటుడు : ఆజ్ఞ, మహాప్రభూ.— [రాయబారులతో] సద్దు చెయ్యక మా వెనుకనే రండు బయటికి [వారిని వెంటబెట్టుకొని నిష్క్రమిస్తాడు]

విజయ : గురుదేవా, మా సమాధానం విని బుద్ధి తెచ్చుకోడంటారా చొక్కనాధుడు ?

శ్రీనివాస : ప్రస్తుతాని కిది సమయోచితంగా వుంది. కాని, మనం ఎప్పటికైనా ఆ మధుర రాజ్యాన్ని కూడా కలుపుకుని మన వీర వైష్ణవాన్ని విస్తరింప జేస్తేనే కాని ఆ రాజ్యం పునీతం కాదు.

విజయ : మా అంతరంగంలోని కోరిక కూడా అదే. శ్రీ రాజగోపాల స్వామివారి కరుణాకటాక్షం ఒక్కటే ఇంక కోరదగినది.— నేటి కింక సభ చాలిద్దామా ?

శ్రీనివాస : మంచిది, మహారాజా !

విజయరాఘవ నాయకుడు సింహాసనంనుంచి లేవడంతోనే సభలో వున్న వారందరు లేస్తారు.

(తెరపడుతుంది.)

## రెండవ రంగం

తిరుచునాపల్లి కోట— మధురరాజు చొక్కనాధ నాయకుని మంత్రాంగ మందిరం—తంజావూరు నుంచి తిరిగి వచ్చిన రాయబారులతో మంతనాలాడుతూ వుంటాడు చొక్క నాధుడు.

చొక్కనాధుడు : ఈ విజయ రాఘవుడి కెంత కావరము !— ఏమని వద రాడు మీవద్ద ? మేము నీచకులజులమనా ?

రాయబారి : దీనికి తాతాచార్యులవారి ప్రోత్సాహం కూడా ముఖ్యకారణం, మహాప్రభూ—

చొక్క : తాతా చార్యులవారా ? తంజాపుర రాజ్య నాశన ధూమకేతువై దాపురించాడు—ఇదీ ఒకందుకు మంచిదే. అవును, మరి వారి ప్రతాపము ముందు మన పరాక్రమం ఏం పనికి వస్తుంది ? ఎన్నేళ్ళు వచ్చి ఏమి లాభం ఈ విజయరాఘవుడికి ? నలభై సంవత్సరాలనించి రాజ్యం చేస్తున్నా, ఎప్పుడు యుద్ధం తట స్థించి బాహుబలం చూపవలసిన తరుణం వచ్చినా పిరికి పంద వలె పిక్కబలం చూపి అడవులలో తలదాచుకొనే అధమ జీవితం అతడిది. అతడికీ మాకూ సాటి ఎక్కడ ?

రాయబారి : అంతేకాదు, దేవరా ; మనం మైసూరు, రామనాధపుర రాజ్యా లతో యుద్ధంలో చిక్కుకున్న సమయం చూసుకుని వళ్ళం కోట మొదలైన స్థావరాలను స్వాధీనం చేసుకోవడం అంతా వారి ప్రతాపమే అని గర్విస్తున్నారు.

చొక్క : గర్విస్తారు, పుట్టినన్నాళ్ళకి పురుషుడు యజ్ఞం చేశాడన్నట్టు ; మన సైన్యాలు లేని కోటను ఆక్రమించుకోవడం కూడా ఒక విజయమే అని సంతోషిస్తున్నారు కాబోలు. చూస్తాం ; ఈ విజయ మెన్నాళ్ళపాటిదోను -

రాయబారి : వారి సభాంతరాళం చూస్తే మాకు చాలా జ్యుగుప్సాకరంగా తోచింది, మహాప్రభూ.

చొక్క : ఏల ?

రాయబారి : ఆస్థాన మండపంలో తాతాచార్యులవారు, రాజావారు తప్ప వేరొక్క మగపురుగైనా లేదని చెప్పవచ్చు దేవరా. అంతా సుందరాంగనలే వారిని పరివేష్టించి వున్నారు. సింహాసనానికి యిరు పార్శ్వాల యిద్దరు, చుట్టూ కవయిత్రులు, గాయనులు, నాట్యకత్తెలు ; ఒకఉేమిటి, మేళతాళాలతో అదొక క్రీడా మందిరంలాగ వుంది గాని, రాజసభలాగ లేదు.

చొక్క : వట్టి భోగలాలసుడు ; యుద్ధ భీరువు : వీరు, మనకి పౌరుష పాఠాలూ, రాజనీతీ ఉపదేశించడం !

రాయబారి : నాయనింగారు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడట ; అది కేవలం వైకుంఠమేనట–

చొక్క : సిగ్గు లేకపోతే సరి. వారు వైకుంఠానికి మొహంవాచి వున్నట్టున్నారు ; పంపిస్తాం త్వరలోనే.

రాయబారి : మహాప్రభూ, మే మక్కడ వుండగా డచ్చి రాయబారులు వచ్చి ఆ రాజావారి దర్శనం చేసి వెళ్ళారు.

చొక్క : డచ్చివారా ?

రాయబారి : చిత్తం. నాగపట్టణంలో వారి వర్తకవ్యాపారం సరిగ్గా సాగకుండా ఒత్తిడి కలిగిస్తున్నామని మనపై ఫిర్యాదు చేయడానికి వచ్చారట.

చొక్క : ఈయనగారి రాజనీతి అటువంటిది: విదేశీయులకు నాగపట్టణం దానమిచ్చి, వా రిచ్చే లంచాలకోసం ఆశపడి, వాళ్ళు మన దేశస్థులను పరదేశాలకు తీసుకుపోయి బానిసలుగా తెగ నమ్ముతూ వుంటే తెలిసీ చూస్తూ వూరుకుంటున్నాడు. ఆ

సర్వనాశనకరమైన జానిస వర్తకానికి మనం అభ్యంతర పెడితే అది ఫిర్యాదు కారణమైంది. ఇంకచాలు. మన పరిసర రాజ్యంలో ఇలాంటి అవినీతి, తుచ్ఛప్రవర్తనం జరుగుతూవుంటే మనం చూసి సహించలేము. అది మన రాజ్యక్షేమానికి సయితం ముప్పు.

రాయబారి : ఇంకొక్క విషయం, మహాప్రభూ—

చొక్క : ఏమిటది? ఈ దుష్టచరిత్రుని గురించి ఇంక ఎక్కువగా మాట్లాడడం వృథాకాలయాపనమే కాగలదు. దీనికి ఔషధం ఇదివరకే నిశ్చయించి వుంచాం. పోనీ సౌమ్యంగా దారిలోకి వస్తాడేమోనని ప్రయత్నించి చూశాం.

రాయబారి : ఆ రాజావారు ఏలినవారి రాయబారులకు బత్తెం, భరణం అయినా విచారించక తూలనాడి పరాభవించి పంపించారు, దేవరా-

చొక్క : ఏమీ, హితవు తీసుకు వచ్చిన రాయబారులపై కార్పణ్యమా? మా మీద ద్వేషం వుంటే అది అమాయికులైన రాయబారుల మీదనా చూపడం? మిమ్మల్ని అవమానిస్తే అది మాకు కాదూ? అభిమానధనులైన మధురనాయక వంశీయులు అవమానము సహించలేరు. ఈ తుచ్ఛుడైన విజయరాఘవుడికి తగిన శాస్తి తక్షణం చేయిస్తాం. మీరు వెళ్ళండి. [రాయబారులు నమస్కరించి, నిష్క్రమించిన పిమ్మట] ఎవరురా అక్కడ? దళవాయి వెంకట కృష్ణప్ప నాయకుని సత్వరం ప్రవేశపెట్టు.

వెంకట కృష్ణప్ప నాయకుడు : [ప్రవేశించి నమస్కరిస్తూ] దేవరవారి ఆజ్ఞకై దళవాయి సిద్ధంగా వున్నాడు, మహాప్రభూ,

చొక్క : విన్నావయ్యా, వెంకటకృష్ణప్పనాయకా, ఈ తంజావూరి విజయరాఘవుడి ఆగడం ?

వెంకట : తెలుసుకున్నాను, దేవరా-

చొక్క : మేము కులహీనులమట-

వెంకట : హరి హరీ, ఆయన జిహ్వను రెండు చీలికలుగా కోసినా పాపం లేదు. మహాప్రభూ, ఇది క్షమించడానికి వీలులేనిదని మనవి.

చొక్క : అమాయికులైన మన రాయబారులను అవమానించి పంపించాడట.

వెంకట : ఆ అవమానం మనకే, మహాప్రభూ.

చొక్క : దీనిని మనం సహించి వూరుకోవలసిందేనా ?

వెంకట : ప్రతిహింసే కర్తవ్యం. మహాప్రభూ ; ఇంక ఉపేక్షించడం తగదు.

చొక్క : మన సేన సర్వం సిద్ధంగా వుంది కాదూ ?

వెంకట : చిత్తం.

చొక్క : ఇంకా ఎక్కువ సంఖ్యల ఏనుగులనూ, గుర్రాలనూ సేకరించాలంటే ఎంతకాలం పడుతుంది ?

వెంకట : తంజావూరును మర్దించడానికిప్పుడు మన వద్ద సిద్ధంగా వున్న సైన్యం ఎక్కువ, దేవరా. ఇంకా ఎక్కువగా కావాలంటే నాలుగు దినాలలో సేకరించి ముట్టడిలో కలుసుకునే ఏర్పాటు చేయించడానికీ అవకాశం వున్నది.

చొక్క : ఫిరంగులు, తుపాకులూ, మందూ—

వెంకట : సర్వం సిద్ధం, మహాప్రభూ.

చొక్క : మీ ప్రతాపం మే మెరుగనిదికాదు. ఈ యుద్ధం మీ శౌర్య చరిత్రకి వన్నె తీసుకు రావాలని ఆశిస్తున్నాం.

వెంకట : మహా ప్రసాదం.

చొక్క : మీరు, మన కోశాధిపతి చిన్నతంబి మొదలియారును సాయం తీసుకుని వెళ్ళి, తక్షణం తంజావూరు కోటను ముట్టడి వెయ్యండి. తంజావూరువారికి ఊపిరి సలపకుండా ఒక్కుమ్మడిని తుపానులాగ ముసురుకొని సంపూర్ణ విజయం సాధించి మరీ తిరిగి మా దర్శనానికి రండి.

వెంకట : ఇప్పుడే విజయయాత్రకి పయనమౌతాను, మహాప్రభూ.

చొక్క : విజయరాఘవ నాయకుని శిరస్సు తెచ్చి మీరు మాకు సమర్పించే దాకా ఈ పరిభవానలం చల్లారదు. ఇదిగో మా ఉత్తరువు—
[కాగితమును సేనానికి అందిస్తాడు]

వెంకట : [దానిని కళ్ళకు అద్దుకొని] మహాప్రసాదం. ఏలిన వారి ఆజ్ఞకు అడ్డులేదు. సెలవు తీసుకుంటున్నాను.

చొక్క : ఇంక మీరు వెళ్ళి యుద్ధభేరీ వేయించండి; విజయులై తిరిగి రండి-ఇక మధుర మహానాయకుల రాజ్యంలో ఐక్యమవుతుంది తంజావూరు.

వెంకట : చిత్తం, మహాప్రభూ ! [నిష్క్రమిస్తాడు]

చొక్కనాథుడు ఆలోచనలో మగ్నుడై వుంటాడు.

(తెర పడుతుంది)

## మూడవ రంగం

తంజావూరు- విజయరాఘవనాయకుని అంతఃపురంలో, పట్టమహిషి రాజగోపాలకాంచికాదేవి, రాకుమార్తె ఇందిరాదేవి-

రాజగోపాలకాంచికాదేవి : ఏం తల్లీ, ఈ ఉదయం అలాగ విన్నబోయినట్టు కనబడుతున్నావు ? నీ మనస్సు ఏదో ఆందోళన పడుతోన్నట్టుంది ?

ఇందిర : మీ దర్శనానికే వస్తున్నాను-

రాజ : ఏమిటి విశేషం ?

ఇందిర : ఈ వార్త విన్నారా ? మధురనాయకుడు నిన్న నాయనగారి సముఖానికి దూతలను పంపించాడట.

రాజ : అవును, విన్నాం. ఈ చొక్కనాథనాయకుడు రాజ్యానికి వచ్చినప్పటినుంచీ మన తంజావూరు మీద కక్ష కట్టాడేమిటమ్మా : కొన్నాళ్ళయినా సుఖంగా కాలక్షేపం చేయడానికి స్థిమితం లేకుండా చేస్తున్నాడు. పోనీ, మనతో సఖ్యంగా వుంటే ఏమి పోయిందో ?

ఇందిర : అసలు రాయబారం ఏమిటో విన్నారా ?

రాజ : విన్నాం : నిన్ను తనకిచ్చి వివాహం చెయ్యాలనిట. సిగ్గు లేక పోతేసరి. వాని అంతరం ఏమిటి, మన అంతరం ఏమిటి ?

ఇందిర : నాయనగారు రాయబారులకు బుద్ధి చెప్పి పంపించారుట. కాని, దీని పర్యవసానం ఎలాగ పరిణమిస్తుందో యోచించారా ?

రాజ : యోచన కేమున్నది ? ఇదొక సాకుగా పెట్టుకుని మన మీదికి యుద్ధానికి వస్తాడు : వచ్చాడో, మన వీరుల చేతిలో ఓడి బుద్ధి

తెచ్చుకుని మసలుతాడు. మొన్నను ఆ మధ్యనే కాదూ, మన వళ్ళంకోటను తిరిగి స్వాధీనం చేసుకొని మళ్ళీ ఈ వైపు రాకుండా దూరంగా తరిమి వేశారు మనవారు? ఇంతకీ ఇప్పుడు నీవు దిగులుగా కనబడడానికి కారణం ఏమిటి, తల్లీ?

ఇందిర : దిగులు నా కెన్నడూ లేదు. కాని, ఆలోచించగా ఇప్పుడు మధుర తంజాపురాలకి జరగనున్న యుద్ధానికి కారణం నే నవుతున్నాను-

రాజ : దానికి నువ్వేం చేస్తావమ్మా?

ఇందిర : నేను కారణంగా ఒక ఘోరమైన యుద్ధం జరిగి, అందులో అనేకులైన అమాయిక ప్రజలు మరణిస్తారంటే నా మనస్సు కెంతో కష్టంగా తోస్తోంది.

రాజ : అదేమిటి, తల్లీ, ఈ వంశగౌరవహాని తెచ్చే వివాహానికి అంగీకరించమంటావా, ఏమిటి?

ఇందిర : ఛీ; నాయనగారు, కులగురువులు తాతాచార్యులవారూ కూడ దని త్రోసిపుచ్చిన కులహీనుణ్ణి నే నెందుకు వరిస్తాను? నాకూ ఆత్మగౌరవమూ, అభిజాత్యమూ వున్నాయి-—

రాజ : మరి?

ఇందిర : నా ఒక్కతె ఉనికి కారణంగా ఇంతమంది స్వామిభక్తులైన పౌరుల అసువులు యుద్ధకీలలకు బలి చేయడం కంటే, నేనే ప్రాణత్యాగం చేస్తే ఈ యుద్ధమే లేకుండా పోతుంది కాదూ? అనేక వేలమంది జీవితాలు రక్షించబడతాయి. కనుక, మీరు నాయనగారితో ఈ విషయం మనవి చేసి—

రాజ : వెర్రి తల్లీ, ఎంత పిచ్చి ఊహమ్మా నీది? నయమే. మధుర నాయకుడు ఎప్పటికైనా మనతో యుద్ధం చేయ్యాలని కయ్యానికి కాలు త్రవ్వుతూ ఏదో సాకు కోసం చూస్తూనే వున్నాడు. మనం ఎలాగా అంగీకరించమని తెలిసే ప్రస్తుతానికి ఈ వివాహమనే మిష కల్పించాడు. ఏమిటి నీ అమాయికత్వం? నీవు ప్రాణత్యాగం చేసినంత మాత్రాన ఈ రెండు రాజ్యాలకీ యుద్ధం తప్పదు, తల్లీ. ఇవాళ ఈ కారణం తప్పితే రేపు మరొకటి అవుతుంది. కనుక, ఇలాంటి పిచ్చి ఊహలు మనస్సులో పెట్టుకుని ఆందోళన పడకు. ప్రజల జీవితాలంటే నీ కున్న విశేషమైన ఆదరాభిమానాలకి నాకు చాలా సంతోషంగావుంది.

ఇందిర : అయితే, నా దంతా పిచ్చి ఊహే అంటారా?

రాజ : సందేహ మేమిటి? చూడు, బంగారు తల్లిలాగ చక్కగా ఏదైనా గ్రంథరచన ప్రారంభించు; అది నీ యీడుకీ, నీ విద్యకీ తగిన కాలక్షేపం-

ఇందిర : అయినా, ఈ యుద్ధం తప్పదని నా మనస్సు కెందుకో తటుతోంది—

రాజ : తప్పక పోతే చెప్పనే చెప్పానుగా ఫలితం? మన కిప్పు డున్న అధికమైన సేనలతో నాయనగారు నాయకుణ్ణి ఎలాగా దాసోహం అనిపించి పంపుతారు. ధీమంతులు తాతాచార్యుల వా రున్నారు కర్తవ్య బోధనకు; అ పైన మన యిలువేల్పు రాజగోపాలదేవు డున్నాడు. మనకు ఇంకేమి భయం? [బయట ఫిరంగులు మ్రోగిన ధ్వని వినిపిస్తుంది] అదేమిటి, ఫిరంగుల మ్రోతలాగుందే?

ఇందిర : ఇంకే ముంది? శత్రువులు మన తంజనగరం కోటనుముట్టడించి నట్టున్నారు.

రాజు : భయంలేదు; చూడు తల్లీ, నీవు నిశ్చింతగా నీ చెలులతో వెళ్ళి వినోదించు. నాయనగారు పూజలో నిమగ్నులై వున్నట్టున్నారు. నేను వెళ్ళి వారి దర్శనం చేసి యిప్పుడే వస్తాను.

(తెర పడుతుంది)

## నాలుగవ రంగం

తంజావూరు—విజయరాఘవనాయకుని నగరులో అభ్యంతర మందిరం ముందు—

కావలి భటుడు : అయ్యావార్లంగారికి దాసుడు దాణ్ణాలు, స్వామీ-

శ్రీనివాస తాతాచార్యులు : [ప్రవేశించి] మహారాజులుంగారు ఏం చేయిస్తున్నారురా?

భటుడు : నేను చూసేటప్పటికి ముఖాన శ్రీచూర్ణతిలకం దిద్దుకుంటున్నారు, స్వామీ. అప్పుడే పూజకి కూర్చుంటున్నారు.

శ్రీనివాస : మధుర సైన్యాలు మన కోటని ముట్టడి వేశాయని మనవి చేశావా?

భటుడు : ఇప్పుడు లోపలికి వెళ్ళడానికి ఆజ్ఞలేదు, స్వామీ.

శ్రీనివాస : ఈపాటికి అర్చన పూర్తి అయివుంటుంది. అయ్యావార్లంగారు వేంచేశారని మనవి చెయ్యి—

భటుడు : చిత్తం. [నిష్క్రమించి, ఒక్క క్షణంలో తిరిగి వచ్చి] దయ చెయ్యండి, స్వామీ.

శ్రీనివాస : మంచిది-

తెర ఎత్తే సరికి విజయరాఘవుడు పూజ పూర్తి చేసుకుని, చిత్రాసనంపై కూర్చుని వుంటాడు.

శ్రీనివాస : జయము జయము శ్రీ రాజా విజయరాఘవ నాయక మహా రాజులుంగారికి !

విజయ : [లేచి] నమస్కారం, స్వామీ ; అలా దయచేయించండి—

శ్రీనివాస : [ఉచితాసనంపై కూర్చుని] మధుర సైన్యాలు మన తంజ నగరం కోటని ముట్టడించి బహిః ప్రాకారాన్ని చుట్టుముట్టి వేశాయి, మహారాజా.

విజయ : భయంలేదు ; రానివ్వండి. ప్రాకార ద్వారా లన్నింటిని మూయిం చమని ఆజ్ఞాపించాం. బురుజుల మీద ఇరవై వేలమంది తుపాకి పేతగాళ్ళని కాపు వుంచాం. మన తక్కిన సైన్యం యావత్తు లోపల సిద్ధంగా వుంది-

శ్రీనివాస : మన సైన్యం శత్రువుల ధాటికి ఆగలేక పోతున్నదని విన్నాం ; వారి ఫిరంగుల ధాటికి—

విజయ : ఏమన్నారు ?—ఎవరురా అక్కడ ?

భటుడు : మహాప్రభూ ?

విజయ : వేయించమను మన విజయరాఘవ ఫిరంగులను !

భటుడు : చిత్తం, దేవరా ! [నిష్క్రమిస్తాడు]

శ్రీనివాస : ఈసారి శత్రువుల ఉద్ధృతం కొంత తగ్గుతుంది.

విజయ : స్వామీ, శత్రువుల మీద మనకి అఖండవిజయం కలగాలని ఆలయా లన్నింటిలోను ప్రార్థనలు జరిపించారా ?

శ్రీనివాస : నిన్న సాయంకాలం మొదలు కోటలోవున్న ఆలయా లన్నింటిలోను ప్రార్థనలకి, అభిషేక భోగాలకీ ఎక్కడా తెరపిలేదు, మహాప్రభూ!

ఒక్కపెట్టున ఫిరంగి గర్జనలు వినిపిస్తాయి.

విజయ : బాగుంది. [భటుడు ప్రవేశించగా చూసి] ఏమిరా?

భటుడు : మధురవారి సేనాపతి వద్దనుంచి దూత వచ్చాడు, ఏలికా-

విజయ : ఇంకా రాయబారా లేమిటి, సిగ్గులేక? ఏమంటాడు?

భటుడు : 'జరిగిందేమో జరిగినప్పటికీ, విజయరాఘవనాయనింగారు ప్రతిష్ఠావంతులైన గొప్ప మహారాజులు; కన్య నివ్వడానికి నిరాకరించినందుమూలాన ఇంతవరకు వచ్చింది. ఇప్పుడైనా మించిపోయిం దేమీ లేదు. మా రాజావారికి మీ రాకొమార్తెగారి నిచ్చి వివాహానికి అంగీకరిస్తే మేము యుద్ధం విరమించుకుంటున్నాం' అని, మహాప్రభూ.

విజయ : [మండిపడుతూ] ఏమి, వీరి పొగరు? మా సేనానివహాన్ని చూసిన తరవాతనైనా వీరి పద్ధతి మారలేదూ? వివాహం పొసగని మాట. పౌరుషం వుంటే వీరులలాగ యుద్ధం చెయ్యమన్నామని జవాబు పంపించు.

భటుడు : చిత్తం, ఏలికా—వారు అప్పుడే కోట పైప్రాకారాలు దాటుకుని ఏలినవారి నగరు సమీపిస్తున్నారని వార్త, మహాప్రభూ—

విజయ : గురుదేవా, తమరు జపం చేసి మంత్రింపించిన జలం శత్రుసేనలమీద చల్లింపించారా?

శ్రీనివాస : మన సేనలు బురుజుల మీదనుంచి శత్రువులపై తుపాకులు

కాల్చడం ప్రారంభించడానికి ముందు చేసిన పని అదే, మహారాజా.

విజయ : అయినా వీళ్ళ నాశనం కాలేదేమి ఇంకాను ?

భటుడు : మహాప్రభూ—

విజయ : నువ్వు తక్షణం మన దళవాయి రంగప్ప నాయకుణ్ణి, తిమ్మ, చొక్కనాథ, చినరాజ, అక్కిరాజుల నైదుగుర్నీ మా సమక్షానికి పంపు.

శ్రీనివాస : మహారాజా, ఈ విషయంలో మా దొక కోరిక—

విజయ : ఏమిటి, స్వామీ, అది ?

శ్రీనివాస : ఉదయం తమతో మనవి చెయ్యమని దళవాయి రంగప్ప నాయకుడు తెలియజేశాడు జంకుతూ—

విజయ : జంకెందుకు ?

శ్రీనివాస : తమ అంగరక్షకు లైదుగురు మహారథులే అయినా ఈ సమయంలో తమరు యువరాజు మన్నారుదేవులను క్షమించి వారిని చిరకాల కారాగార వాసం నుంచి విముక్తుని చేయింపించాలని ప్రార్థన.

విజయ : ఏమన్నారు ? యువరాజు చెర విముక్తికి ఆజ్ఞ యిప్పించమనా ? [ఒక్క క్షణం ఆలోచించి] నిజమే సుమండీ, బాగా సెలవిచ్చారు. కుమారుడు మన్నారుదేవుడు యీ సమయంలో మా చెంత వుండడం సముచితం— ఎవరక్కడ ?

భటుడు : ఆజ్ఞ, మహాప్రభూ ?

విజయ : యువరాజు మన్నారు స్వామివారిని తక్షణం చెరసాలనుంచి విముక్తుణ్ణి చేయించి మా సన్నిధికి తీసుకొనిరా—

భటుడు : చిత్తం, దేవరా- [నిష్క్రమిస్తాడు]

విజయ : స్వామీ, ఇంక వీరోచిత వేషం ధరిస్తున్నాం. [మరొక భటుడు సిద్ధంగా యుద్ధపు దుస్తులను తెచ్చి అందిస్తాడు. వే రొకడు వాటిని ఆయనచే ధరింపజేస్తాడు]

శ్రీనివాస : శుభం!— ఆహా, వాలిపోతున్న ఆ కనుబొమ్మలను బంగారు తీగెలతో పైకెత్తి కట్టించి, నవరత్నాలతో మెరిసే ఆ అమూల్య వస్త్రాభరణాలు ధరించగా——

విజయ : [భటునితో] ఏవిరా, మా మణిస్థగిత ఖడ్గాలు రెండూనూ-
[భటుడు ఖడ్గాలను అందిస్తాడు]

శ్రీనివాస : ఆహా! సాక్షాత్తు వీరనారాయణావతారం వలె శోభిస్తున్నారు, మహారాజా!

విజయ : తమ ఆశీర్వాద ప్రభావం, గురుదేవా.

భటుడు : [ప్రవేశించి] శ్రీ యువరాజావారు మన్నారుదేవులు విజయం చేస్తున్నారు, మహాప్రభూ—

మన్నారుదేవుడు : [ప్రవేశించి]

మణి క్రిందు పరచి జలనిధి
తృణమున్ పైనుంచె నతనిదే కొదువసుమీ,
మణి మణియె, తృణము తృణమే—
రణవిజయదిలీప! విజయరాఘవ భూపా!

తం(డిగారికి యువరాజు మన్నారుస్వామి భక్తితో నమస్క- రిస్తున్నాడు!— అయ్యావార్లంగారికి నమస్కారము! [ఇద్ద రికీ నమస్కరిస్తాడు]

శ్రీనివాస : కుమారా, విజయీభవ!

విజయ : నాయనా, మేము నీకు చాలా అన్యాయం చేశామయ్యా. ఏదీ ఒక్కసారి కౌగిలించుకోని— [యువరాజును కౌగిలించుకుం టాడు]

మన్నారు : ధన్యుడను, నాయనగారూ!

విజయ : ఇప్పుడింక ప్రేమప్రదర్శనానికి సమయంకాదు. హృదయాన్ని వజ్రం చేసుకోవలసి వున్నది.—స్వామీ, తమరు స్వయంగా మన రాజగోపాల స్వామివారికి ప్రార్థనలు జరిపించాలని మా కోరిక—

శ్రీనివాస : అవశ్యం, మహారాజా- సెలవు. [నిష్క్రమిస్తాడు]

విజయ : [యువరాజుతో] చూడు, నాయనా, అంతా మించిపోయింది ప్పుడు. మనం కొంతసేపు పౌరుషంగా రణం చేసినా చివరికి ఎలాగా వైకుంఠం చేరుకోవలసిన వారమే— మహలులో మీ తల్లి రాజగోపాలకాంచికాదేవి, నీ సోదరి ఇందిరాదేవి, ఇతర రాణులు, పిల్లలూ అందరూ గుమిగూడి మా ఆజ్ఞకై ఎదురు చూస్తూవుంటారు. మనం వైకుంఠం పొందిన పిమ్మట మధురవారు ఎట్లాగూ మన రాకుమార్తెను తోడ్కొని పోయి వివాహం చేసుకుని మన వంశానికి తీరని కళంకం ఆపాదించి పగ సాధించుకుంటారు. కనుక, మనమే మన స్త్రీ జనానికి వైకుంఠప్రాప్తి కలిగించడం ఉచితం. ఏమం టావు?

మన్నారు : తమ ఆజ్ఞకు అన్యథావుంటుందా, తండ్రీ?

విజయ : వారి మాన రక్షణ క్రమమంతా ఇదివరకే ఏర్పాటు చేయించాం. వారున్న ఆవరణ చుట్టూ మట్టి కుండలలో తుపాకి మందు కూరించి వుంపించాం. ప్రాణ హరణానికి వారి పాణి పల్లవాలలో కృపాణాలు వుంపించాం. నీవు వెళ్ళి వారికి మా ఆజ్ఞ తెలియజేసి, ఆ మందు కుండలకు అగ్గి పెట్టించి సత్వరం రావయ్యా, నాయనా—

మన్నారు : మహాప్రసాదం! వెళ్ళివస్తాను, నాయనగారూ, మహలులోకి-

విజయ : అక్కడ అణుమాత్రం అనుకంపకు తా వియ్యరాదు సుమా.

మన్నారు : పితృవాక్యం శిరసావహించి, పరిపాలించి వస్తాను, నాయనగారూ-

విజయ : నీవు శ్రీరామ సముడవయ్యా. పోయి వెంటనే రా- మనం కంఠంలో ప్రాణాలు వున్నంత వరకు శత్రువులను ఎదిరించి పోరాడుదాం—

(తెర పడుతుంది)

## ఐదవ రంగం

తంజావూరు-అంతఃపుర ప్రాంగణంలో- మహారాణి రాజగోపాల కాంచికాదేవి దాసి లక్ష్మితో సంభాషిస్తూ వుంటుంది.

మహారాణి : లక్ష్మీ, నీవే మాకు నమ్మిన దాసివి. [కొంత ధనంతో కూడిన సంచిని ఆమె కిచ్చి] ఇదుగో, ఈ ధనం తీసుకుని నీవు పురుష వేషం ధరించి మా యువరాజుకు ఏకైక కుమారుడైన చెంగ మలదాసుడిని రహస్యంగా నాగపట్టణానికి గొనిపోయి- అక్కడ మహారాజులుంగారి మిత్రుడైన వర్తక శ్రేష్ఠుడు

న్నాడు-ఆయన గృహంలో అతణ్ణి భద్రంగా పెంచి పెద్దవాణ్ణి చెయ్యి. పసివాడు చెంగమలదాసు తన గదిలో నిద్రపోతు న్నాడు. ఆ చిట్టి నాయన పెద్దవాడయాక నిన్ను మహారాజై పోషిస్తాడు- ఇంక మారు మాట చెప్పకు [లక్ష్మి దుఃఖిస్తూ ఏదో చెప్పబోగా ఆమెను వారించి] అలాగ కంటనీరు పెట్టు కోకూడదు. మేమంతా ఎక్కడికి పోతున్నాం? వైకుంఠానికి! సంతోషించు. యువరాజకుమారుని ప్రాణం భద్రం సుమా: తంజావూరు సింహాసనానికి ఆయనే ఉత్తరాధికారి. ఇంక వెళ్ళు. [లక్ష్మి మహారాణికి నమస్కరించి కళ్ళు తుడుచు కుంటూ నిష్క్రమించిన పిమ్మట, తక్కిన రాజవనిత లందరను ఉద్దేశించి] కాంతామణులారా! అందరి హస్తాలలోనూ విచ్చు కత్తులు సిద్ధంగా వున్నాయి కాదూ?

ఇందిర : [ప్రవేశించి] అమ్మా, నేను మనవి చేస్తే విన్నారు కారు. నా ఒక్కతె ప్రాణం కోసం ఇందరి ప్రాణాలు....

మహారాణి : తల్లీ, నువ్వు లేకపోతే మా కీ తనువు లెందుకు చెప్పు? నువ్వు మా కళ్ళ వెలుగువు. నీ అన్న యువరాజు మన్నారు స్వామి అన్యాయంగా రాజాగ్రహానికి గురి అయి జ్ఞానం వచ్చి నప్పటినుంచీ కూడా కఠోర కారాగారంలోనే వాసం చేస్తున్నాడు కదా?

ఇందిర : అమ్మా, అలాగ చూడండి, ఆ వచ్చేవాడు—

మహారాణి : రాజాజ్ఞను గొనితెస్తున్న భటుడు కాబోలు; మహారాజావారు క్షేమమేకద? [తేరిపార చూచి సంభ్రమంగా] ఆఁ, ఎవరు? ఇది నిజమేనా!

యువరాజు మన్నారుస్వామి : [ప్రవేశించి] తల్లిగారికి యువరాజు మన్నారు స్వామి నమస్కరిస్తున్నాడు. [నమస్కరిస్తాడు]

మహారాణి : నాయనా, ఎన్నాళ్ళకి నాకు కన్నులవిందు చేశావయ్యా! [ఆనందంతో కంట తడి పెట్టుకుంటూ దగ్గరకు తీసుకొంటుంది]

ఇందిర : అన్నా! [ఆనందాతిరేకంతో అతని చేయి పట్టుకుంటుంది.]

మన్నారు : [ప్రేమతో ఆమె రెండు చేతులూ పట్టుకుని] చెల్లీ!

మహారాణి : అయితే ఇప్పుడు నీకు విముక్తి కలిగిందా, నా తండ్రీ— ఎంత కష్టం అనుభవించావో కదా ఆ చెరసాలలో-

మన్నారు : ఆ చెరసాల ద్వారాలు తెరిచారు; వైకుంఠ ద్వారాలు కూడా తెరిచే వుంచారు మన అందరికోసం—

మహారాణి : ఏమిటి, మహారాజాజ్ఞ అయినదా?

మన్నారు : [కొంచెం గద్గదంగా] అవును, తల్లీ—

మహారాణి : [డగ్గుత్తికతో] నాయనా—

మన్నారు : అమ్మగారూ, చెల్లీ, సెలవు మరి. ఇప్పుడింక జాలికీ, ప్రేమకీ తావూ, వ్యవధీ లేవు. శత్రువులు అప్పుడే శ్రీ రాజగోపాల స్వామివారి ఆలయ ప్రాంగణం సమీపించేశారు. తండ్రిగారు నా కోసం ఎదురు చూస్తూ వుంటారు. మళ్ళీ ఆ వైకుంఠంలో సుఖంగా కలుసుకుందాం—

మహారాణి : నాయనా, మహారాజావారికి నా నమస్కారములు చెప్పు. [ఇందిర వైపు తిరిగి] తల్లీ—

ఇందిర : [మన్నారు స్వామితో] అన్నా! [రుద్ధకంఠంతో] నాయన గారికీ, నీకూ నా నమస్కారములు. సెలవు.

మన్నారు : నా హృదయం ఇప్పు డొక పెద్ద పాషాణం !

మహారాణి : ఇంక ఆలస్య మెందుకు ? వీరకాంతామణులారా ! మీ విధి నిర్వర్తించండి–

మన్నారు : [అక్కడనుంచి గిరున తిరిగి వెడుతూ] ముట్టించరా, మందు కుండలకి అగ్గి [భటులను ఆజ్ఞాపిస్తాడు]

రాజవనితల హాహాకారాలు- రంగస్థలం ఒక్కమారుగా చీకటిమయ మౌతుంది. మందుగుండు ప్రేలిన భయంకర ధ్వనులు వినిపిస్తాయి.

(తెర పడుతుంది)

## ఆరవ రంగం

తంజావూరు కోటలో, రాజప్రాసాదంముందు - యుద్ధవేషంలో మహారాజు విజయరాఘవుడు, యువరాజు మన్నారుస్వామి ప్రవేశిస్తారు.

విజయ : నాయనా, మన్నారు స్వామీ–విన్నాం మందు గనుల ప్రేలుడు ధ్వనులు. [ఒక ఖడ్గాన్ని యువరాజుకు అందిస్తూ] ఇక యీ కరవాలం తీసుకుని ముందుకు శత్రువులపైకి దుముకు– అరుగో- [యుద్ధ కలకలం వినబడుతుంది]

మన్నారు : మహాప్రసాదం, నాయనగారూ ! జయ, శ్రీ రాజగోపాల స్వామికీజై ! నాయనగారూ, నమస్కారం ! [యుద్ధభూమిలోకి ఉరుకుతాడు]

విజయ : ఏడీ, దళవాయి రగప్పనాయకుడు ?

దళవాయి : [ప్రవేశించి] చిత్తం, మహాప్రభూ-

విజయ : నీవు నా కుడిప్రక్క వుండు [తక్కిన సైనికులను ఉద్దేశించి]

వీర శిఖామణులారా! ఇంక పదండి. [దళవాయితో కలిసి నిష్క్రమిస్తాడు]

నేపథ్యంలో—"జయ, శ్రీ వీరవిజయ రాఘవనాయక మహారాజులుం గారికి జై" అని జయ జయధ్వానాలు

భటుడు : [ప్రవేశించి, యుద్ధభూమివైపు ఆసక్తితో చూస్తూ] ఆహా! వీర విజయ రాఘవనాయనింగారి! ప్రతాపం వారి ఎనభైయేళ్ళ జీవితంలోను ఇదే తొలి యుద్ధమూ, తుది యుద్ధమూను!

రెం-భటుడు : [ప్రవేసించి] అయితేనో, ఏం పరాక్రమం!.... అరే ఒక్క వ్రేటుతో అయిదుగురు శత్రుయోధులు తుత్తునియలై పోయారే!

మొ-భటుడు : యువరాజు మన్నారుదేవులు మాత్రం?.... అటుచూడు- అరరే! దుర్మార్గుడు మధుర దళవాయి, అలసి పడిపోయిన మహారాజు, యువరాజుల ఉభయుల శిరస్సులను ఖండించి.... హరి, హరీ! ....ఇంక మన మిక్కడ నిలువకూడదు; పద— [ఇద్దరూ భయసంభ్రమాలతో పరుగెడుతూ నిష్క్రమిస్తారు]

(తెర పడుతుంది)



పాత్రలు :

గౌతముడు

విశ్వామిత్రుడు

శ్రీరాముడు

లక్ష్మణుడు

ఇంద్రుడు

అహల్య

వాసంతిక

---

# శాపవిమోచనం

—:o:—

[నాంది]

ఆ. వె. ఇంద్రుగూడి తనకు నెగ్గుసేయ నహల్య
గౌతముండు రాయి గా శపించె;
నామె జాలి ననఘురాలి గావించి క-
ల్యాణ రామచంద్రు డాదరించె!

---

మిథిలాపుర పరిసర ప్రాంతంలో గౌతమ మహర్షి ఆశ్రమం- ఒకనాటి ప్రాతఃకాలమున విశ్వామిత్ర మహాముని శ్రీరామ లక్ష్మణులను వెంటబెట్టుకొని ప్రవేశిస్తాడు

విశ్వామిత్రుడు : బిడ్డలారా! మిమ్ము వేకువ జామున లేపి చాల దూరము నడిపించితిని: మీ లేత పాదములు కందలేదుగద?

లక్ష్మణుడు : ఎంతమాట! గురుదేవా, మీరు చెప్పు అద్భుత కథలను వినుచుండ నింకను ఎంతదూరమైన అవలీలగ నడువగలము.

రాముడు : ఆర్యా! ఈ తపోవన మెవరిదో ఇచ్చట చల్లగా నున్నది; కొంచెముసేపు విశ్రమింతమా?

విశ్వా : శ్రీరామా, తప్పక అట్లే కావింతము— ఏమయ్యా, గండకీ నదీ తీరమును దాటినప్పటినుండియు నీ వేదో దీర్ఘముగ నాలోచించు చున్నట్లే అగపడుచున్నావు?

లక్ష్మ : ఆడు దానిని హత్య చేసితినే అను కించ అన్నగారి నింకను బాధించుచున్న దనుకొందును.

రాము : అబ్బే, ఏమియు లేదు ; క్షమింపుడు.

విశ్వా : కుమారా, ఇటు చూడుము : ఆడుదైన నేమి, మగవాడైన నేమి- దుష్టులను శిక్షించుట, శిష్టులను రక్షించుట రాజైన వానికి ధర్మము. తాటక స్త్రీ యైనను పుణ్య యజ్ఞముల బూది పాలు చేయుచుండిన రాక్షసి. ఒక్కదానవిని వధించి పెక్కురు మునులకు నీవు మేలు చేసినావు ; వారందరు ఇందుకు నీ కెల్లప్పుడు కృతజ్ఞులు— ఏమందువు ?

రాము : అవును: ధర్మపరిపాలనమునందు రాజుకు దయదాక్షిణ్యములతో నిమిత్తములేదు ; దుష్టచరిత్రులను దండించితీర వలయును.

లక్ష్మ : ఆహా ! ఈ జలయంత్రము ప్రక్క నున్న ఈ శిలా విగ్రహ మెంత రమణీయముగ నున్నది !

రాము : గురుదేవా, ఈ సుందర స్త్రీ మూర్తి ఏమహానుభావురాలిదో కదా ? మునులు లేక జనసూన్యమయ్యును అపూర్వ శోభతో నలరారు నీ పుణ్యాశ్రమ మే ఋషి పుంగవునిదై యుండును ? [ఆ విగ్రహమును స్పృశించబోవును]

విశ్వా : రామచంద్రా, ఆగుము ; ఆ శిలాప్రతిమ నింకను ముట్టు కొనకుము.

రాము : చిత్తము : తాకను, పరవనిత గదా.

విశ్వా : [నవ్వి] చూచితివా శిల్పచాతుర్యము ? రాతిబొమ్మ చైతన్య యుక్తమగు భామినివలె భ్రమగొల్పుచున్నది. అయినను, నీవు దీనిని స్పృశింపవలసిన ప్రయోజన మున్నది కూడను.

రాము : [ఆశ్చర్యముతో] అదియేమి?

లక్ష్మ : చిత్రముగ నున్నదే!

విశ్వా : ఈ యాశ్రమమునందు పూర్వ మొక యద్భుతమైన విషాద గాథ జరిగినది.

లక్ష్మ : విషాధ గాథయా?

రాము : ఏమి, పవిత్రమైన మున్యాశ్రమమునందు విషాదమా? దీనిని ఏ ఋషిసత్తముడు నిర్మించినాడు?

విశ్వా : రండు; ఈ శిలావేదికపై గూర్చుండుడు— [రంగస్థలముపై ఎడమ ప్రక్కను గల శిలావేదిక కడకు వారిని తోడ్కొని పోయికూర్చుండజేసి] ఈ యాశ్రమమును గౌతముడను మహర్షి నిర్మించి చిరకాల మిచట తపస్సు చేసినాడు. ఆయన మహా మహి మాన్వితుడు.

లక్ష్మ : మహర్షి కదా!

విశ్వా : వినుడు : ఆయన—

ఏటి లోతుల దోగి రానేగు నపుడు
నాటిపోయిన నివరి ధాన్యంబు, మగుడి
వచ్చునంతకు బండిన, వాని వండి
భోజనము సేయునట్టి తపోధనుండు!

రాము : ఆహా!

విశ్వా : లోక సంగ్రహము నపేక్షించి ధర్మశాస్త్రమును రచించిన కర్మయోగి ఆయన.

లక్ష్మ : అయిన నీమె ఎవరు?

విశ్వా : ఉండవోయి : ఈమె ఆయనకు భార్య ; బ్రహ్మమానస పుత్రిక యగు అహల్యాదేవి.

లక్ష్మ : ఇందు విషాద కారణ మేమున్నది ?

రాము : లక్ష్మణా, కథను పూర్తిగ జెప్పనీయక అంతరాయమును గలిగింతువేమి ?

లక్ష్మ : క్షమింపుడు.

విశ్వా : లక్ష్మణ కుమారునకు దొందర ఎక్కువ, అంతయు చెప్పెదను.— చూచితిరి కదా, అహల్యాదేవి చాల అందగత్తె. ఈమె మొదటి నుండియు దేవేంద్రుని వలచినది. కాని, బ్రహ్మదేవుడు భూప్రదక్షిణము చేసి అందరికంటె ముందుగా వచ్చిన వానికి తన కూతురునిచ్చి పెండ్లి సేతునని స్వయంవరము చాటింపించినాడు—

లక్ష్మ : ఏమి- దేవేంద్రుడు రాలేకపోయినాడా ?

విశ్వా : వచ్చినాడు. కాని—

రాము : స్వయంవరము జరుగలేదు కాబోలును—

విశ్వా : కాదు, గౌతముడు సకలశాస్త్రకోవిదుడు గదా : గోప్రదక్షిణము చేసిన భూప్రదక్షిణము చేసిన ఫలము కలుగునని తెలిసిన వాడైనందున, వెంటనే తన యావుచుట్టును తిరిగి బ్రహ్మ వద్దకు వెళ్ళి తనకు కన్య నిమ్మని కోరినాడు.

లక్ష్మ : ఆఁ, ఎంత మోసము !

రాము : తమ్ముడూ ! [వారించును]

విశ్వా : మోసము కాదు, నాయనా. అది ధర్మశాస్త్రము ! అదికాక, గౌతముడు ప్రణయ దేవతకు పూజారి ; సృష్టి యందలి

సౌందర్యమును ఆయన ఉపాసించువాడు. అందువలన అపూర్వ లావణ్య వతియగు అహల్యాదేవిని ప్రేమించి ఆమె ప్రాణి గ్రహణము చేసినాడు. నిజముగా విమానముపై భూమిని చుట్టి వచ్చిన వారిలో ఇంద్రుడే ప్రప్రథముడు.

రామ : యుక్తికి, శక్తికి చైతన్యమునకు జడమునకు గల తారతమ్యమును గ్రహించితివా, తమ్ముడూ?

లక్ష్మ : గ్రహించుచున్నాను.

విశ్వా : పుణ్య దంపతులైన అహల్యా గౌతములు ఈ పావనాశ్రమమునందు చాలా కాలమువరకు గాపురము చేసిరి. ఒకనాటి ప్రాతఃకాలమునందు గౌతమముని స్నానమునకై ఏటి కేగుచు —అటు చూడుడు: మీకు దివ్యదృష్టిని ప్రసాదించుచున్నాను—

శ్రీరామలక్ష్మణులు పార్శ్వ రంగము నుంచి విశ్వామిత్రుడు చూపిన వైపు తదేకధ్యానముగ తిలకించుచుందురు. ఇంతలో గౌతముడు రంగముపై ప్రవేశించును.

రాము : తమ్ముడూ, పూజ్యులు గౌతములవారికి నమస్కరింపుము— [తాను నమస్కరించును.]

లక్ష్మ : [నమస్కరింపుచు] అరుగో, ఏమీ యద్భుతము! ఇంద్రజాలమువలె ఈ కథయంతయు కన్నులకు కట్టినట్టు జరుగుచున్నదేమి!

విశ్వా : బిడ్డలారా, అటు చూడుడు: గౌతముడు—

(కోడి కూయును)

గౌతముడు : [మధ్య రంగమునకు పరిక్రమించి]—

పరమ సౌందర్యదర్శనా పారదాహ
తాపశాంతి కహల్యాలతామృతాంగి,
ధర్మశాస్త్రార్థ సూత్ర బద్ధయగు పత్ని
కలిగియును మనశ్శాంతి కలుగనైతి!

ఇక ఈ జీవితమున కింతే కాబోలును—ఎవరు వారు ?

వాసంతిక : [ప్రవేశించి] కులపతి గౌతమమహర్షులవారికి అంతేవాసిని వాసంతిక నమస్కరించుచున్నది—

గౌత : కుమారీ, కల్యాణమస్తు! [ప్రక్కనే చెట్టుకొమ్మలకు వ్రేలాడదీయబడివున్న పంజరములోని గోరువంక "ఎవరు వారు ?" అనును. చిలుక "పీటవెయ్యి, పీటవెయ్యి" అనును]—పాపము, ఈ శారికా కీరములకు కలత నిద్దురయైనది. ఈ పిట్టలను బట్టి పంజరములలో బంధించిన వారెవరు ?

వాసం : క్షమింపుడు. బంధించినది అహల్యాదేవి ; పెద్ద లేతేర మరియాద మాటలు పలుక నేర్పినది నేను.

గౌత : అయ్యో, భూమ్యాకాశముల మధ్య స్వేచ్ఛగా తిరుగు పక్షులను కొయ్య గోడల మధ్య నిర్బంధించుట పాపమమ్మా. వీనినిప్పుడు నేను విడిచిపెట్టినచో నీకు కోపము రాదు కదా ?

వాసం : అమ్మ ఏమనునో—

గౌత : పోనిమ్ము, ఉదయ మామెతో చెప్పి వీనిని విడిచి పుచ్చుము ; ఏమి ?

వాసం : చిత్తము.

లక్ష్మ : [పార్శ్వ రంగమున, అపవారించి] ఆమె మనస్సు తనపై లగ్నము కాలేదని తెలిసియు నీయన అహల్యాదేవి నేల బంధించినాడు ? ఆమెకు మాత్రము స్వేచ్ఛ వలదా ?

రాము : లక్ష్మణా ! [వారించును]

విశ్వా : మనుష్యులకు, మృగ పక్ష్యాదులకు ఒకటే మంత్రము పనికి రాదయ్యా : "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి !" అదికాక, గౌతముడు ఎప్పటికైనను ఆమె మనస్సు మారక పోవునా అనుకున్నాడు-

గౌత : [మధ్యరంగమున, వాసంతికతో] నేను ఏటికి స్నానమున కేగుచున్నాను— ఈ చలిగాలిలో నీవింత పెందలకడ నేల లేచితివమ్మా ?

వాసం : అమ్మకు సాయము—

గౌత : ఏమి, ఆమె కూడా అప్పుడే నిద్ర లేచినదా ?

వాసం : అసలు నిద్ర పోనేలేదు.

గౌత : [ఆశ్చర్యముతో] ఆఁ !

నేపథ్యమున అహల్య పాట వినిపించును

వాసం : అదుగో. అమ్మ ఏమో పాడుచున్నది-అదేమి పాపమో కాని, ఆమె కూడ తమ వలెనే ఎప్పుడు నేదియో ఆలోచించుచునే యుండును ; పలుకరించిన మనసిచ్చి మాటాడదు.

గౌత : అదియే నేనును ఆలోచించుచున్నాను. నీవు మాత్రము ఆమెకు ఆనందము కలుగునట్లు మసలుము. నేనింక పోయి వచ్చెదను. వచ్చు సరికి పూవులు కోసి, పూజాద్రవ్యముల నాయత్తము చేసి యుంచుడు. [నిష్క్రమించును]

లక్ష్మ : [పార్శ్వరంగమున, అపవారించి] గౌతములు నివరి ధాన్యమును నాటి పోలేదేమి ?

విశ్వా : మనోవ్యాకులతచే మరచి యుండును.

వాసం : [మధ్య రంగమున] అమ్మా, అహల్యాదేవీ! అహల్యాదేవీ! [పిలుచుచు ముందుకు బోవును]

అహల్య : [పాడుచు ప్రవేశించును]

"ఎన్నాళ్ళని, ఎన్నాళ్ళని యీ జీవితయాత్ర ?
ఎండిపోవకుండునె యెలప్రాయపు మధుపాత్ర ?

వలపు పెదవులకు కరవై,
తలపు తొందరల బరువై,
పరువిడ తెలియని తెరువై,
పరిమళ మెరుగని విరియై !.... ఎన్నాళ్ళని ?—

మంటికి మింటికి నొకపై
మఘవు ధనువు మెరయ కున్న,
మండిపోవు నెండమావు
వంటి యాస వదలకున్న .... ఎన్నాళ్ళని ?—

మదనతాపమున కెరయై,
మరపురాని దెదో కొరయై !.... ఎన్నాళ్ళని ?—"

వాసం : [అహల్యను వెనుక వైపునుంచి వచ్చి] అహల్యా! [పలుకరించును]

అహల్య : [పాట నాపి] అబ్బ, ఉలికి పడినానే : కులపతి యను కొన్నాను.

వాసం : కులపతి స్నానమున కేగినారు.— అవునుగాని, నీ మనస్సు లోని దిగులేదో నాతో చెప్పరాదా ?

అహల్య : దిగు లేమున్నది? చెప్పిన ప్రయోజనము మాత్ర మేమున్నది?

వాసం : కొంత బరువు తగ్గును కాదా ?

అహల్య : వాసంతికా, ఎన్నడు పెండ్లి చేసికొనవని నీవు నా దగ్గర ఒట్టు పెట్టుకొనుము-

వాసం : ఇది నీకు న్యాయమా ? అయినను—

అహల్య : నా వివాహమై పంద్రెండేండ్లయియు ండునందువా ?

వాసం : ఆ, నేటికో, రేపటికో— అయిన ?

అహల్య : ఏమియు లేదు— అబ్బ, వాసంతికా, నా కెందుకో మరణింప వలెనని కోరిక కలుగుచున్నదే ! ఇంక బ్రతుకలేను—

వాసం : ఛీ, ఇట్టి అమంగళవాక్యము లాడకమ్మా మరి.

అహల్య : కాదు కాని, సఖీ, నిజముగ భూమిచుట్టును ప్రదక్షిణము చేసి వచ్చినచో ఎంత కాలము పట్టునందువు ?

వాసం : శీఘ్రగతినైనచో పంద్రెండేండ్లు పట్టు నందురు : అది యెందు కిప్పుడు ?

అహల్య : ఏమియులేదు, ఊరకే అడిగితిని.

వాసం : నేను గ్రహించితి నమ్మా : దేవేంద్రు డెప్పటికైన భూప్రద క్షిణము పూర్తి చేసుకొనివచ్చి ని న్ననుగ్రహించునని క నీ యాలోచనము ?

అహల్య : వాసంతికా, నాది నికృష్ట జీవితమే. నామీద జాలిపడకుము.

వాసం : వెర్రితల్లీ! కులపతి బహు యోగ్యులమ్మా, నీ పూర్వపుణ్య వశమున నీకు భర్తయైనారు.

అహల్య : నా తండ్రిగారి దగ్గర కుయుక్తి చేసి నన్ను వంచించి పాణి గ్రహణము చేసినారు.

వాసం : అమ్మా, అయినదేమో అయినది: ఇప్పుడు కులపతి నీకు భర్త. నీవు నిష్కలుషముగ బత్నీత్వము నిర్వహింపవల యును; వారి కపచారము తలపెట్టరాదు సుమా.

అహల్య : సఖీ, నీవు చెప్పినదే నిజము [నిట్టూర్చును]

వాసం : అదియును గాక, దేవేంద్రుడు తుమ్మెద వలె నీచుడు—

అహల్య : [కోపముగా] వాసంతికా, ఒడలు దగ్గర పెట్టుకొని మరి మాట్లాడు చుంటివా? నీ చనవు మితిమీరు చున్నది.— [కొంచెము తాళి.] వాసంతికా, [చేయి పట్టుకొని, జాలిగా] క్షమింపుము, చెలీ; ఒడలు తెలియకేమో యంటిని.

వాసం : కాదమ్మా. అతని కొక్కతెను నమ్మి కూర్చుండుటకు తీరదు: బహుపత్నీవ్రతుడు.

అహల్య : అదియే నాఆశాలతిక నింకను మాడిపోకుండ చిగురింప జేయు చున్నది. కాని, మరచిపోవుటకు బ్రయత్నించెదను.

వాసం : అది సరియైన మాట. నేడో, రేపో అత డిచ్చటికి రావచ్చును. అప్పుడు నీవు చాల జాగరూకతో మెలగవలయును సుమా.

అహల్య : ఏమోనే, ఆయన తీరావచ్చి నా కెదురుగ నిలిచినచో నన్ను నేనే నమ్మలేను. నీవు మాత్రము నన్ను విడిచిపెట్టకుండ నీడవలె చూచుకొనవలయునుసుమా.

వాసం : నాకు చెప్పవలయునా ? అన్నట్టు, ఏటి కేగుచు కులపతి మన పంజరములలోని శారికా కీరములను విడిచివెట్టవలయునని ఆజ్ఞాపించినారు.

అహల్య : నిజమే! అవును వాని నైనను స్వేచ్ఛావాయువుల బీల్చుచు హాయిగా బ్రతుకనిమ్ము.

వాసం : సఖీ! ఇప్పు డింక బెంగ తీరిపోయినది కద? ఈ దృఢ సంకల్పమును జ్ఞప్తియం దుంచుకొనుము. — మరి, పూజా ద్రవ్యములను సేకరించుటకు పోయి వత్తమా?

అహల్య : పద. [వాసంతికతో కలిసి నిష్క్రమించును.]

(నేపథ్యమున బృందగానము)

ఉదయరాగములలో హృదయవేగమున
వెదకు నారామదేవిని గాంచినావె?
మరియాదగా దెంత మందమతివమ్మ,
పదవేమె, ప్రియసఖీ, బాగుండ దింక!

హేమశామంతికా ధామమ్ము నుండి,
శ్యామల తమాలతరుశాఖికల నిండి,
పూవుతీవెల నల్లు త్రోవలై,
గాలిపై తేలేటి నావలై,
తుమ్మెదల ఝుంకారతూర్యరావములతో....ఉదయ-

తరుణ సహకారాశ్రితలతావళులతోడ,
తలిరు శృంగారతోరణ ధోరణులతోడ,
సారె సారెకు మనోహర వేషముల చిత్ర-
సీమమై, సుమనోభి

రామమై, నవకుసుమ
దామమై,—వాసించి .... ఉదయ-

త్రోవ లన్నియు హంసతూలికలుగా, లేత
పాదాలకై పూల పానుపులుగా,
తావులై - అందాల కోవలై,
పులుగులై - వింతవె లుగులై -పులకించి.... ఉదయ-

వెదకి పూజాసుమమ్ములు చిదిమి యరుగు-
దేరవేబోక వే పోక తీరదు కద ?
భర్త గౌతముడు, మఘవుపైన మనసు—
ధర్మశాస్త్రము : పతిసేవ తప్పదు కద ?

అహల్య పూల సజ్జచేత గైకొని ప్రవేశించి, ఒక పారిజాత తరువు వంక తదేకధ్యానముగ చూచుచు నిలచి వుండును.

వాసం : [వెదకు కొనుచు, వచ్చి ఆయాసముతో] ఏమమ్మా. ఇంకను ఇచ్చటనే నిలిచిపోయినావు ?

అహల్య : వాసంతికా, ఈ పారిజాత తరువు ఒడలంత కన్నులు చేసికొని చూచుచున్నట్లు ఎట్లు చితుక పూచినదో చూడు ! పూజకైనను చూచి చూచి, నా చేతితో దీని కన్నుల నెట్లు పొడువగలను చెప్పుము ?

వాసం : ఇటు చూడుము, సఖీ ! నా చేమంతి మడి ఎట్లు మొగ్గలు విరియుచున్నదో ! పూలకు ఊపిరి సలుపనీయని గాలి కౌగిళ్ల లో నలగి రేపు ఈ పాటికి వాసనలు వాడి ఇదినశించును గదా !

అహల్య : ఏ యభాగ్యపతిప్రేమ యేర్చ వెడలి
యురగ దంష్ట్రల నెత్తురు లొలికె నిచట ?
ఒదవునే కాక యింత రక్తోజ్జ్వలంపు
గాంతు లిచటి మందారలతాంతములకు ?

వాసం : ఉండు, చెలీ : ఆకాశమున ఆ ఘంటా నాదము లేమై యుండు నందువు ? విమాన మొకటి ఎచ్చటనో మనకంటి కందకుండ తిరుగుచుండవలయును. కులపతి దేవగణము నీ వేళ ఆహ్వానించినట్లు లేదే ?

అహల్య : [విమానధ్వనిని శ్రద్ధగా ఆలకించుచు సాలోచనముగా] సఖీ అతడేమోనే !

వాసం : అత డెవరు ?—దేవేంద్రుడా ? సఖీ, నీకు మతి పోవుచున్నట్లున్నది— అదుగో, కులపతి గౌతములు వచ్చుచున్నారు : నేను దూరముగ బోయెదను. [నిష్క్రమించును]

అహల్య : సఖీ ! వాసంతికా ! [పిలుచును]

ఇంద్రుడు : [గౌతముని వేషంలో ప్రవేశించి] దేవీ ! ఎన్నాళ్ళకు !

అహల్య : అదేమి, అట్లు మాట్లాడుచున్నారు ? [సాశ్చర్యముగా] అంతయు నిప్పుడే కదా, మీరు ఏటికి స్నానమున కేగితిరని వాసంతిక చెప్పినది ?

ఇంద్రుడు : వాసంతికా ?— ఏ వాసంతిక ? ఆమె ఇచ్చటి కేల వచ్చినది ?

అహల్య : ఏమి విపరీతము ! ఇంకే వాసంతిక ? మన వాసంతికనే యెరుగరా ?

ఇంద్రుడు : [మోహవికారము ముప్పిరిగొన] అహల్యా ! లావణ్యమయీ, నిన్ను మరల దర్శించినంతనే నా హృదయము అనిర్వచనీ

యానందముతో పరవశ మౌతున్నది— ఆఁ- ఇక్కడింక మరెవ్వరును లేరు కదా?

అహల్య : లేరు, వాసంతికను పిలువమందురా?

ఇంద్రుడు : వలదు, వలదు. ఇంక దాపరిక మెందులకు? ఈ మాలతీనికుంజము ఎంత మనోహరముగా నున్నది!

అహల్య : ఇన్నేండ్లు గడిచి మీ కిప్పు డీ శృంగార వికార మేల కలుగుచున్నది? మనము చేసిన సంసారము చాలదా?

ఇంద్రుడు : దేవీ, నీ హృదయమును సరిగ గ్రహింప లేక నన్ను శపింతువనుకొంటిని: న న్నింకను నీవు ఆనవాలు పట్టనేలేదా?

అహల్య : ఏమి, మీ యాకారమున మార్పేమి యున్నది? కులపతి యవతారము!

ఇంద్రుడు : దేవీ, ఈ మూడు లోకములను ఏకచ్ఛత్రముగ బాలించు దేవేంద్రునిగూర్చి నీవు వినియుండలేదా?

అహల్య : ఆ మాట ఇప్పు డేల? న న్నింకను ఏల ఏడ్పించెదరు? నా కిది యొక పరీక్ష కాబోలును—

ఇంద్రుడు : అదికాదు, దేవీ; నేనే ఆ నిర్భాగ్యుడను, దేవేంద్రుడను!

అహల్య : [ససంభ్రమముగా] ఆఁ! [నమ్మజాలక] నా మీద మీకు జాలి లేదా? నా హృదయమును నిర్దయులై ఏల కాల్చెదరు?

ఇంద్రుడు : నీ కింకను సందేహమైన ఇటు చూడుము- [గడ్డమును, జడలను, కాషాయ దుప్పటమును తీసివైచి] ఇది నా స్వస్వరూపము. కామ రూపంబున ఒరులు నన్ను గుర్తు పట్టకుండ గౌతమవేషినై వచ్చినాను!

అహల్య : [విస్మయముతో] ఆఁ!....ఆఁ!– [అక్కడనుండి పారి పోవుటకు ప్రయత్నించును]

ఇంద్రుడు : [ఆమె చేయి పట్టుకొని] అయ్యో, అట్లు పారిపోయెదవేమి? ఉండుము—

అహల్య : నన్ను దయచేసి వదలుడు. [భయముతో వణకుతూ] వారి కపచారము చేసిన శపించివై చెదరు.

ఇంద్రుడు : దేవీ, భయములేదు.

అహల్య : క్షమింపుడు, [ఆతని చేతినుంచి విడిపించుకొనుచు] నన్ను పోవనిండు. వారు వచ్చు సమయము కూడనైనది. నా హృదయ మేలనో పంజర కీరమువలె రెప రెప కొట్టుకొనుచున్నది-

ఇంద్రుడు : ఏదీ, ఈలాగున నన్ను అనుకొనుము. [ఆమెను తనకు దగ్గరగ తీసుకొనును]

అహల్య : [ఆవేగముతో] నేను అభాగినిని. మిమ్ము చూచుచున్నంత సేపు నన్ను నేనే నమ్మలేను—

ఇంద్రుడు : పోనిమ్ము, నన్ను నమ్ముము. దేవీ, ఎరుంగుదుము గదా నా హృదయము నీవును, నీ హృదయము నేనును. ఈ శోభన లతానికుంజమున—ఇంకను దిగు లెందులకు. పద..

రంగస్థలము కొంచెముసేపు చీకటి మయ మగును. పిమ్మట సూర్యోదయారుణ కాంతులతో నది కాంతిమంత మగును.

గౌత : [ప్రవేశించి] వాసంతికా, వాసంతికా! [పిలుచును]

వాసం : [ప్రవేశించి] నమస్కారము—

గౌత : అహల్య ఏదీ?

వాసం : ఏమో. ఇప్పటివరకు మీతోడనే యుండెను గదా ?

గౌత : [సాశ్చర్యము గా] నాతోడనా ? [దివ్య దృష్టితో చూచి] ఓహో, నే ననుకొని నంతయు నైపోయినది—

వాసం : [విస్మితురాలై] అదేమి ?

గౌత చూచెదవుగాక[ఆగ్రహావేశంతో]—అహల్యా ! ...అహల్యా ! [పిలుచును] ఛీ, ఈ దుశ్చరిత్ర నామమింక యుచ్చరింప కూడదు.

వాసం : స్వామీ, స్వామీ ! మీభీషణాకారము జూడ నాకు భయమగు చున్నది—

గౌత : అడుగో పరమ తుచ్ఛుడు ! కపట వేషమున నే నింటలేని సమయము కాచికొని దానిని వంచించి పారిపోవు చున్నాడు. [క్రోధ పూరిత స్వరముతో] ఓరీ, దేవేంద్రా, దురాత్మా ! నీకు తగిన శాస్తి చేసెదను—

చూడ కనులుకుట్టి వీడు నా యిల్లాలి
కాపురంబు వల్లకాడుచేసి
పోవజూచినాడు కావున వీనికి
నొడలినిండ కన్ను లొాదవుగాక !

అహల్య : [పరుగున వచ్చి పతి పాదములిపై వ్రాలి దుఃఖింపుచు] నాథా! ఈ అహల్య నమాంగల్యను క్షమింపుడు. అనాలోచితముగ నపచార మొనరించిన మహా పాతకురాలిని.

గౌత : ఓసీ, పతితురాలా ! నా పాదములు తాకి నన్ను గూడ నపవి త్రుని గావింపకుము. చిరకాల సహవాసమునైన మది నెంచక

నాకే ద్రోహము నూహించిన నీవు, వాయు భక్షణవు, నిరాహారవు, భస్మ శాయినివియునై పాషాణమవై యిచట బడి యుండెదవు గాక! [శాప జలము జల్లును]

వాసం : [వలవల యేడ్చుచు] అయ్యయ్యో, శాపజలములుచేయి జారినవి: కుసుమ కోమల గాత్రియగు నా సఖి అప్పుడే కఠిన పాషాణ రూపమును దాల్చినది. ఇంక నే నెట్లు జీవింతును?

గౌత : కుమారీ! వాసంతికా! దుఃఖింపకుము. వలపు కోరిక తీరక కలగి యలజడి చెందిన యీమె చిన్ని హృదయ మిప్పుడు ప్రశాంతిని జెందినది. ఇంతకాలము నాతో సంసారము చేసిన యీమెపై నా కిప్పుడు జాలి కలుగుచున్నది.

వాసం : అంతయు మించి పోయినది.

గౌత : లేదు, వాసంతికా! ఈ అలోక సౌందర్య రాశిని, ఈ ప్రణయాధి దేవత నొక నికృష్ట శిలగా జేయుటకంటె ఒక దివ్య సుందర శిలా విగ్రహముగా రూపొంద జేయుచున్నాను.

చూచు చుండగనే గౌతమ మంత్రమహిమచే అహల్య ఒక సుందర పాషాణ విగ్రహముగా మారిపోవును.

వాసం : ఇందువల్ల ప్రయోజనమేమున్నది? నాకు మా అమ్మ ఇంక తిరిగి రాదుగదా? [వెక్కి వెక్కి ఏడ్చును.]

గౌత : వాసంతికా, వినుము: ఎప్పు డీ వనమునకు శ్రీ రామచంద్రుడు వచ్చి ఈ చతుర శిల్పమును స్పృశించునో అప్పు డీమె శాపవిముక్తయై ముద మందగలదు.

వాసం : నే నంతవరకు తల్లి చావు పిల్లనై తిరుగు చుందును— తమరో?

గౌత : నా మాటకేమి : నా మనస్సు విరక్తి నొందినది. నేను వింధ్యాద్రిని దాటి దక్షిణా పథమున అస్తగిరియందు ఉదయించుచున్న గోదావరి యను నదిని బట్టి అది సముద్రమును జేరు వరకు యాత్రచేయ నెంచితిని. రఘు రామచంద్రు డిచటికి వచ్చు కాలమునకు దిరిగి వత్తును, ఏమి ? ఇంక పోయి వచ్చెదను. [నిష్క్రమించును]

వాసం : [కాతర సర్వరముతో] అంతయు నింత యైనది; పవిత్రాశ్రమము పాప భూయిష్టమైనది. ఇంక నే నెచ్చటికి బోవలయును ? [శూన్యముగ జూచుచు నిష్క్రమించును.]

లక్ష్మ : [పార్శ్వ రంగమున] అబ్బ. నా మనస్సంతయు గలగి పోయినది : ఎంత విపరీతమైన గాథ!

రాము : [కన్నులు తుడుచుకొని] దివ్యదృష్టి మహిమచే ఇప్పుడిప్పుడే జరిగినట్టు కనులకు తోచిన ఈ విషాదాంత కథను జూడ నా హృదయమ్ము జాలితో ఆర్ద్రమై పోవుచున్నది. ఆర్యా! ఇంక నాలసింపనేల ? నా వలన నగునేని ఆమెనుద్ధరించు పద్ధతి సెలవిండు.

వాసంతిక నిష్క్రమణంతో చీకటి మయమై పోయిన రంగస్థలము తిరిగి వెలుగొందును.

విశ్వా : [శ్రీరామ లక్ష్మణులను విగ్రహము కడకు తోడ్కొనిపోయి, శ్రీరామునితో] వత్సా, రఘు రామచంద్రా! చూచితివి కదా, ఇంక చెప్పుట కేమున్నది ? నీవీశిలా విగ్రహమును స్పృశించి సజీవముగ నొనరింపుము.

శ్రీరాముడు ఒక్క త్రుటిసేపు ధ్యానముచేసి, శిలా విగ్రహమును స్పృశించినంతనే అది అహల్యగా మారి పోవును.

రాము : అమ్మా, నమస్కారము!

అహల్య : [మోకరించి తలవంచుకొని]–

"రామ! శమాభిరామ! రఘు
రామ! యశోధనకామ! దోర్బలో-
ద్దామ! యనేకనామ! నృప
తారకసోమ! నవాంబుదోజ్జ్వల
శ్యామ! ప్రతాపధామ! విమ
లాకృతి నిర్జితకామ! సద్గుణ
స్తోమ! మహాత్మ! నన్ను గృప
జూచితె: ధన్యత నొంది తిమ్మెయిన్!—"

నాయనా! కృతార్థురాలను; కృజ్ఞురాలను!

లక్ష్మ : [ఎదురుగా చూచుచు, ఆశ్చర్యముతో] వీ రెవరు?

విశ్వా : అడుగో. అన్నమాట తప్పకుండ గౌతమునిచంద్రుడు గూడ సమయమున కేతెంచినాడు.

రాము :
లక్ష్మ : } [గౌతముడు వచ్చి అహల్యచెంత నిలబడగానే] పూజ్యులు గౌతమముని దంపతులకు రఘుకుమారులు నమస్కరించు చున్నారు! [తలలు వంచి నమస్కరింతురు]

గౌత : తండ్రులారా! మా కుటుంబమును ధన్య మొనరించిన పావన మూర్తులు మీరు: మీకు కల్యాణమస్తు!

విశ్వా : తథాస్తు!

గౌత : [అహల్య చేతిని బట్టుకొని సాదరముగా లేవదీసి] అహల్యా, అనుగ్రహింపబడితిమి. మన మింక సెలవు తీసికొని హిమాలయ పర్వత ప్రాంతముల సుఖముగ తప మాచరించెదము గాక!— నాయనలారా! విశ్వామిత్ర మునీ! మరి మాకు సెలవా?

విశ్వా : ఆర్యా, ఈ మిథిలానగర ప్రభువు జనక మహారాజు తన తనయ సీతాదేవికి స్వయంవరము ప్రకటించినాడు: ఈ కుమారుల నచటికే గొంపోవు చుంటిని. మీ రుభయులు గూడ ఆ మంగళ కార్యమును దర్శించి మరి పోయిన ఎంతబాగుండును!

గౌత : అంతకంటె వాంఛనీయ మేమున్నది? మా వాసంతిక కూడ రాజపురోహితుడగు కుమారుడు శతానందుని వద్ద నున్నదని విందును.

అహల్య : ఎంతటి పుణ్యము!

విశ్వా : మాపటికే మనము రాజధానిని జేరవలయును. రేపు శ్రీరామచంద్రుడు జనకు నింట హరధనుస్సును పరీక్ష సేయును. ఆ పిమ్మట—

గౌత : అవశ్యము—

రాము : తమ్ముడూ, పెద్దల వాత్సల్యము మహాప్రసాదము గదా!

లక్ష్మ : కల్యాణ కారణము!

విశ్వా :
గౌత : } [ఏక కంఠముతో] తథాస్తు!
అహల్య :

(తెర పడును)

—

పాత్రలు:

గవరమ్మ

కొడుకు

శర్మ

డాక్టరు

పూజారి

ముష్టివాడు

---

# నిలువ నీడ

——:o:——

## ఒకటవ రంగం

ఊరి వెలుపల ఒక శిథిలమైన గుడిసెలో— చీకటి పడుతూ వుంటుంది. కూలితల్లి గవరమ్మ (వయస్సు 30 ఏళ్లు) ఒక మూల నుక్కి మంచంలో జ్వరంతో మూలుగుతున్న తన అయిదేళ్ళ పిల్లవాణ్ణి సముదాయిస్తూ, కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ వుంటుంది. ఇంకో మూల ఒక బుడ్డి దీపం కొడిగట్టి కునుకుతూ, దోమో, ఏదో పడినప్పుడల్లా పెద్దగా మండుతూ వుంటుంది. గుడిసెలో ఏవేవో వికృతాకారాలతో నీడలు అటూ, ఇటూ మసలుతున్నాయి. బయట ఆకాశంలో కారుమేఘం పట్టి కళ్ళు జిగేలుమనేలాగ మెరుస్తోంది. సాయంకాలం నించి ఒకటే ఈదురుగాలి.

గవరమ్మ : బాబా, పిలచావా ?- ఏం కావాలి ?

పిల్లవాడు : అమ్మా, చలే, కప్పు—ఉహుహుహుహు.

గవ : ఏం చెయ్యనురా, బాబా- నీ కిప్పుడు కప్పడానికి దుప్పట్లెక్కడనించి తేను ? నా దగ్గరగా జరుగు—అదీ, నా కొంగు కప్పుకో. ఏదో తినడానికి తిండి దొరికినా దొరక్కపోయినా ఎలాగో రోజులు వెళ్ళపుచ్చుతున్నా మనుకుంటూంటే నీకు వ్యాష్ణంకూడా ఇప్పుడే రావాలా, నా తండ్రీ ?- అబ్బ, ఏమి టివాళ, నాకే ఇంత చలేస్తోంది ।

పిల్ల : అమ్మా ।

గవ : బాబు ?

పిల్ల : బా బొచ్చాడా ?

గవ : వస్తారు, బాబూ ; కళ్ళు మూసుకు పడుకో.

పిల్ల : ఎక్కడికి కెళ్ళాడు ?

గవ : పొరుగూళ్ళో ఏదో పని దొరుకుతుందని వెళ్ళారు.

పిల్ల : ఇంకా రాడేం మరి ?

గవ : వస్తారు మరి....

పిల్ల : అమ్మా....!

గవ : ఆఁ ?

పిల్ల : అదేమిటి, అంత వెలుతు రొచ్చింది ?

గవ : ఆకాశం మెరుస్తోంది, బాబూ, మేఘం పట్టింది.

పిల్ల : వా నొస్తుందా ?

గవ : మన కొంపకి సాయం ఇప్పుడు వానకూడా వస్తే అడగక్కర్లేదు. అసలే సూర్యుడూ, చంద్రుడూ మన కెప్పుడూ ఇంట్లో సాయం- అదుగో, నే భయపడినంతా అయింది. చినుకులూ, గాలీ మొదలెట్టాయి- ఓరి దేముడా, మబ్బు దట్టంగా పట్టేసింది.

పిల్ల : ఈ వానలో బా బెలా వస్తాడే, అమ్మా ? తడిసిపోతాడేమోనే ?

గవ : భయంలేదు, బాబూ, నువ్వు పడుకో.

పిల్ల : అమ్మా, బాబు నాకు మందు తెస్తాడు కాదూ ?

గవ : తెస్తారు, బాబూ.

పిల్ల : నా కీ జ్వరం ఎప్పుడు తగ్గుతుంది ?

గవ : తెల్లవారే సరికి తగ్గిపోదూ ?

పిల్ల : అమ్మా, నీ కెప్పుడైనా యిలా జ్వరం వచ్చిందా ?

గవ : ఈ జ్వరం నా కొచ్చినా తీరిపోనురా, బాబూ!

పిల్ల : బాబుకో?

గవ : కళ్ళు మూసుకు పడుకోవు, తండ్రీ?

పిల్ల : అబ్బ, ఆ తలుపేసెయ్యవే, చలిగా లేస్తోంది.

గవ : తలుపు వేసే వుంది. వెలిసెల్లోం చొస్తోంది గాలి. ఏం, చలెక్కువగా వుందా? [పిల్లవాడి వొంటిమీద చెయ్యివేసి చూసి] అబ్బ, వీడి వొళ్ళు చుర్రుమని ఎలా కాగుతోందో!

పిల్ల : దీపం!.... దీపం!

దీపం రెప రెప కొట్టుకుని ఆరిపోతుంది.

గవ : సరి, అది కాస్తా కొండెక్కిందా?

పిల్ల : [భయంతో] అమ్మా, అమ్మా, ఎక్కడున్నావు?

గవ : నీ పక్కనే వున్నానుకాదు, బాబూ?

పిల్ల : నాకు భయం వేస్తోం దెందుకు?

గవ : అబ్బే, భయంలేదు; నే నుండగానే నీ దగ్గర?

పిల్ల : [చలితో] ఉహుహుహూ- నా మీద అలా నీళ్ళు చల్లుతున్నావెందుకు? అబ్బ, చలే, కప్పు; కప్పు మరీ....

గవ : అయ్యయ్యో, ఇంకేం చెయ్యను? ఇల్లు కురుస్తోంది కూడాను- ఉండు బాబూ, నీ మంచం కాస్త ఇలా జరపనీ. [మంచం ఈడుస్తుంది] ఏం చలి ఇది! ఎలాగ?

ఒక పెద్ద మెరపు మెరసి, పిడుగు పడుతుంది.

పిల్ల : అమ్మా ... అమ్మా!

గవ : బాబు?

పిల్ల : దేము డొచ్చిన ట్టున్నాడు చూడు- అడుగో, ఏం వెల్తురు!

గవ : అయ్యో, నా తండ్రీ! వీడికి తెలివి తప్పినట్టుంది. గుణం కూడా కామాల్ను. ఆ భగవంతు డెక్కడున్నాడో? ఏ డబ్బున్న మహారాజుల ఇంట్లోనో పుట్టక వీడు....

పిడుగులతో వర్షం, గాలీ, హెచ్చిపోతాయి. గుడిసె కూలిపోతూ వుంటుంది.

గవ : [బిగ్గరగా] అయ్యో, అయ్యో, ఇంకేముంది? ఈ కొంప కాస్తా కూలిపోతోంది- బాబా, నా బాబా!

పిల్ల : అమ్మా, అమ్మా! ఏమిటా చప్పుడు? ఎక్కడున్నావు?

గవ : ఇక్కడరా, బాబా! అయ్యో, ఈ వాసాలు విరిగి నెత్తిమీద పడిపోతున్నాయి. ఎవరైనా పుణ్యాత్ములు కాపాడండి. బాబూ, రక్షించండి. ఎలాగ బయట పడటం? నా బాబు నెత్తుకుని....

పిల్ల : అమ్మా! అమ్మా!

గవ : [స్తంభం విరిగి పడుతుంది] అయ్యయ్యో; చచ్చాను!

(తెర పడుతుంది)

## రెండవ రంగం

విరిగిన స్తంభం కూలిపడి కాలు విరిగిన గవరమ్మ, స్పృహ తప్పిన తన పిల్లగాణ్ణి బుజంమీద వేసుకొని, ఎలాగో ఈడ్చుకుంటూ ఆ ఘోరుగాలిలో, వానలోపడి తడిసి ముద్దఅయి ఊళ్ళోకి వచ్చి, శర్మ అనే ఒక గృహస్థు అరుగుమీద చేరి ఒక నిట్టూర్పు విడుస్తుంది. పిల్లవాడు మూలుగుతూ వుంటాడు.

శర్మ : [కిటికీ తెరిచి] ఎవరక్కడ, వీధిలో అరుగుమీద?

గవ : నేనండి, బాబూ-

శర్మ : నేనంటే ?

గవ : నా పేరు గవరమ్మండి.

శర్మ : గవరమ్మంటే ?

గవ : కూలి చేసుకుండేదాన్నండి, బాబూ.

శర్మ : కూలి చేసుకునేదానవా ? పెద్ద గవర్నరులాగ వచ్చి తలుపు కొట్టావు అర్ధరాత్రివేళ ; ఏం కావాలి నీకు ?

గవ : తమరు రక్షిస్తేనేగాని వీల్లేదండి.

శర్మ : వీల్లేదూ ? ఇంత వర్షంలో ఇంట్లో పడి వుండక ఇలా ఎందుకు వచ్చా వసలు ?

గవ : బాబుగారు, ఈ గాలివానకి నా యిల్లు కూలిపోయిందండి.

శర్మ : అయితే అందుకు నన్నేం చెయ్యమంటావు ? భగవంతుణ్ణను ; ఇదోవంక యీ రోజుల్లో : కాస్త వర్షం కురిస్తేసరి, మీ కేమో ఇళ్ళు కూలిపోతాయి. మే మేమో రక్షిస్తేనేగాని వీల్లేదు– వెళ్ళు వెళ్ళు.

గవ : నిజమేనండి, బాబుగారు.

శర్మ : ఇదుగో, రేపు మీ యిళ్ళు కూలిపోయిన వాళ్ళకోసం చందాలు వేయిస్తారు. వాళ్ళ దగ్గరకి వెళ్ళు. ఛీ, నిద్దరంతా పాడయి పోయింది.

గవ : నే నడుక్కోడానికి రాలేదండి. కాస్త తెల్లవారినదాకా ఇక్కడ తల దాచుకోనిస్తే చాలు నండి. తమ రిం కేమీ ఇవ్వ నక్కర్లేదు.

శర్మ : అయ్యో, మీ తలలు దాచుకోడానికే మరి మేము ఇంత డబ్బు పోసి యిళ్ళు కట్టించుకుంట. ఇంకా ఆ తడిగుడ్డలతో, చక్కగా

ముగ్గుపెట్టిన అరుగంతా తొక్కి తగలేసిందే కాకుండా—నడు, నడు.

గవ : కొంచెం కనికరించండి, బాబుగారు— వీడు నా కొడుకండి-

శర్మ : [వీధి తలుపు తీసి, గద్దిస్తూ] ఇంకా వెళ్ళలేదూ? నీ కెంతమంది సంతానం అని ని న్నిప్పుడేం కుశలప్రశ్న వెయ్యలేదు; నీక్కాదూ చెపుతూంట?

గవ : బాబూ, నా మనవి ఆలకించండి. ఈ కుఱ్ఱాడికి జ్వరమండి. కొంపకూలిపోయిందండి. స్తంభంపడి నా కాలు విరిగిపోయిందండి. వీ ణ్ణిలాగో యీడ్చుకొచ్చి యిక్కడ పడ్డానండి, ఈ హోరువానలో, యీ చలిబాధలో ఇం కెక్కడికీ కదలలేను, బాబుగారూ- అబ్బ....చలి....పక్కలు వొంచుకుపోతున్నాయి-కాలు....పిల్లాడు........జ్వరం....

శర్మ : నీకుసాయం ఒక జబ్బుకుఱ్ఱాడుకూడానా? చూడు, ఇక్కడికి దగ్గరగానే ఆసుపత్రివుంటుంది. అక్కడికి వెళ్ళు— మా అరుగు మీద లే.

గవ : కదలలేనండి, బాబూ, ఇంక....చలి.

శర్మ : ఏమిటి, కదలలేవూ? మంచి మొండిఎత్తే! నువ్వుముందు మా అరుగుమీదనించి లేస్తావా, లేదా?

గవ : లోపలికి రానండి, బాబూ— దొంగదాన్నికాదు, కాస్త కాపాడండి. తెల్లారీదాకా యిక్కడే పడుకోనివ్వండి.

శర్మ : లేకపోతే, లోపలికికూడా ప్రవేశిద్దామనుకున్నావు కాబోలు—దొంగదికాదుట! లే- లేచి,పోనీ ఆ ప్రక్కయింటిఅరుగుమీద పడుకో—పో.

గవ : ఆరూ తమరిలాగే....పిల్లగాడు తడిసిపోతాడు, బాబుగారూ.

శర్మ : అంత జాలీ. భయమూ వున్నదానవు, ఇప్పటిదాకా ఎందుకు తడిపావు వాణ్ణి? ఇదో వేషం; ముందు నువ్వక్కణ్ణించి లేస్తావా, లేదా? ఇదేంగోల ఇవాళరాత్రి మాకు? ఇలాగ కాదు—ఒరే వెంకన్నా....వెంకన్నా....ఇదెవరో దీన్ని మన అరుగుమీదనించి లేవగొట్టు.

గవ : అయ్యోబాబూ! .... పోనీలెండి, పోతాను. మీరు సుఖంగా వుండండి—బాబా! అబ్బా....చలి....

(తెర పడుతుంది)

## మూడవ రంగం

ఉనూరుమంటూ గవరమ్మ మళ్ళీ తన పిల్లవాణ్ణి బుజంమీద వేసుకుని వర్షంలో తడుస్తూ, బురదలో పడుతూ లేస్తూ దగ్గరగానే వున్న ఒక డాక్టరు గారి యిల్లు చేరి తలుపుకొట్టి, మెట్లమీద చతికిల బడుతుంది.

డాక్టరు : [తలుపు తీసి] ఎవరు నువ్వు?

గవ : [నీరసంగా] బాబూ, నేను కూలిదాన్నండి; తమరు వైద్యులు-

డాక్టరు : అదేమిటి, ఆ రెండు వృత్తులకి ఏం సంబంధం వుంది?

గవ : వీడు నా కొడుకండి.

డాక్టరు : అయితే?

పిల్ల : అమ్మా....[నీరసంగా] మంచినీళ్ళు.

గవ : అయ్యో నాయనా, ఇంత వాన కురుస్తూంటే నీకు గుక్కెడు మంచినీళ్ళివ్వలేక పోయానురా, తండ్రీ.

డాక్టరు : ఇంత వర్షంలో ఆ కుర్రాణ్ణెందుకు అలా తడుపుతున్నావు?

గవ : బాబూ, యీ గాలివానకి మా ఇల్లు కూలిపోయిందండి.... అబ్బా....చలి.

డాక్టరు : నీకేకాదు, అందరికీ చలి వేస్తోంది. త్వరగా చెప్పు.

గవ : వీడికి ఊష్టమండి, బాబుగారు : స్తంభం విరిగిపడి నా కాలు పోయిందండి. కాస్త ఏదైనా మందిప్పించి పుణ్యంకట్టుకోండి, బాబు....

డాక్టరు : నువ్వు కూలిపనికాదూ, చేస్తానన్నావు ?

గవ : చిత్తం.

పిల్ల : అమ్మా.... [మూలుగుతాడు]

గవ : నా బాబు !

డాక్టరు : చూడు, నాదగ్గర మందులేమీ లేవిప్పుడు. కాంపౌండరుకూడా లేడు.

గవ : అయ్యబాబు, నాకు ప్రాణాలుపోతున్నాయండి, బాబు, యీ చలితోటి.... అబ్బా.... తమకి తరవాత నాకు చేతనయింది ముట్టచెప్పుకుంటానండి, బాబయ్యగారు. నా పిల్లవాణ్ణెలాగైనా బ్రతికించి....

డాక్టరు : ను వ్వెక్కడ ఇచ్చుకోగలవులే, నాకు ఫీజు—

గవ : రక్షించండి. బాబు,- దిక్కుమాలినదాన్ని. వీడికి కప్పడానికి కాస్త గుడ్డముక్కఅయినా లేని పేదదాన్ని—ఉన్న బట్ట ముక్క ఒక్కటీ తడిసిపోయింది. చలి. చలి.... తమపేరు చెప్పుకుని బతుకుతామండి....

డాక్టరు : వాట్లన్నింటికీ ఏంలే....

గవ : అయ్యో, వీడి వొళ్ళంతా చల్లపడిపోతోందండి, బాబయ్యా.

డాక్టరు : అందుకనే, ఎలాగో అలాగ వీణ్ణింక ఆలస్యం చెయ్యకుండా, చూడు, పెద్ద ఆసుపత్రి వుంది, అక్కడికి తీసుకెళ్ళు. అక్కడ చూస్తారు వీణ్ణి- వెళ్ళు.

గవ : నేను కదిలే స్థితిలోలేను, బాబయ్యగారు. చలికి వొళ్ళు కొయ్య బారి పోయింది. ఈ కాలు—

డాక్టరు : ఇంక నీ యిష్టం ; నువ్వీ అరుగుమీద మాత్రం పడుకోకూడదు. నలుగురు పెద్దమనుష్యులూ వచ్చేపోయే యిళ్ళు.

గవ : తెల్లారేదాకానేనండి, బాబు. ఆ తరవాత....

డాక్టరు : ఓహోహ, నీకు నెమ్మదిగా చెపితే నచ్చటంలేదు. ఇక్కడ పడుకోకూడదని చెప్పానుకాదూ ? ఇంక వెళ్ళుమరి.

గవ : మీ పాదాలమీద పడి మొక్కుకుంటున్నాను, బాబూ.

డాక్టరు : నువ్వింకా ఆలస్యం చేస్తే ఇంకా మించిపోతుంది. వెంటనే వెళ్ళు పెద్ద ఆసుపత్రికి.

గవ : పోనీ, ఒక పాతగుడ్డ ముక్కైనా దయచేయించండి. నే నిది వరకెన్నడూ అడుక్కున్న దాన్ని కాదండి. ఏదో కష్టపడి కూలి చేసుకుని బ్రతుకుతున్నాను. ఇవాళ నాగతి యిలాగ....

డాక్టరు : పాతగుడ్డముక్క లెక్కణ్ణించి తెమ్మన్నావు ? కొత్తగుడ్డలకే కరువై పోతే పాతగుడ్డ లెలా వస్తాయి ? ఉంటే, ఇందాకనే ఇచ్చేవాణ్ణి. ఇంక పద.

గవ : అయ్యో బాబయ్యా....! బాబా.... అయ్యో భగవంతుడా ! ఏం రాత రాసిపెట్టావురా నాకు ?.... చలేస్తోందా, బాబా ?.... [పిల్లవాణ్ణి తీసి కని నెమ్మదిగా బయలుదేరుతుంది ఆ వర్షంలో]

డాక్టరు : [తలుపులు వేసి] వొదిలింది శని; అమ్మయ్య!....ఇంత ప్రళయం లోనూవచ్చి తలుపు కొడితే ఏదో పురిటికేసేదో అనుకున్నాను. ఛా; ఇలాంటి వాళ్ళకి వుచితంగా మందు లివ్వడానికే కాబోలు మేము ఇంత డబ్బూ. తగలేసి బోర్డులు కట్టుకుంట!

(తెర పడుతుంది)

## నాలుగవ రంగం

మనుష్యమాత్రు లెవరూ తనికి ఆశ్రయ మివ్వరని గ్రహించుకున్న గవరమ్మ కొయ్యబారిన పిల్లగాణ్ణి ఎత్తుకొని హృదయభారంతో, కాలు నొప్పితో ఆ గాఢాంధకారంలో, బురదసందులలో పడి ఎలాగైతేనేం తిన్నగా గ్రామం చివర వున్న ఈశ్వరాలయం చేరుతుంది. అక్కడనించి దేవుడు తమని బయటికి పొమ్మనడు గదా అని ధైర్యం తెచ్చుకుంటుంది. పిల్లగాణ్ణి మండపంలో పడుకోబెట్టి, తడిసిపోయిన తన చింకికొంగు పిడిచి మంచుగడ్డలాగ వున్న వాడి వొళ్ళు తుడుస్తూవుంటుంది, కాపీర్ణం కొద్దీని. తుదకు తనకే నీరసం వచ్చి మూలగడం మొదలు పెడుతుంది.

అర్చన పూర్తిచేసుకొని పూజారి గుడి తలుపు తాళంవేసి ఆ దారినే ఇంటికిపోతూ అనుమానంవచ్చి ఒకసారి ఆగుతాడు.

గవ : అబ్బా. చలి. చలి.... ఏంచలి!.... ఊహూహూహూ.... నా బాబు కప్పుడే వొళ్ళు చల్లబడిపోతోంది. బాబా.... బాబా.... నిద్దరో; హాయిగా నిద్దరో.... దిక్కులేని వాళ్ళకి దేవుడే దిక్కంటారు. ఈ దేవుడు గుళ్ళో అయినా మమ్మ ల్నెవరూ కదపకుండా తెల్లారీదాకా తలదాచుకోనిస్తే — ఉహూహూహూ.

ఒక పెద్ద మెరుపు మెరుస్తుంది.

పూజారి : అమ్మయ్య, అర్చన పూర్తి అయిందెలాగైతేనేం— అబ్బ, ఏం చలి. ఏంవర్షం [గవరమ్మను చూసి] ఏయ్, ఎవరా మండపంలో పడుకుని మూలుగుతున్నారు ?.... ఏం, మాట్లాడవు ? ఎవరు నువ్వు ?

గవ : నేనొక దిక్కుమాలిన పక్షిని, స్వామీ ?

పూజారి : ఏం, ఇక్కడ పడుకున్నావేం ? ఇక్కడికెలా వచ్చావు నువ్వు అసలు ?

గవ : తమరు పూజారులనుకుంటాను ?

పూజారి : అయితే ?....నువ్వెవరు ?

గవ : బాబూ, ఈ వర్షంలో నా కొంప కూలిపోయింది. పేదదాన్ని, జ్వరంతోవున్న నా కొడుకుని చంకపెట్టుకుని ఎవరి అరుగుమీద అయినా కాస్త తలదాచుకుందామని బయలుదేరాను.

పూజారి : ఇక్కడ కెందుకొచ్చావు ?

గవ : ఎవరి అరుగుమీదికి వెళ్ళినా అందరు మారాజులు నన్ను దొంగదాన్ని తరిమినట్టు తరిమేశారు. స్వామీ, నా కొడుకుకి స్పృహ లేదు. జ్వరంతో యీ వానలో తడిసిపోయాడు. కప్పుకోడానికి గుడ్డ ముక్కైనా లేదు. నేనూ, చచ్చిపోడానికి సిద్ధంగా వున్నాను, ఈ చలిలో....రామా ...రామా !.... ఆఖరికి ఈ స్వామిదగ్గర యింత నీడ దొరుకుతుందని వచ్చి యిక్కడ వొరిగాను.... అబ్బా !

పూజారి : ఏయ్. అలా పడుకోకు మళ్ళీని. ఇదేం సత్తరు వనుకున్నావేమిటి ? ఇక్కడ ఎవరూ పడుకోకూడదు, తెలిసిందా ? అందులోనూ పవిత్రంగా వుండవలసిన స్వామి కోవెలలో.

ఇలా రోగిష్టి వాళ్ళెవరూ వుండకూడదు. పెందరాళే లే; ఎక్కడికైనా వెళ్ళు, నీ కొడుకుని తీసుకుని-

గవ : దేముడికీ యీ ఎక్కువ తక్కువలూ అవీ వుంటాయా, స్వామీ? మావంటి దిక్కులేని వాళ్ళకి ఆయనే కాదూ దిక్కు?

పూజారి : అబ్బో, యీ వేదాంతానికేంలే, లే ముం దక్కడనించి-

గవ : న న్నిప్పుడు చంపినా నేను లేచే స్థితిలో లేను, స్వామీ— అబ్బా! బాధ!... చలి.... బాబా! ఏడీ నా బాబు?

పూజారి : ఏమిటి నీ మొండితనం? చెపుతోంటే వినబడటంలేదూ నీకు?

గవ : క్రిందటి జన్మలో ఏం పాపం చేసుకున్నానో?- ఏమిటీ వెలుగు! అదుగో స్వామి! దర్శనం ఇస్తున్నాడు!

పూజారి : తలుపులు తాళాలు వేసినా దర్శనం ఇస్తున్నాడు కాబోలు స్వామి నీకు? ఈ పిచ్చి కూతలకేంలే....లే.

గవ : అయ్యా. మొన్న ఈ గుడి ప్రహారీ గోడ పడిపోయినప్పుడు నేను కష్టపడి ఇటికలు మోసి స్వామివారికోసం ఆ గోడ కట్టాను. మండపానికి వెల్ల వేశాను. అది మరచిపోయా డంటారా అప్పుడే ఆయన?

పూజారి : ఓస్, నువ్వు శ్రమపడి కట్టేవేం ఈ గోడ? దానికి కూలి పుచ్చుకోలేదూ, పాపం? అందరి కూలీలలాగే నువ్వాను.

గవ : కూలి యిచ్చినా, యివ్వక పోయినా ఆయనేకాదూ మనల్ని అందర్నీ కాచి రక్షించేది? ఆ స్వామీ అవతలకి పొమ్మంటే ఇంక మనకి గతి ఏ ముంటుంది?

పూజారి : బాగుంది. నువ్వు కూలి పుచ్చుకొని గోడలో రెండు ఇటికరాళ్ళు వేశావుకదా అని యీ కోవెలలో నీకు హక్కుందంటా వేమిటి ? నువ్వు కూలికి వెళ్ళి కట్టిన భవంతు లన్నింటిలోనూ, నీ కంత హక్కు వుంటే ను వ్విప్పుడు యీ గుళ్ళోకి ఎందుకు వస్తావు ? ఇంకీ కబుర్లు కట్టిపెట్టి ముం దక్కడనుంచి లేచి వెళ్ళు. త్వరగా....

గవ : అయ్యో, రామచంద్రా !

పూజారి : లేవవేం....ఊఁ....

గవ : ఇక్కడకూడా లేడూ ఆ భగవంతుడు ?....స్వామీ....

పూజారి : దేవుడు లోపల వున్నాడులే-నువ్వు ముందు....

గవ ; స్వామీ, కనికరించండి.... చచ్చిపోతున్నాను- బాబా !

పూజారి : నువ్విలా కదిలీలాగ లేవు—రామదాసూ !....రామదాసూ !.... [కావలివాణ్ణి పిలుస్తాడు]

గవ ; ఓరి, భగవంతుడా ! అయ్యో....బాధ....చలి....

పూజారి : మీ రిప్పు డిక్క డేదైనా అవుతే రేపు పొద్దున్న గుడి అంతా బాగు చేయించలేక మధ్యని మేము ఇదవడానికా ? ఇదేం దేవుడి గుడి అనుకున్నావా మరొకటి అనుకున్నావా ? మరీ వస్తోంది, రామదాసూ !.... రావేం ఇలాగ ?

గవ : ఉహూహూహూహూ...పోనీండి, బాబూ, వెడతాను- బాబా !

పూజారి : వెళ్ళు, వెళ్ళు- త్వరగా....

గవ : గుమ్మం, గుమ్మం ఎక్కాను. ఒక్క మారాజూ కాస్త చోటివ్వ లేదు. పురుగును దులిపినట్టు తరిమేశారు.... మావంటి వాళ్ళం చస్తే ఎవడిక్కావాలి ?

పూజారి : ఇంకా ఏమిటలా గొణుగుతున్నావు ? లే-

గవ : బాబూ, కష్టాలు అందరికీ ఒకటేనండి.... రేపు మీ కొస్తే వున్నావాళ్ళు చూడొద్దండీ ?....

పూజారి : ఏమంటున్నావు ? ఏమిటి మాటలు ముదురు తున్నాయి ? శాపనా కారాలుకూడానా, నీ బ్రతుక్కిసాయం ? నా క్కూడా రోగం రావాలా ? ఇంకా మాట్లాడావంటే, చూడుమరి—

గవ : అందరి మనస్సులూ రాళ్ళే ! .... పేదవాళ్ళ బ్రతు కింతే .... దేవుడి సంతానంట : మనుషు లంతా ఒకటే అంటారు మళ్ళీని....

పూజారి ; ఏమి టమ్మీ, అక్కడికి నీ వుద్దేశం ? — ఈ రామదాసుగా డేమైపోయాడు సమయానికి ? — ఏమిరా ? ....

గవ : దేవుడు వర మిచ్చినా పూజారి వర మివ్వ లేదుట.... వెడుతున్నాను, బాబయ్యగారూ .... కేక లెయ్యకండి .... ఓపి కున్నంత సేపూ యీ కుర్రవా ణ్ణెత్తుకుని.... ఈ వానలో .... ఈ చలిలో.... అయ్యో !

[కుర్రవాణ్ణి బుజంమీద వేసుకుని మళ్ళీ బయలు దేరుతుంది.]

పూజారి : అమ్మయ్య, శని విరగ డయిం దిప్పటికి ! దిక్కుమాలిన పక్షులు ! ఎక్కడినుంచో వచ్చి ఇక్కడ దాపురించారు, నయమే, నడిచింది. అందులో ధర్మపన్నా లెన్ని ? జాలీ, అంతఃకరణ, అబ్బో !- ఒరేయ్, ఆ తలుపులు తాళాలువేసెయ్యి ఈ సారి — అబ్బ, ఏం చలి, ఏం చలి !

(తెర పడుతుంది)

## ఐదవ రంగం

చీకటిలో, మెరుపులలో, వానలో, బురదలో, హోరుగాలిలో, చలిలో ఊరివెలుపల ఒక చెట్టు క్రింద- పిల్లవాడిని ప్రక్కన వేసుకుని గవరమ్మ పడివుంటుంది.

ముష్టివాడు : [చుట్ట నోట్లో పెట్టుకుని, వొణుకుతూ ప్రవేశించి] ఓహోహో, ఏం వాన! ఏం చలి! ఈవాళ తెల్లవారీలాగ లేదు. ఎముకలు సున్నమై పోతున్నాయి.... ఉహుహుహు! ఈ చలిలో యీ చుట్టపీక దొరకడం నా అదృష్టం, నిన్నటినుంచి తిండిలేక పోతేనేం.... వాన వెలిసినట్టుంది. కాస్త యీ చెట్టు క్రిందచేరితే మంచిది. [ఏదో పని వున్నట్టు ఒక మోటారుకారు పెద్ద రాక్షసి దీపాలతో ఆ దారినే జోరుగా వెళ్ళిపోతుంది.] ఏవరో అదృష్ట వంతుడు: ఈ చలిలో వెచ్చగా కారులో షికారు చేస్తున్నాడు.— అరే, యీ చెట్టుక్రింద ఎవరో పడివున్నారు! ప్రక్కనో పిల్లాడు కూడా వున్నాడే! పాపం, యింత చలిలో ఎవరో నాలాగే అడుక్కునే వాళ్ళే అయి వుంటారు.—ఎవరు వారు ఆ చెట్టు క్రింద? .... మాట్లాడరేం? అరెరే. కొయ్యయి పోయారు కాబోలు పాపం! ....ఎక్కడా ఊపిరి వున్నట్టు లేదే: .... [సమీపించి] ఎవరమ్మా నువ్వు?

గవ : [పలవరింతగా] ఎవరు వారు?... భగవంతుడా? ఈ కష్టాలు నా కొద్దు... నీదగ్గరకే వస్తున్నాను. రక్షించు!... బాబా!

ముష్టి : భయంలేదమ్మా, ఇలాచూడు-[అగ్గిపుల్ల వెలిగించి చూసి] అయ్యో ఇంకేముంది. కళ్ళు మూసేసిందా? ఇంత ప్రపంచకంలో. ఈవిడ కెక్కడా నీడ దొరకలేదు కాబోలు! మావంటి బీదవాళ్ళ

బ్రతు కింతే మరి ...వీళ్ళ నిప్పుడీ చలీ, ఆకలీ. అవీ బాధ పెట్ట లేవింక ; నా కంటె అదృష్టవంతులు ! ఆ పుట్టించిన వాడి దగ్గర కెళ్ళిపోయారు హాయిగా ! పాడులోకం !...అబ్బ. చలి, ఏం చలి.... ఏం చలి !

(తెర పడుతుంది)



ఈ రచయితవే పునర్ముద్రణలో వున్న ఇతర గ్రంథములు

సావిత్రిమ్మగారి సంధ్యారాగం

[కథానికల సంపుటి]

పిచ్చివాండ్ల పంచాయతి

[నాటికల సంపుటి]